# అభినవ లోచనం

## (సాహిత్య వ్యాస సంకలనం)


రచన:

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

రీడర్, తెలుగుశాఖ,

హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం,

హైదరాబాదు.



ప్రచురణ:




రిజిస్టర్ నెం. 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

ABHINAVA LOCHANAM

Critical apprecition of some modern Telugu Poets

By Dr, G. V. SUBRAHMANYAM



యువభారతి ప్రచురణ : 89

ప్రథమ ముద్రణ : దుందుభి సంక్రాంతి - 14-1-1983.

ప్రతులు : 1,200

ముఖచిత్ర రచన : శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :

బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే

సికిందరాబాద్-500 003

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనము

తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001.

వెల రు. 16-00.

# యువభారతి పరిచయం



మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థకం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పందొమ్మిదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలు రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 88 పుస్తకాలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ ప్రయత్నించింది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 7,800 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 775 మంది, భారతీభూషణులుగా 100 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ—

హైదరాబాదు,
జనవరి 14, 1983

ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు, యువ భారతి.



# మా మాట

కవిత, కథ, నవల, నాటకంవంటి సృజనాత్మక సాహిత్య ప్రక్రియల అధ్యయన పరిధిని విస్తృతపరచడంలోను. సాహిత్యంపట్ల సదవగాహనను పెంపొందించడంలోను, సాహిత్యానికి సంబంధించిన ఉత్తమమైన విలువలను కాపాడుకొనడంలోను, విమర్శసాహితికి విశేష ప్రాధాన్యమున్న సంగతి విజ్ఞులెల్లరు ఎరిగినదే! విప్పిచెప్పే విమర్శకుడు లేనిదే, కప్పిచెప్పే ఆంతర్యం సహృదయులకు అవగతం కాదు.

ఇప్పుడు మేము మీ కందిస్తున్న 'అభినవలోచనం' ఎనిమది సాహిత్య విమర్శాత్మక వ్యాసాల సంకలనం. పాతకొత్త సాహిత్యాల పరామర్శ, నిన్నటికి నేటి కవుల ప్రతిభాసామర్థ్యాలు, ఈ వ్యాసాలలో డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు వినూత్నమైన ధోరణిలో, సుందరమైనభాషలో వివరించినారు. కొత్తపాతలమైపూతలకు అతీతమైన సాహిత్యాన్ని 'అభినవలోచనం'లో చూడగలగడమే సజీవమైన సాహిత్య విమర్శ అనిపించుకుంటుంది. శ్రీ సుబ్రహ్మణ్యంగారు ఈ పట్టున ఈ వ్యాసాలతో కృతకృత్యులైనారని ఈ వ్యాసాలు చదివినవారందరూ అంగీకరిస్తారు.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు కవులు, విమర్శకులు, వక్తలు, నాటకకర్తలు, ఉన్నతప్రమాణా లందుకున్న అధ్యాపకులు, సాహిత్యపరిశోధకులు. మా యువభారతి ప్రచురణలకు ప్రధాన సంపాదకులు. మేము ప్రచురిస్తున్న త్రైమాస సాహిత్య సంచిక 'నందిని'కి సంపాదకులు. మా సంస్థకు గౌరవ సభ్యులు. మాకు అన్నివేళల్లోనూ చేదోడువాదోడుగా ఉంటూ మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి బాసటగా నిలచిన సహృదయులు. ఈ వ్యాస సంకలనాన్ని ప్రచురించుకునే అవకాశాన్ని మాకు కలిగించిన శ్రీ సుబ్రహ్మణ్యంగారి ఔదార్యానికి, సాహిత్యాభిమానానికి మా కృతజ్ఞతాభివందన పరంపరలు.

హైదరాబాద్ - 500 001
14-1-1983

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు, యువభారతి.

నవ్యాంధ్ర సాహిత్య యుగ కర్తలు

మాధురీ దర్శన ప్రవక్తలు

ఆ చా ర్యా

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారికి

భ క్తి తో

అం కి తం

తెలుఁగు కవితకు అభినవ దీప్తి నొసఁగి
క్రొత్త పుంతలు చూపిన కోవిదుండు
అమలినంబైన శృంగారదామ మల్లి
ఆంధ్రభారతి కిచ్చిన అర్చకుండు.

రమ్య రుచిరార్థ రమణీయ రాగరక్తి
స్నేహ వత్సల భావార్థ స్నిగ్ధవృత్తి
ప్రణయ సూక్తికి మాతృత్వ భక్తిశక్తి
సరస సాహిత్య మూర్తికి సామగీతి.

ప్రకృతి సౌందర్య దర్శన పథములందు
నవ్య పదబంధ నిర్మాణ నాట్యరీతి
తెలుగు కవులకు నేర్పిన దేవగురుఁడు
రూపనవనీతమునకు సరోజభవుఁడు.

మాధురీ దర్శనం బొక మధుర ఫణితి
లలిత తత్త్వార్థ బోధకు లక్ష్యభూమి
పద్యమయమైన లక్షణ పాఠమునకు
విద్య నేర్పిన కల్పక వేదతరువు.

అతఁడు పల్కిన కావ్యము లాగమములు
అతఁడు పాడిన గేయము లాంధ్రజాతి
నిదుర మేల్కొల్పు ప్రాభాత నిగమరాజి
సూక్తి నభినవ నన్నయ సూరి యతఁడు.

అతఁడు యుగకర్త; ఆచార్యుఁ; డాంధ్రవాణి
కభినవాదర్శ మార్గ విద్యాప్రదాత;
అతని కర్పింతు నీగ్రంథ మంజలించి
అభినవాలోక మతనికి అర్ఘ్యమగుట.

# తొలిపలుకు

సాహిత్యజీవితంలో కొన్ని సన్నివేశాలు మధురస్మృతులను కలిగిస్తుంటాయి. అలాంటివి సాహిత్య వ్యవసాయంలో కొన్ని ఉన్నాయి. వాటికీ ఈ వ్యాస సంకలనంలోని వ్యాసాలకూ ఆటువంటి ఒక అనుబంధం ఉంది. నవోదయ లహరి (యువభారతి ప్రచురణ)లో ప్రకటింపబడిన 'రాయప్రోలు సుబ్బారావు' గారి మీది వ్యాసం ఆ మహాకవి వినటం, 'కవిహృదయాన్ని ఆవిష్కరించిన వ్యాసం విన్నా'నని సంతోషపడటం, నన్నాశీర్వదిస్తూ లేఖ వ్రాయటం నే నెన్నడూ మరువలేను. ఈ గ్రంథాన్ని ఆ స్మృతికి చిహ్నంగా వారికి అంకితం చేస్తున్నాను.

డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆంధ్రరాష్ట్ర రాజకీయాలలోనే కాక సాహిత్యరంగంలోకూడా భీష్మాచార్యుని వంటివారు. వారు రవీంద్రకవీంద్రుల కృతులను తెలుగుచేసి గురుభక్తిని, సాహిత్యానురక్తిని ప్రకటించుకొన్నారు. వా రెప్పుడో రచించిన 'ఊర్వశి' 'కాళిదాసు' కావ్యాలను 1979 లో పునర్ముద్రిస్తూ ఆ రెండు కావ్యాలకూ పీఠికలు వ్రాయుమని నన్ను కోరటం ఒక గొప్ప అదృష్టం. 'లాస్యకింకిణి', 'భావ సౌరభం' ఆ రెండు కావ్యాలకు పీఠికలుగా ప్రకటింపబడినాయి. రవీంద్ర సాహిత్యారాధనంలో పాలుపంచుకొనే అవకాశం దొరకటం మరొక మధురస్మృతి.

యువభారతివారు ప్రచురించిన 'విశ్వనాథకవితా వైభవా'నికి పీఠిక వ్రాయటం, రామాయణ కల్పవృక్షంమీద ఉపన్యసించటం, విమర్శక చక్రవర్తిగా విశ్వనాథ వైశిష్ట్యాన్ని నిరూపించటం నా కబ్బిన మరొక అదృష్టం. విశ్వనాథ విమర్శ వ్యక్తిత్వ చిత్రణంలో కొత్తచూపు కనపడుతుంది. 'నన్నయగారి ప్రసన్న కలితార్థయుక్తి' గ్రంథాన్ని చదివి, నా విద్యార్థి దశలో విమర్శను వ్రాయాలని సంకల్పించుకొన్నాను. ఇలా తొలివెలుగు చూపిన తెలుగుకవికి ఇచ్చిన అక్షర నీరాజనాలు ఇందులోని రెండువ్యాసాలు.

మధునాపంతులవారికి నేనంటే ఎందుకో అవ్యాజమైన వాత్సల్యం. ఆంధ్ర పురాణ స్వర్ణోత్సవంలో పాల్గొన్నాను. నాటి నా ఉపన్యాసం విని ఆ మహాకవి నన్ను ప్రశంసిస్తూ ఆశీర్వదించారు. వారి కవితామూర్తికి వాఙ్మయోపాయనం 'ఆంధ్రపురాణము' వ్యాసం.

ప్రతి వ్యాసంలోనూ ఏదో క్రొత్తచూపుతో అనుశీలించిన వైఖరి ఉంది దాన్ని ధ్వనింపచేసేది 'అభినవలోచనం' అనేపేరు. అభినవగుప్తుని మీది భక్తికి కూడా చిహ్నం. 'యువభారతి' నా కొక స్నేహచిహ్నం. ఈ గ్రంథాన్ని ప్రచురిస్తున్న యువభారతికి కృతజ్ఞతలు.

14-1-1983 జి. వి. సుబ్రహ్మణ్యం

# విషయానుక్రమణిక

# రాయప్రోలు సుబ్బారావు

'రాయప్రోలు' వారి పేరు వినగానే తెలుగు రసికలోకానికి ఒక పాట, ఒక పద్యం, ఒక తత్త్వం - చప్పున జ్ఞాపకానికి వస్తాయి. ఆ పాట 'జన్మభూమి' గేయం. ఆ పద్యం 'ఆంధ్ర ప్రబోధం'. ఆ తత్త్వం 'అమలిన శృంగార తత్త్వం.' దేశభక్తినుండి జాలువారింది ఆ గేయం; రాష్ట్రాభిమానంనుండి రూపు కట్టింది ఆ పద్యం; రమ్యాలోకనం మాధురీ దర్శనం చేసింది అమలిన శృంగార తత్త్వం; రాయప్రో లొకవంక ప్రబోధకుడు; మరొకవంక దార్శనికుడు.

రెండు కళ్ళు :

ఆంధ్రసాహిత్య చరిత్రలో ఒక నూత్నయుగానికి నాంది నాలపించిన సూత్రధారుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారైతే నవ్య కవిత్వ ప్రయోగానికి ప్రస్తావన నిర్వహించిన వైతాళికులు గురజాడ రాయప్రోలులు. గురజాడ మానవతాధ్వజాన్ని పట్టుకొని మనిషిని మేల్కొల్పాడు; రాయప్రోలు ప్రణయ ధ్వజాన్ని పైకెత్తి మానవ ప్రవృత్తిని ప్రబోధించాడు. ఒకరి మాట ప్రజా సూక్తం; మరొకరి వాక్కు రససూత్రం. ఒకరు ప్రజల మాటల్లో పాటలతోటలు పూయించినవారు; ముత్యాలసరాలను తెలుగుతల్లి కర్పించినవారు;మరొకరు రచనా రామణీయకత్వంతో కవితకు క్రొత్తవాసనలు గుబాళింపచేసినవారు; ప్రబోధంలో ప్రకృతిసమారాధనంలో ఆంధ్రభారతికి అభినవదర్శనాన్ని అందించినవారు. ఇరువురూ క్రొత్తపాతల మేలుకలయికను మెచ్చినవారే! కాని, గురజాడ క్రొత్తలో పాతను కలిపితే; రాయప్రోలు పాతలో క్రొత్తను కలిపి రుచి చూపించారు. వీరిరువురూ సంఘ సంస్కరణ చైతన్యాన్ని కందుకూరి వారి నుండి అందుకొన్నవారే. కాని, సాహిత్యం, సంఘసమస్యల పరిష్కారాన్ని ప్రతిపాదించిన దానికంటె, సమస్యల సదవగాహన కల్పించి స్వయంగా పరిష్కరించుకొనే సంస్కారాన్ని సామాజికుల కందించాలన్న దృక్పథాన్ని ప్రసరించినవా రీయిద్దరూ. అయితే, గురజాడ రాయప్రోలుకంటె వాస్తవవాది, రాయప్రోలు గురజాడకంటె

భావవాది. ఈభేదం వారి ప్రవృత్తుల్లోనే కాక, ప్రయోగాల్లో కూడా ప్రకృష్టంగా ప్రత్యక్షమౌతుంది. గురజాడ కృతుల్లో, రూపకాల్లో సమాజంలోని వాస్తవవిషాద సన్నివేశాలు చిత్రింపబడినవి ప్రధానంగా; రాయప్రోలు ఖండకృతుల్లో కాల్పనిక ప్రణయ సన్నివేశాలు తీర్చబడినవి ప్రధానంగా. ఇది ప్రధాన వివక్షతో చేసిన వివేచనయే. పూర్ణమ్మ కన్యాశుల్కానికి బలియైన కన్య అయితే, రాయప్రోలు స్నేహలత వరశుల్కానికి ఆహుతి అయిన అబల. వీరిద్దరూ సమకాలీన సమాజంలోని వాస్తవ చిత్రాలే. గురజాడ కరుణహాస్యాలను ప్రధానంగా పోషిస్తే రాయప్రోలు కరుణావిప్రలంభాలను విరివిగా పోషించారు. వీరిద్దరూ దేశభక్తిని ప్రబోధించినవారే. అయితే, గురజాడ 'దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్' అని దేశప్రతిష్ఠ ప్రజల ప్రవర్తనమీదే ఆధారపడి ఉంటుందని ఉల్లేఖించాడు; రాయప్రోలు దేశపురావైభవాన్ని కీర్తించి దానికి తగినట్లు దేశభాషా గౌరవాలను ప్రజలు నిలబెట్టాలని ప్రబోధించాడు. గురజాడప్రబోధం గేయంలో సాగింది; రాయప్రోలుప్రబోధం పద్యగేయాలలో రెండింటా సాగింది. గురజాడ ముత్యాల సరాలు తరువాత ముప్ఫైయేళ్ళు అందరినీ ముచ్చటకొలిపిస్తే - రాయప్రోలు సీసపద్య రచనం ప్రబోధ కవిత్వానికి ప్రణవమంత్రమై ప్రవర్తిల్లింది. ఇద్దరూ ప్రకృతి నారాధించిన వారే; ఇద్దరూ సౌందర్యోపాసకులే; ఇరువురూ హృదయవాదులే, ఇరువురూ కావ్యకళా కోవిదులే. అయితే, ఒకరు ప్రకృతిని ఆఖ్యానంలో వాతావరణంలా చిత్రిస్తే మరొకరు ఒక తత్త్వవ్యాఖ్యానానికి దర్పణంలా నిలిపారు. ఇలా ఒక యుగకర్తలో ఉండే వాస్తవ దార్శనిక శక్తులు రెండూ ఇద్దరిలో మూర్తీభవించి నవ్యకవిత్వయుగానికి గురజాడ రాయప్రోలులను నాయకులుగా నిలిచేటట్లు చేశాయి.

వీరేశలింగ యుగసాహిత్యం ప్రక్రియల్నిబట్టి ప్రధానంగా మూడుపాయలుగా ప్రవహిస్తున్నదని భావింపవచ్చు. 1. వచన ప్రక్రియ, 2. కవితా ప్రక్రియ, 3. రూపక ప్రక్రియ. నవల, కథ, వ్యాసం, విమర్శ, చరిత్ర మొదలైన శాఖలన్నీ వచన ప్రక్రియలో విలసిల్లినవే. ప్రహసనాలూ, అనువాద స్వతంత్ర రూపకాలూ, ఏకాంకికలూ మొదలైన దృశ్యకావ్య ప్రక్రియలన్నీ రూపక శాఖకు చెందినవే. ఇక కవితా ప్రక్రియ ప్రస్తుతాంశం. దీనిలో ప్రధానంగా నాలుగు ఘట్టాలు కనపడుతున్నాయి. వీటిని చాలమంది యుగాలంటున్నారు. ఇవే యుగా

లైతే వీరేశలింగయుగం శకం కావలసిందే. అయినా తప్పేమీ లేదు. నాలుగు యుగాలు: 1. అవధానకవితాయుగం 2. నవ్యభావకవిత్వయుగం 3. అభ్యుదయ కవిత్వ యుగం 4. వచన కవితా యుగం. ఈ యుగాలకు ప్రత్యేకంగా ప్రయోక్తలను భావించటం కూడా సంభావ్యమే. అవధాన కవితకు తిరుపతి వేంకట కవులూ, భావకవితకు గురజాడ రాయప్రోలులూ, అభ్యుదయ కవితకు శ్రీశ్రీ, వచన కవితకు కుందుర్తి ప్రవక్తలు, ప్రయోక్తలూ అని ప్రసిద్ధి గాంచారు. భావ కవితలో పద్య రచనామార్గానికి రాయప్రోలూ, గేయరచనా పద్ధతికి గురజాడా ప్రచారకులైనారు. ప్రాచీనకవితలో మార్గదేశీ పద్ధతుల్లాగా రాయప్రోలు గురజాడ మార్గాలు భావకవిత్వ యుగంలో జంటగా సాగివచ్చాయి. అయితే, రాయప్రోలు ప్రభావం భావకవిత్వయుగంలో బలంగా కనపడుతుంది; ఆ తరువాత అదృశ్యమౌతుంది. గురజాడ ప్రభావం భావకవిత్వ యుగంలో బలం పుంజుకొని, అభ్యుదయ కవిత్వ యుగంలో మరో అడుగు ముందుకు వేస్తుంది. అందుకు కారణం కూడా స్పష్టమే. రాయప్రోలు ఉపాసించింది వ్యక్తికేంద్రమైన ప్రణయధర్మం; గురజాడ ప్రపంచించింది సమాజ కేంద్రమైన ప్రజాధర్మం !

నవ్యకవిత్వ యుగకర్తలైన రాయప్రోలు గురజాడలు స్వీయ వ్యక్తిత్వాలతో సాహిత్య రంగంలో ప్రకాశిస్తుంటారు. ఒకరు ప్రవక్తలు, దార్శనికులు, సంస్కారప్రియులు. మరొకరు ప్రయోక్తలు, దర్శకులు, సంస్కరణాభిలాషులు. ఒకరికి రీతిమీద మక్కువ ఎక్కువ; మరొకరికి గుణముమీద గౌరవ మెక్కువ. భావచిత్రాల నిచ్చే నూత్న పదబంధాల కోసం ఒకరు యత్నిస్తే, భావసారళ్యం కోసం వ్యావహారిక భాషాప్రయోగాన్ని మరొకరు అందుకొన్నారు. మాధురీ దర్శన మొకరిది; మానవతాదర్శన మింకొకరిది; రమ్యాలోక మొకరిది; సౌజన్యాలోకన మింకొకరిది. ఆ యుగానికి వీరిద్దరూ రెండు కళ్ళు !

నవ్య కవితకు నాంది :

ఆంగ్ల సాహిత్య భాషాధ్యయనం అఖిలభారత భాషాసాహిత్యాలలో వలెనే ఆంధ్ర సాహిత్యంలోకూడా నూత్నచైతన్యాన్ని ఆవిర్భవింపచేసింది. వీరేశలింగ యుగంలోని సారస్వతశాఖా విస్తృతి అంతా ఆ భాషాసాహిత్య ప్రభావం వలన కలిగిందే. నవ్య కవిత్వ యుగంమీద ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనిక

కవిత్వ ప్రభావం బలంగా పడింది. కాల్పనిక కవిత్వ స్వభావాన్ని సమీక్షిస్తూ డా॥ సి. నారాయణరెడ్డిగా రన్నమాట లివి: "ఇంగ్లీషు కవిత్వచరిత్రలో కాల్పనిక కవిత్వము విశిష్టమైన స్థానము కలిగి యున్నది. చాసరువలె సుకుమారముగా కావ్యరచన చేసిన కవి యింకొకడు లేడు. ఈ సాహిత్యములో స్పెన్సరువలె శబ్ద సంగీతమును సృష్టించినవారు క్వచిత్తుగా ఉన్నారు. కాని, చాసరు తన కవిత్వ మును కథాకథనమునకు సాధనముగానే స్వీకరించెను. స్పెన్సరు దానిని దృశ్య చిత్రణకో, అన్యాపదేశముకొరకో ఉపయోగించెను. మరి ఎలిజబెత్ కాలపు కవులకు కవిత్వము వివిధ మానసికచర్యలకు, ఘట్టన ప్రతిఘట్టనములకు వాహిక యైనది. కాల్పనిక కవులు అట్లుగాక కవిత్వమునకు ప్రాణభూతమైన కల్పన (Imagination) కగ్రతాంబూల మిచ్చిరి. సౌందర్యముతో అద్భుతత్వమును సమ్మేళన మొనర్చిరి. నేపథ్యములో నిలిచిపోయిన 'ప్రకృతి'ని రంగస్థలము పైకి తెచ్చిరి. సామాన్య వస్తువులకు మాన్యతనిచ్చిరి. అనాదృత విషయములకు ఆసనము వేసిరి. ప్రముఖ కాల్పనికకవి యగు బ్లేక్ పలికిన క్రింది వాక్యము లలో కాల్పనిక కవిత్వ తత్త్వము హృద్యముగా గుబాళించు చున్నది.

"To see a world in a grain of sand
A heaven in the wild flower
To hold infinity in the palm of the hand
And eternity in an hour."

ఈ కవిత్వమునకు ప్రధాన గుణములు – 1. ప్రకృతి ప్రీతి 2. గత వైభవ పునరుద్ధరణము 3. ప్రణయ తత్త్వము. 4. ఆత్మాశ్రయత్వము. 5. అద్భు తత్త్వము. 6. సాహస ప్రియత్వము."[1] ఈ కాల్పనిక కవితాగుణాలన్నీ రాయప్రోలు కవితలో కమనీయంగా కానవస్తాయి. ఆంగ్ల కవిత్వ ప్రేరణతో ఆంధ్రకవితాలోకంలో అభినవకవితాయుగాన్ని ఆవిష్కరించినవారు రాయప్రోలు.

ఒక సాహిత్య ప్రభావం మరో సాహిత్యంమీద పడుతున్నప్పుడు గమ నింప వలసిన అంశాలు కూడా కొన్ని ఉంటాయి. ఏ సాహిత్యంలోనైనా ఒక క్రొత్తబాటను చూపేవాడు కవి. ఆ కవి ఆ ప్రభావాన్ని పొందుతున్నప్పుడు

1. అధునికాంధ్ర కవిత్వం : సంప్రదాయము – ప్రయోగము - పు 199.

అతడు పుట్టి పెరిగిన వాతావరణం, అతని సంస్కారం, అతని అభిరుచులు, అతని మీద ప్రభావం వేస్తున్న ఇతరశక్తులూ, అతని సాహిత్యదర్శనం, స్థానికంగా అతని సాహిత్యంలో జరగవలసిన మార్పుల ఆవశ్యకత, గతంలో నుండి అతడు సాధింపదలచుకొన్న నవ్యత, సమకాలీన సమాజచైతన్యానికి అతడు అందింపదలచుకొన్న ఆదర్శం, అతనివాక్పాకం, అతనిశక్తి - ఇవన్నీ అతని సృజనవ్యాపారంతో సంపదించి ఉంటాయి. ప్రభావం ఒక ప్రవాహం వంటిదైతే దానిలో మునిగి కొట్టుకొని పోయేవాడు స్వీయవ్యక్తిత్వంతో నిలబడే వాడు కాలేడు. అతడొక పిల్లకాల్వవంటివాడే కాగలడు. ప్రవాహాన్ని తనలో ఇమిడ్చుకో గలిగిన సముద్రుని వంటివాడే గంభీరుడు, యుగప్రవక్త కాగలడు. నవ్యకవిత్వ వైతాళికుడైన రాయప్రోలు సాహితీ వ్యక్తిత్వాన్ని సమీక్షించేటప్పు డీదృష్టితో గమనించాలి. ఆయనను ప్రేరేపించిన శక్తి ఆంగ్ల కాల్పనికోద్యమ కవిత కావచ్చు; ఆ ప్రేరణతో తనదైన ఒక దృక్పథాన్ని కల్పించుకొని, మాతృభాషాసాహిత్యసమున్మేషాని కనువైన ప్రవృత్తిని తాను పండించుకొని, కవితారంగానికి సూత్రధారుడైనవాడు రాయప్రోలు.

ఏ మహాకవి వ్యక్తిత్వమైనా ఒక్కనాడు ఒక్కసారిగా ఆకాశంనుండి ఊడిపడేది కాదు. క్రమపరిణామం చెంది పరిణతిని భజించేదే. ఆ పరిణామానికి పునాదులుగా పరిఢవిల్లే ప్రాథమిక ప్రభావాల బలం చివరిదాకా నిలిచి ఫలంలో బీజంలా భాసిస్తుంది. ఆ ఫలావాప్తికి ప్రాతిపదికలు తెలుసుకోవా లంటే రాయప్రోలువారి జీవితఘట్టాలను కొన్ని సందర్శించాలి.

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని గార్లపాడు గ్రామంలో క్రీ. శ. 1892 మార్చి 18వ తేదీన జన్మించారు. రాయప్రోలు పుట్టింది పండితవంశంలో. అందువల్ల సహజంగా వారిలో కవితా పాండిత్య బీజాలు సుసంపన్నమై ఉండేవి. వాటికి వారి మేనమామగారైన బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వాత్సల్యామృతసేచనం లభించింది. వారివద్ద చిన్నప్పుడే సంస్కృతాంధ్ర సాహిత్య తత్త్వ నవనీతాన్ని సేవింప గలిగారు. వాల్మీకి వ్యాస కాళిదాస భవభూతి మహాకవుల సాహిత్య జగత్తును రమ్యాలోకంతో వీక్షించటం నేర్చుకొన్నారు. అవ్వారివారు మహాకవులు,

విద్వాంసులు, సాహిత్యశాస్త్ర కళావిదులు. తిరుపతి వేంకటకవుల కవితా ప్రభావంవల్ల అవధానాశుకవిత్వాలను వెలయించినవారు. రాయప్రోలులోని కవితాధార మేనమామగారి ప్రోత్సాహం వల్ల కవితాస్రవంతిగా ప్రవహింప సాగింది. మేనమామగారితో కలిసి 1911 దాకా ఆశుకవిత్వం చెప్పారు. అభ్యాసానికి అది ఆదిమదోహద మైంది. రాయప్రోలువారి వాక్కు నైజంగా పాకాన్ని వరించినంతగా ప్రవాహాన్ని మోహించదు; ఫణితికి పరవశించినంతగా పరుగుకు పరిక్రమించదు; అక్షరానందసిద్ధి నామోదించినంతగా ఆశుచమత్కారాల నాదరించదు. అందువల్ల ఆశుకవిత్వానికి రాయప్రోలుకవిత అంకితం కాలేక పోయింది. ఆంధ్రభారతియెదుట ఆయన హృదయం ఆశుకవితాసన్న్యాసాన్ని అర్థించింది–

'తెనుగే తీయని. దంచు పద్య పదరీతిక్రీడ లత్యంత మో
హనముల్ శోభనముల్ తదీయ రసరక్తాలాపనంబుల్ లభిం
చిన వాగర్థకలాకలాప జయలక్ష్మిన్ గాలికిం బుత్తునే
జననీ ! యేమిటి కింక ఆశుకవితాసన్న్యాస మిప్పించవే !

రసమో, భావమొ, జీవదర్థ సుకుమార వ్యంజనా మంజు శ
బ్ద సమాసారచనంబొ, సాధు హృదయస్పంద ప్రతిష్ఠా కథా
విసరంబో, సకలార్థ శూన్యమగు నీనేగాతియోగోక్తి దు
ర్వ్యసనం బేటికి త్రిప్పు మింక జననీ ! రమ్యాక్షరక్షోణికిన్.'

(వనమాల- పుట 39)

తిరుపతి వేంకటకవుల ఆశుకవితాయుగానికి భరతవాక్యం పాడి, నవ్య కవితా యుగానికి నాందీవాక్యం పాడినారు రాయప్రోలు సుబ్బారావుగారు.

రాయప్రోలువారి కవితాశక్తి అభినవమైన అభివ్యక్తి కోసం ఆరాట పడుతున్న రోజుల్లో దానికి తాత్త్విక జిజ్ఞాసను అలవరించిన వ్యక్తి వారి పినతల్లి శ్రీమతి రామమడుగు నరసమ్మగారు. బాపట్లకు సమీపంలోఉన్న వెదుళ్ళపల్లి ఆమె నివాసం. వేణువులో విశ్వమోహన గీతాన్ని నింపిన గీతాచార్యుడులాగా రాయప్రోలు హృదయంలో విశ్వజననీ ప్రేమసూక్తాన్ని మాధురీదర్శనంలా

నింపిన కరుణామూర్తి ఆ తల్లి. శంకరుల అద్వైతతత్త్వసారాన్ని రాయప్రో లుకు పాయసాన్నంగా అందించింది. భజగోవింద గీతాన్ని ఆమెకోరికమీద రాయప్రోలు అనువదించారు ఒకసారి ఆమెయెదుట రాయప్రోలువారు అన సూయా చరిత్రం చదివినారట! ఆ కథ ఆమెహృదిలోని వ్యథను బైట పెట్టిం చింది - "నాన్నా! చూదావురా! త్రిమూర్తులుకూడా ఎలా తల్లికంటితో చూస్తే చంటిపిల్లలైనారో? ఈలాంటి భావం మన కథాకలాపాల్లో ఇంకా అధికంగా ఉంటే ప్రేమబాంధం తొణికేదా? ఏ గ్రంథంలో విన్నా ఆడవాళ్ళను గూర్చి ఏమేమో వ్రాస్తారు మగవాళ్ళు" (నా తొలిరచన) అని ప్రబోధించింది. ఆమె వాక్కులతో రాయప్రోలు హృదయ క్షీరసాగరంలో మథనం ప్రారంభమైనది. స్త్రీపుంసయోగరూపమైన ప్రకృతిలో పరమ ప్రేమస్వరూపిణియైన స్త్రీమూర్తి తత్త్వదర్శనంకోసం జిజ్ఞాస మొదలైంది. క్షీణప్రబంధయుగంలోని శృంగార దృష్టిని ఏవగించుకొంటున్న సమకాలీన సాహిత్యలోకానికి అమలినప్రేమతత్త్వాన్ని అందించాలన్న ఆవేదన మొదలైంది. వీరేశలింగ యుగంలో పురుషునితోపాటు స్త్రీకూడా జాగృత మౌతున్నది. సమాజంలో స్త్రీకి సముచితస్థానం రావాలన్న ఉద్యమం ఉన్మీలిత మైంది. పాశ్చాత్య వాసనావిలసితమైన ప్రణయభావాలు సమాజంలో సంప్రదాయ శృంగారనీతిపై నిర్లిప్తతను కలిగించాయి. చదువు కున్న స్త్రీపురుషులు జాతీయవిద్యారంగాలలో కలసిమెలసి వర్తిస్తున్నారు. స్త్రీ పుంస యోగరూపంలో ఉన్న భారతీయతత్త్వం నవసమాజంలోని హేతువాదం చేత ఎడనెడ నవ్వులపాలు కాజొచ్చింది. హృదయవాదులచేతుల్లో ప్రేమ రతిగా పరిణమించి పరిహాసాలపా లయ్యే జాడలు స్పష్టంగా కానవచ్చాయి. సంస్కర ణోద్యమ ఝంఝులో సామాజిక పరిణామం సముత్సాహంగా సాగుతున్నా దాన్ని సమాజశ్రేయస్సుకు సాధనంగా మలచుకొనే సంస్కారం జాతి అలవరచు కోవలసిన అవసరం కనపడుతున్నది. ఆ తరుణంలో ముఖ్యంగా తరుణవయ స్సులో ఉన్న నరనారీజనులకు రతిలో ఉండే నియతిని చెప్పాలనీ, స్నేహంలో ఉండే సార్వజనీన సాధనను బోధించాలనీ, ప్రకృతిసౌందర్యంలో పరమార్థంగా భాసించే ప్రణయతత్త్వాన్ని ప్రసన్నం చేయా లనీ, శృంగారానుభవంకంటె శృంగారార్చనం జీవలక్షణమనీ, దానికి ప్రేమమూర్తి అయిన స్త్రీవ్యక్తి ఉపాస్య శక్తియని ప్రపంచించాలనీ రాయప్రోలువారి ప్రజ్ఞ ప్రయత్నంచేస్తూ ప్రయోగం కోసం ప్రతీక్షించింది. పినతల్లి గారి ప్రబోధం రాయప్రోలువారిలో దార్శనిక

శక్తికి, తత్త్వచింతనకు ప్రాణం పోసింది. రాయప్రోలుకు జన్మ నిచ్చింది కన్న తల్లి ; సాహిత్యజగత్తులో పునర్జన్మ నిచ్చింది పినతల్లి.

రాయప్రోలువారు ఆర్షసంప్రదాయంతోపాటు ఆంగ్లవిద్యాభ్యాసం కూడా చేశారు. గుంటూరులో, కాకినాడలో, రాజమహేంద్రవరంలో విద్యావ్యాసంగాలు నడిచాయి. రాజమహేంద్రవరంలో ఉన్నత పాఠశాలాజీవితం సాగిస్తున్న రోజులవి. నూనూగుమీసాల నూత్నయౌవనంలో ఉన్నాడు రాయప్రోలు. ఆదికవి నన్నయ ఆంధ్రకవిత్వానికి అక్షరరూపాన్ని కల్పించిన సాహిత్యక్షేత్రమది. నిత్యగోదావరీ స్నానపూతమైన ఆతనిదేహం పొంగిపొరలే కవితాతరంగిణిని మనస్సులో నిండించుకొంటున్నది. నన్నయలాగా తానూ ఒక మార్గానికి దర్శకత్వం నిర్వహించాలని రాయప్రోలుఅంతరాత్మ నినదిస్తున్నది.

ఆంగ్లసాహిత్యంలోని కాసారకవుల కవితామాధుర్యాన్ని చవి చూచిన రాయప్రోలుయువహృదయం ఆంధ్రభారతికి అభినవకవితానవనీతం ఆందించాలని ఆర్రులు చాస్తున్నది. గంటి లక్ష్మన్నపంతులుగారి ప్రోత్సాహంతో గోల్డ్ స్మిత్ రచించిన "హెర్మిట్" కావ్యానికి తెలుగురూపం తీర్చాలని సంకల్పించింది. క్రీ.శ. 1909 లో అది "లలిత"గా రూపొందింది. "లలిత" ఆవిర్భావం రాయప్రోలు నవ్యకవితా సృష్టికి నాంది !

ఒక దశాబ్దం :

రాయప్రోలు సాహిత్యరచనా జీవితంలో సముజ్జ్వలాధ్యాయం క్రీ. శ. 1909 నుండి 1918 వరకూ ఉన్న దశాబ్దమని చెప్పవచ్చు. ఈ దశాబ్దాన్ని మరలా మూడుదశలుగా విభజించవచ్చు. అవి : 1909 నుండి 1912 వరకు, 1912 నుండి 1914 వరకు, 1915 నుండి 1918 వరకు. మొదటిదశను లలితాధ్యాయ మనవచ్చు. రెండవదశను అమలిన శృంగారాధ్యాయం అనవచ్చు. మూడవదశను ప్రబోధకవితాధ్యాయ మనవచ్చు. ఈ విభాగం ప్రధానవివక్షతో చేసిందే. ఈ దశాత్రయంలో రాయప్రోలు వ్యక్తిత్వాన్ని మలచిన సన్నివేశాలూ ఆయన చేసిన నవ్యకవితా ప్రయోగాలూ పరామర్శింప తగినవి.

రాయప్రోలువారికి సహజప్రతిభతోపాటు సరససాంగత్యం కూడ అబ్బింది. రాజమహేంద్రవరంలో ఉన్నప్పుడు 'ఆంధ్రకేసరి' పత్రికా సంపాదకులైన చిలుకూరి వీరభద్రరావు, అత్తిలి సూర్యనారాయణగార్ల స్నేహం వారి కవితారచనా వ్యాపారాలకు దోహదం కల్పించినది. 'జాతీయోద్ధారకులు' 'శాకుంతల పరిశీలనం' అన్న వ్యాసాలు ఆ పత్రికలో ప్రచురితమయ్యాయి. పత్రికారచనకు సంబంధించిన అనుభవం రాయప్రోలు రాజమహేంద్రవరంలో అలవరచుకొన్నారు. 1912 లో ప్రచురింపబడిన గురజాడవారి కన్యాశుల్కంమీద వాదోపవాదాలు వచ్చినప్పుడు కందుకూరి, కొమఱ్ఱాజు, గురజాడ, గిడుగు, చిలకమర్తి, అయ్యంకి, బసవరాజు, అక్కిరాజు, మున్నగు మేధావులతో, వారి చర్చలతో రాయప్రోలుకు పరిచయమైంది. ఆచర్చల్లో అంతర్భూతంగా ఆలోచింపబడిన శృంగారశుచిత్వం, విప్రలంభ ప్రాధాన్యం, దేశీయచ్ఛందః ప్రాశస్త్యం వంటి సాహిత్యాంశాలనుగూర్చి రాయప్రోలు స్వీయదృక్పథంతో మననం చేసికొనే అవకాశం లభించింది. ఆ తరువాత రాయప్రోలు మదరాసులోని విజ్ఞానచంద్రికా గ్రంథమాల, విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంలో పాల్గొనే అదృష్టం దొరికింది. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు తమవార్థక్యంలో ఆంధ్రవిజ్ఞాన సర్వస్వరచనా నిర్వహణానికి సహాయకులుగా మల్లంపల్లి సోమశేఖర శర్మ, రాయప్రోలు సుబ్బారావుగార్లను ఎన్నుకొన్నారు. 'సుబ్బారావుగారికి విజ్ఞాన చక్షువు నిచ్చినారు లక్ష్మణరావుగారు ; ఆయనకు నూత్నదృక్పథాన్నిచ్చినారు సుబ్బారావుగారు, ఈ విధముగా ఉభయతారకు లౌతూ భాషకు మేలు చేసినారు వీరిద్దరూ' అన్న కురుగంటివారిమాట లిక్కడ స్మరణీయాలు. ఆ విజ్ఞాన సర్వస్వ సంపుటంలో రాయప్రోలువారు భావగభీరాలైన వ్యాసాలుకూడా వ్రాశారు. 1914 ప్రాంతంలోనే రాయప్రోలు వర్డ్సువర్త్, కీట్సు, షెల్లీ మొదలైన కాల్పనికోద్యమ కవుల సాహిత్యాన్ని చదివి పరిశీలించారు. ఇవన్నీ ఒక యెత్తూ, గురుదేవులు రవీంద్రకవీంద్రుల అంతేవాసిత్వము మరోయెత్తూ. రాయప్రోలువారు శాంతినికేతనంలో గురుదేవుల సాన్నిధ్యంలో ప్రాచ్య పాశ్చాత్య సాహితీ సాగరాన్ని మథించి రమ్యాలోకాన్ని, మాధురీ దర్శనాన్నీ పరిపూర్ణం చేసికొన్నారు. ఆ కవీంద్రుని మార్మికవాదం రాయప్రోలుపై కొంత ప్రభావం వేసింది. ఆ తరుణంలోనే విధుశేఖర భట్టాచార్య, నందలాల్ బోసు, ఆండ్రూస్ పియర్సన్ వంటి మేధావుల సాహచర్యభాగ్యం లభించింది. ఆంధ్రదేశంలో రాయప్రోలుమీద

ప్రభావం వేసిన వారిలో ప్రముఖులు రాధాకృష్ణ పండితులు, కట్టమంచి రామలింగారెడ్డి, ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, సముద్రాల అప్పలాచార్యులు, వారణాసి రామసుబ్బయ్య మొదలైనవారు. సమకాలీన రాష్ట్రీయ, దేశీయ రంగాల్లో సమున్నతులైన సాహిత్యవేత్తలతో సాహిత్య సమాలోచనం చేసిన రాయప్రోలుప్రజ్ఞ నవ్యసాహిత్య యుగకర్తగా రాణింపగలిగిన ప్రాభవాన్ని సంతరించుకొన్నది. రాయప్రోలుజీవితంలో ఈ అధ్యాయం ఆయన సాహిత్యవ్యక్తిత్వానికి కళాపూర్ణోదయం!

**అభినవ నన్నయ్య :**

రాయప్రోలు అభినవనన్నయ్యగా అభివర్ణింపబడినాడు. నవ్యకవితకు 'కవిబ్రహ్మ'గా కీర్తింపబడినాడు. నన్నయ్య కవిత కున్నట్లుగా రాయప్రోలు కవితకూ మూడు గుణాలు ముడిపడి ఉన్నాయి. 'సారమతిం గవీంద్రులు'లో నారసి చూచే గుణం ఆయన అమలిన శృంగారతత్త్వాన్ని ప్రసన్నకలితార్థ యోగంలో ఆవిష్కరించిన విధం. ఇతరులు మెచ్చుకొనేది ఆయన అక్షర రమణీయకత్వం. ఇక రాయప్రోలు బహువిధ రమ్యార్థసూక్తినిధి. ఆధునికవిమర్శకులు రాయప్రోలుది 'ఐడియలిజం' అంటారు. దీన్ని కాదని వచ్చింది 'రియలిజం'. అది గురజాడ మార్గమని కొందరంటారు. ఈ రెంటికి భేదాన్ని వివేచిస్తూ కురుగంటి వారిలా వ్రాశారు: 'కవి మానవుడు కాబట్టి భౌతికుడు. ప్రాపంచికుడు. అతడు చూచే అనేక సన్నివేశాలు, వినే అనేక ధ్వనులు భౌతికాలై ఉంటవి. కాని, అతనికి అంతర్దర్శన ముంటుంది. ఇది ఆధ్యాత్మికము. ఋషుల మంత్రదర్శనానికీ, తాపసుల ఆత్మదర్శనానికీ కవియొక్క అంతర్దర్శనానికీ యెక్కువగా భేదము లేదు. నిజమైన కవియొక్క అంతరనుభవము తత్త్వదర్శనము వంటిదే. దానియొక్క ఆకారము ఆయన దర్శించి దానిని వాక్యములలో ఇమిడ్చి చెప్పటానికి యత్నిస్తాడు. ఆ దర్శనము స్ఫుటమై దాని అంగాంగిభావము నిర్దిష్టముగా ఉంటేనేగాని దానిని ఇతరుల మనస్సుకు గోచరింపచేయలేడు. ఇది ఉత్తమకవిలక్షణము. ఒక్కొక్కప్పుడు తన దర్శనముతో తాదాత్మ్యము పొంది అనుభవించి, లీనుడై, కొంతకాలానికి వెలికివచ్చి తన అనుభవాన్ని ప్రపంచానికి ఇస్తాడు. ఇది ఒక మార్గము. దీనిలోనుండి వెలికి రావటము కనబడుతుంది. ఒక్కొక్కప్పుడు బయటి సన్నివేశాన్ని చూచి చిత్తము స్పందించి దానిపై భావన ఉద్భవించి

అప్పటి తన అనుభవాలను చెప్పవచ్చును. ఇది రెండోమార్గము. మొదటిది అంతర్మార్గము. రెండోది బహిర్మార్గము. ఉత్తమకవి ఈ రెండు మార్గాలలో చక్కని నిష్ణాతమైన ప్రజ్ఞ కలవాడుగా ఉంటాడు. ఈ రెండు మార్గాలుకూడా 'ఐడియలిజము' క్రిందికే వస్తవి.రియలిజము అనేది ఇంతకంటె క్రిందిమెట్టు. మనచుట్టూ ఉండే ప్రపంచాన్ని ఉన్నదాని నున్నట్లు దర్శించి చెప్పటము 'రియలిజము' క్రిందికి వస్తుంది. ఈ శక్తి చాలామంది కవులకు ఉంటుంది. కాని, మొదటి రెండు శక్తులు చాలా తక్కువమందికి ఉంటవి"[2]. రాయప్రోలు ఆ రెండు శక్తులను దండిగా పండించుకొన్న మహాకవి. ఆయన అంతర్మార్గం నుండి ఆవిర్భవించింది అమలిన శృంగారతత్త్వం. ఆయన బహిర్మార్గం నుండి అవతరించింది ప్రబోధ కవిత్వం. ఈ రెండూ ఆయన సాహిత్య వ్యక్తిత్వానికి బొమ్మా బొరుసూ !

**అమలిన శృంగారతత్త్వం :**

ఈ మాట వినంగానే కొందరు ప్రశ్నిస్తారు– శృంగారమంటే మలిన శృంగారమని భావమా ? మలినం కానిది శృంగారమైతే దీని కీ అమలిన విశేషణమేమిటి ?– అని. రసరాజమనబడే శృంగారాన్ని మలినామలినవిచక్షణాచక్షువులతో చూడటమే సహింపరు కొందరు. ఈ సంగతి రాయప్రోలుకు తెలియక కాదు. ప్రకృతి పురుషయోగంలో రతిభావ పరమార్థాన్ని పర్యాలోచించి ఈ తత్త్వాన్ని ఆవిష్కరించినారు వారు.

లోకంలో సామాన్యంగా సంభోగంతో పర్యవసించే రతిని మాత్రమే శృంగారమని పిలవటం పరిపాటిగా ఉంది. ఇది సర్వజంతుసామాన్యదృష్టితో సంభావింపబడే విధం.కాని, బుద్ధిజీవులైన మానవుల్లో అది స్త్రీ పుంసంయోగమై అలౌకికసుఖానుభూతి నందింపగల సత్త్వాంశగా సిద్ధి పొందుతుంది. సర్వజంతుసాధారణమైన మిథునభోగం కామం; త్రివర్గలక్షితమైన కామం రతి. కామం భోగం, రతి యోగం. యోగానికి లక్ష్యసిద్ధి ఉంది. తదనుసంధానం ఉంది. ఆ ప్రవృత్తి లేకపోతే రతి కామంగా భాసిస్తుంది. లోకంలో దాంపత్యధర్మం స్త్రీ పుంస యోగ మన్న తెలివిడి క్రమంగా జారి ఆచారప్రాయముగా మిథున భోగం వ్యాపించింది. దానితో ప్రకృతియైన రతి వికృతిగా వినేదింపబడసాగింది.

---

2. నవ్యాంధ్ర సాహిత్యవీథులు. ప్ర. భా. పు. 173–174.

ఇలా కావటానికి ప్రధాన కారణం వేదాంత శంఖారావం. వేదాంతం వైరాగ్యాన్ని బోధించింది. దానివల్ల జనుః కర్మమర్మధర్మాలపై ప్రజలకు ఆదరం తగ్గింది. జీవితంలోని సౌందర్యం జనులకు భాసింపకుండా పోయింది. జీవన వేదాంతంపోయి వేదాంత వేదాంతం వ్యాప్తిచెంది వైరాగ్యం ముదిరింది. రసరామణీయకాల కాకరాలైన కావ్యాలు నైష్కర్మ్యవాదులకు నిందాభాజనాలుగా స్ఫురించాయి. వైరాగ్య వాసనలను రక్షించటానికి 'కావ్యాలాంపాంశ్చ వర్జయేత్' అనే నిషేధ సూత్రాలను వారు ప్రసరించారు. త్రివర్గ సంబంధాన్ని వైరాగ్యబంధం అలముకొని ఆనందాంకురానికే అనర్థాన్ని తెచ్చే ఆపద సంభవించింది. ఈ విపత్తిని విచ్ఛేదించి జీవనమాధుర్యాన్ని రమణీయంగా, కాంతాసమ్మితంగా, వ్యంగ్య సుందరంగా ఉపదేశించే మాధురీదర్శనం సాహిత్యం ప్రసారం చేయవలసి వచ్చింది. వాల్మీకి, వ్యాస, కాళిదాస, భవభూత్యాదు లీ జీవనమాధుర్యాన్ని స్త్రీ పుంస యోగ రూపంగా తమ కృతుల్లో చిత్రించారు. అది ఆంధ్ర ప్రబంధ క్షీణయుగంలో అస్తి నాస్తి విచికిత్సకు పాత్రమైపోయింది. ఆ విస్మృత మహా దర్శనాన్ని పునరుద్ధరించటమే ఆధునికుల అవశ్య కర్తవ్యంగా భావింపబడింది. వీరికి భవభూతి అద్వైతప్రణయం ఆదర్శప్రాయమైంది.

> "అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు య
> ద్విశ్రామో హృదయస్య య త, జరసా యస్మి న్నహార్యో రసః
> కాలే నావరణాత్యయా త్పరిణతే య త్స్నేహసారే స్థితం
> భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకం హి తత్ ప్రార్థ్యతే"[3]

అన్న శ్లోకం ఆగమసూక్తమై నిలిచింది. ఇందులోని సుమానుషత్వ సారచింతనంలోనుండి అమలిన శృంగారతత్వ మావిర్భవించింది.

దాంపత్యం ఒక క్రతువులాంటిది. 'ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః' అన్న వైదిక సూక్తి రసాయనం దానివలన కలిగే ఫలం. సత్పుత్రావాప్తి రూపమైన ప్రజాతంతువు వ్యవచ్ఛేదం కాకుండా రక్షించటం దంపతీ ధర్మం. దానికోసం పురుషుడు బ్రహ్మచర్యాన్ని, స్త్రీ-పితృగోత్రంతో పాటు అక్షయ కన్యా సౌభాగ్యాన్ని త్యాగం చేస్తారు. ఇలా ఉభయత్యాగ భాగధేయంగా దాంపత్యం సిద్ధిస్తుంది. దాంపత్యంలో సర్వజంతుసహజమైన కామం సత్సంతానసిద్ధికై లక్షిత మౌతుంది.

3. ఉత్తర రామచరిత నాటకమ్ - అంకము 1, శ్లో. 32.

ఆ ప్రవృత్తితో దంపతులు పాశవిక నైజప్రకృతిని మానుషంగా మార్దవీకరించు కొంటారు ; సుమానుషంగా సౌష్ఠవీకరించుకొంటారు ; సురభూయ సుందరంగా రూపొందించుకొంటారు. దాన్ని స్త్రీపుంసయోగ మంటారు. అది కేవలం తర్కం వల్ల తెలిసేదికాదు ; అసిధారావ్రతంలా అనుష్ఠింపదగింది. సంతానం కలగగానే దంపతీసాంగత్యం స్నేహసాహచర్యంగా మారుతుంది. దానినే భవభూతి "స్నేహసార"మన్నాడు.

మిథునభోగంలోకూడ సుఖానుభూతి ఉంది. అయితే, అది శరీరకైంకర్యంగా ప్రసరించి క్రమంగా ప్రశాంతి చెందుతుంది. కాయికమైన కర్మమే రతి అయితే, దానికి కలకాలం నిలిచే స్థాయి లేదు. అది అంతఃకరణ నిష్ఠం కావాలి. అంతఃకరణ నిష్ఠమైన రతి భావసంస్కారరూపమై ఉంటుంది. సుఖదుఃఖాలకు అద్వైతంగా నిలిచేదీ, సర్వావస్థలయందూ హృదయ విశ్రాంతిని కలిగించేదీ వార్థక్యంలోకూడా వన్నె వాసులు వాడిపోకుండా నిలిచేదీ, జీవితసాహచర్యంలో పరిణతిని సాధించేదీ అయిన సుమానుషధర్మం సంభోగపర్యంతమైన రతిభావం కావటానికి వీల్లేదు దాన్ని స్నేహంగా గుర్తించాడు భవభూతి. ఆ స్నేహం దాంపత్య జీవితమాధుర్యంలో స్థాయి అనీ, దాన్నే ప్రాచీనులు రతి అని నిర్దేశించారనీ రాయప్రోలు నిర్ధరించాడు. స్నేహధారాధౌత మైన అంతఃకరణం వికసించే మహనీయ అవస్థే సుమానుషత్వమని సంభావించాడు. మిథునాలంబనం శిథిలం కాకుండానే స్నేహానుసంధానం భావానుభూతిగా పరిణమించే పరమావస్థయే ఆనందమనీ, అది అమలినమైన స్త్రీపుంసయోగంలో చిత్తసంస్కారంగా చిగురించి చిరకాలం చిన్మయానందాన్ని కలిగిస్తుందనీ రాయప్రోలు దర్శించిన మాధురీతత్త్వం.

దీని కుపలక్షకంగా రాయప్రోలు నరనారీచిత్తవృత్తులను విశ్లేషించి పఠించాడు. దీనికి శారీరక మీమాంస నాలంబనంగా గ్రహించాడు. మానవశరీరంలో హృత్కోశం ఎడమప్రక్కనా, కుక్షి కుడిప్రక్కనా ఉంటాయి. స్త్రీ యెప్పుడూ పురుషునికి వామపక్షంలోనే వర్తిస్తుంది. హృదయ చైతన్యానికి స్త్రీ ప్రతీక ; కుక్షింభరణశీలా లైన కామార్థకాంక్షలకు పురుషుడు ప్రతినిధి. ప్రకృతిసిద్ధమైన ఈ ప్రకృతులు యుగయుగాలుగా వర్తించి కరడుగట్టి స్త్రీ పుంసయోగ మైన రతిని కామయోగంగా వికృతి నొందించాయి. అలా కావటానికి పురుషుల అహం

కారం, స్త్రీల బహూపచార వ్యసనం దోహదం కలిగించాయి. ఇట్టి విపర్యయం వై దొలగాలంటే స్త్రీ పురుషులు తమ ఆద్య సహజ ప్రకృతులను సముద్ధరించు కొని సమాచరించాలి. శ్రేయస్సాధనకు మనిషికి హృదయ మెంత ముఖ్యమో లోకానికి స్త్రీ అంత ముఖ్యం. సమాజశ్రేయస్సవనానికి స్త్రీలు సహజస ప్త సమిధలు సమర్పిస్తారు. "ధృతిఃక్షమా దయాశౌచం కారుణ్యం వాగనిష్ఠురా, మిత్రాణాం చానభిద్రోహః సప్తైతాః సమిధశ్రియః" అని వ్యాసభట్టారకుడు నిర్దేశించాడు.

"ధృతితోడ గృహంబు దిద్దవే, క్షమతో పసిపాప నెత్తవే
దయ జూడవె బంధుజాలమున్, కరుణింపవె కష్టజీవులన్
శుచివై కులకీర్తి నిల్పవే, పలుకాడకు నిష్ఠురంబుగా
సఖు నేపకు ద్రోహచింతకున్" (రూపనవనీతమ్. పుట 86)

అని రాయప్రోలువారి వినతల్లి ప్రబోధించే నారీసూక్తం. కాళిదాసు కణ్వమహర్షి ముఖంగా చెప్పింది కూడా ఈ తత్త్వమే. దీనిని కుశలంగా జీవనవ్రతంలో చిందించటమే స్త్రీ సహజ స్వభావం.

స్త్రీ సంతానవతి కావటంతో పాణిగ్రహణవ్రతం ఫలిస్తుంది. క్షీరసాగర మథనానంతరం అమృతం ఆవిర్భవించినట్లు శిశూదయంకావటంతో స్త్రీకి స్తన్యం సముద్భవిస్తుంది. దానితో ఆమెలో ఒక నూత్న చైతన్యం మోసులెత్తుతుంది. తనయందు చరించిన పతియే ప్రచ్ఛన్నంగా పసివాడుగా మారి తన పయ్యెదను త్రోసి క్షీరపానాన్ని చేస్తున్న అనుభూతిని అనుభవిస్తుంది. సచేతనమైన శరీర బంధంనుండి స్తన్యప్రవణం కావటానికి స్త్రీ పొందే ఉల్లోలకల్లోలావస్థలో రతి నుండి స్నేహం, వలపునుండి వాత్సల్యం, కామంనుండి కరుణ ఉద్భవిస్తాయి. పురుషుడు యజమానిగా ఈ పరిణామాన్ని పరిశీలిస్తాడు. ఆమెలో ఆవిర్భవించిన అభినవమాతృమూర్తిని సమాదరిస్తాడు. ఆసమాదరంలో పూర్వభుక్తమైన మిథున భోగదృష్టి కుంఠిత మై మధురమైన చిత్కళాప్రసక్తి ప్రారంభమౌతుంది. జీవిత సుఖాసక్తి తనూత్సంగాన్ని విడిచి భావాంబరంలో ప్రసరిస్తుంది. ఉపభోగ ప్రవృత్తిలోనుంచి ఉపాసనాసక్తి ఉన్మీలిస్తుంది. అది విశ్వజనీనంగా విస్తరిస్తుంది. అప్పుడు పురుషుడు సమస్త సతీకులంలో మాతృమహత్కళను మధురంగా

దర్శింపగలుగుతాడు. అలాగే స్త్రీ స్తనంధయాసంగతన్మయురాలై నరలోకా న్నంతా వత్సాకృత్స్నంగా ప్రేమింపగలుగుతుంది. అప్పుడు అమలిన స్నేహ భావం అవిచ్ఛిన్నధారా మధురంగా జీవితంలో స్థాయిత్వాన్ని సంతరించు కొంటుంది. శిశుదశన పులకితమై పల్లవించే అనంగభావానుభూతి బ్రహ్మానంద మని మాధురీవాదుల మతం!

'స్నేహపూరంబుతో ప్రకాశించి మించె
మానవులు నిల్పికొన్న సమాజ దీప
మది చెదరి, చింది, పంకిల మయిన, సకల
హీన మగుగాదె ఇండ్లవాకిండ్ల వరుస' (రూపనవనీతమ్)

అన్న తాత్పర్యమే మాధురీ దర్శన నవనీతసారం! 'దీపానికి తైలంలాగా సమా జానికి స్నేహం పోషక'మని రాయప్రోలువారి తీర్పు!

ఇక్కడ మీమాంసకు వచ్చే మరికొన్ని విషయాలు ఉన్నవి. లోకంలో పూర్వరాగ విప్రలంభం, సంభోగశృంగారం, వియోగవిప్రలంభం- అని శృంగారం మూడు రకాలుగా కనపడుతున్నది. విప్రలంభ మెప్పుడూ సంభో గోపలక్షితమైనదే. అది ధర్మబద్ధమైనప్పుడు రసస్థితి పొందుతుంది. రాయప్రోలు దీనిని కాదన లేదు. అయితే సంభోగంతోనే రతి ఆగిపోగూడదనీ, ఆగిపోక పోయినా ఆ తరువాత ఉత్కటస్థితి పొందదనీ వారు అభిప్రాయపడినారు. అయితే, దాంపత్య జీవితంలో స్థాయిగా విలువగలిగిన రతి సంభోగైకలక్షితమే కాక స్నేహరూప భావస్థితిని చెంది తనూపభోగస్పృహకు అతీతంగా వర్తించి భావ రాగస్థితి నందుకొంటుందనీ, అదియే సంతతచర్వ్యమాణస్థితిని పొంది స్థాయి త్వాన్ని సాధిస్తుందనీ వారి భావం. కాయజకర్మ కలితమై అంతఃకరణ సందీప్తమై భావ్యమానమై పరిఢవించే ప్రణయం సంభోగపర్యంతమైన రతికంటె శక్తిమంతమైనదనీ, అమలినమైనదనీ వారి సిద్ధాంతం!

రతి నిజానికి లోకవృత్తంలోనూ, లక్షణశాస్త్రంలోనూ విషయోపభోగ రతికి మాత్రమే పరిమితం కాలేదు. భగవద్రతి, గురుజనరతి, మిత్రబాంధవ రతి, పుత్రరతి-ఇలా వ్యవహారముంది ఇందులో భగవద్గురుజనరతులు భక్తి ప్రేయోభావాలుగా ప్రసిద్ధి చెందాయి; మిత్రబాంధవరతులు స్నేహభావంగా

చెలామణి అయినాయి. పుత్రపుత్రికాపరమైన రతి వత్సలంగా వ్యవహరింపబడు తున్నది. ఇన్ని అవస్థల్లో రతి వర్తిస్తున్నది. సర్వావస్థలకు సమన్వయించే రతిని ప్రేమగా భావించట మున్నది. అది దంపతులమధ్యకూడా దరహసిస్తుంది. కాని వారియందు ప్రజాతంతుకార్యంలో తనూరతిగా పరివర్తిస్తుంది. ఈ తనూరతిని ధర్మరతి అనవచ్చుననీ, మిగిలిన అవస్థల్లో భాసించే భావరూపమైన రతి స్నేహమనీ, ప్రేమ అనీ భావింప వచ్చుననీ రాయప్రోలువారి సమీకరణవాదం. ఇట్టి రతిభావమే నిమిత్త భేదంతో నానారూపాలను తాలుస్తున్నదనీ వారి సమన్వయం. భోజుని శృంగారరససమీకరణ వాదాని కంటె ఇది అభినవం! దీనికే అమలినశృంగార మన్నది సంకేతం! ఆ నామకరణం రాయప్రోలు చేసిందే![4]

యువతీ యువకుల జీవితాలలో దీన్ని అనుసరించటం ఆచరణసాధ్యమా? అన్నది పెక్కుమంది హృదయాలలో సుడులు తిరిగే ప్రశ్న! అది ఒకప్పుడు సిద్ధమే యనీ, సమాజవ్యవస్థలో అది సంకరం కావటంవల్ల, సమకాలీన జగత్తులో అది సాధ్యమనీ, సాహిత్యం తత్సముపదేశబృంహితమై సాగాలనీ రాయప్రోలు వారి సదాశయం! సాధ్య మెప్పుడూ సాధనవలన సిద్ధించేదే! "ఈ సాధనకు మంత్ర తంత్రాదులు లేవు. దేశకాల పాత్రాది నియమములునూ అవసరం కావు. ఎవరికివారు అంతరంగములలో అనుష్ఠింప దగినది. దీనికి భావమే కీలకం! భావనయే శక్తి; మైత్రి, కరుణాభావన అన్యులపట్లనూ, ఉల్లాస ఉపేక్షాభావన స్వార్థమందును అభ్యాసం చేయవలెను. ఎక్కడెక్కడ సుఖస్ఫురణ తగులునో అక్కడక్కడ మైత్రీభావన పెంచవలెను. ఎందెందు దుఃఖము గోచరించునో అందెల్ల కరుణాభావన నెఱపవలెను...జీవయాత్రలో రెండుఘట్టములు కలవు. ఒకటి విహితమైనదీ, రెండవది అహితమైనదీ. సుందరములూ, శుద్ధములూ, శోభనములూ అయిన ప్రస్థానములను కామించి, కాంక్షించి తన్మయులై తనిసే భావన నభ్యసింపవలెను. అమంగళములూ, అరిష్టములూ, అసహ్యములూ అయిన అభాగ్య ప్రకరణములను ఉపేక్షించి ఉజ్జగింపవలెను. ఈ చతుర్భావనలో తనకునూ, సహచర జనమునకునూ చిత్తప్రసాదనం అలవడుతుంది....కర్మలు చేయటానికి వానిని చేయించే వశిష్ఠులు కావాలె; జ్ఞానం సాధించడానికి దానిసాధన ఉపదేశించే గురువులు కావాలె; కాని, ప్రేమప్రవృత్తిలో చేసే కర్మగానీ, సాధించే జ్ఞానము

4. తృణకంకణము – 14 వ ముద్రణ, పీఠిక (1966).

గానీ యేమున్నది? ఏమీలేదు; ప్రేమించటమే; ఒక్కటే కర్మ; ఒక్కటే సాధన. అందుచేతనే ప్రేమికులకు వశిష్ఠులుగాని, గురువులుగాని ఉండరు....గురువులకెల్ల నాద్యగురుస్థానము మాతృదేవత! ఉపదేశము సర్వమూ ఆ వాత్సల్యపదము నుండియే ఉద్గమించును....లౌకికమూ, అలౌకికమూ అయిన సమస్త జీవిత వ్యాపారతంత్రమునూ చెప్పుతుంది; చేసిచూపుతుంది; చేయించి దిద్దుతుంది; కావలసినన్ని నీతులనూ, నియమాలనూ ఉపదేశిస్తుంది. కాని, ప్రేమకు సంబంధించిన క్రియాకలాపమునకు ఏమైనా, ఎప్పుడైనా, ఇసుమంతైనా చెప్పుతుందా? చెప్పే అవకాశం ఉన్నదా? లేదుగదా! అది ఆద్యంతరహస్యమైన ప్రాణియోగము, మాధురీయోగము, నిజమేమంటే కర్మజ్ఞానమూలములకు యోనిభూతమయిన పరమరహస్యం ప్రేమ. సృష్టిలాస్యం ప్రేమ; ఈశ్వరదాస్యం ప్రేమ. మానవులకు ఉపాస్యం ప్రేమ!" (రూపనవనీతం) సమాజం ఈ తత్త్వాన్ని సాధనలో పాటించాలంటే సంయమనంతో కూడుకొన్న సంస్కారయోగం కావాలి; అందుకే పిల్లలమర్రి హనుమంతరావుగారన్నారు''గురజాడ' 'రివల్యూషను' తెచ్చిపెట్టితే రాయప్రోలు 'రిఫర్మేషను' తెచ్చిపెట్టినారని గమనించటము అవసరము!"

రాయప్రోలు తన మార్గంలో నడిచే సాధకులను హృదయవాదులనీ, నవ్యార్చకులనీ, ప్రేమోపాసకులనీ, అమృతరసోపాసకులనీ, మాధుర్యోపాసకులనీ సంభావించినారు.

'రతి చిత్పదార్థ; మది పు
ష్పితమయి, స్త్రీపుంసయోగ చిరశిక్షా స్నే
హితమై, సుమానుషభవ
క్రతు కల్యాణంబున కగు రమ్యముగ బుధా!'

అని తమ మాధురీదర్శనాన్ని మానవాళి కందించినారు.

అమలిన ప్రణయసిద్ధాంతం మీద ప్లేటో ప్రేమతత్త్వ ప్రభావ మున్నదని కొందరు భావించారు. డా॥ సి. నారాయణరెడ్డిగారు రెండు సిద్ధాంతాల తారతమ్య పరిశీలనం చేసి 'ప్లేటోకు వీరికి పోలికలేదు. ఉన్న సామ్య మొక్కటే. శారీక సౌందర్యముకన్న ఆత్మసౌందర్యము గొప్పది. ఆంగిక సంయోగముకన్న ఆత్మ సంయోగము గొప్పది. ఈ తత్త్వమును ఇంచుమించుగా ఇద్దరొకేవిధముగా ప్రతి

పాదించిరి. అంతమాత్రముచేత వీరి అమలిన శృంగారము, Platonic love ఒక్కటే అనుట సమంజసముకాదు. పైగా మూలతత్త్వములోనే ఈ రెంటికి ఎంతో తారతమ్యమున్నది' అని నిరూపించినారు. 'వీరి మాధురీ దర్శనమునకు రాబర్ట్ బ్రిడ్జెస్ (Robert Bridges) వ్రాసిన 'Testament of Beauty' అను గ్రంథమునకు ఆనంద సౌందర్యములద్వారా పరబ్రహ్మము నందుకోవచ్చునను అభిప్రాయములో మాత్రము పోలికలున్న'వని గమనించినారు. 'సృష్టి ప్రేమ మయమన్న రవీంద్రభావము వీరిపై ప్రభావము వేసినది. సుఖదుఃఖములు ప్రాణికి సహజములైనను, మానవుడు దుఃఖమునకు లొంగిపోక ఆనందధామమువంక ప్రస్థావించవలెనన్న రవీంద్రతత్త్వమునే రాయప్రోలువారు తృణకంకణములో, లక్షణగ్రంథములలో ప్రతిపాదించి' రని వివేచించినారు. మాధురీదర్శనంలో రతి భావానికిచ్చినవ్యాఖ్యానం వైష్ణవమతంలోని'మహామాధురీభావాన్ని' దృష్టిలో పెట్టుకొని చేశారని సంభావించారు. రాయప్రోలువారే స్వయంగా రూపనవనీత నివేదనలో ఆనందవర్ధనుని ధ్వన్యాలోకంలోని పంక్తులను తమ ప్రవచనానికి ప్రాతిపదికములుగ పేర్కొన్నారు. మచ్చుకుకొన్ని 1. "శృంగారరసోహి సంసారిణాం నియమేన అనుభవ విషయత్వాత్, సర్వరసేభ్యః కమనీయతా ప్రధానభూతః. 2. విప్రలంభశృంగారే కరుణే మాధుర్యం ప్రకర్షయత్. 3 విప్రలంభే సౌకుమార్యాతిశయోస్తు. 4. విరోధం అవిరోధం సర్వేషు రసేషు నిరూపయేత్ సహృదయః. 5. విశేషస్తు శృంగారే, తస్యరసపరిపోషకాత్మకత్వాత్,రతేశ్చ స్వల్పేనాపి నిమిత్తేన భంగసంభవాత్, శృంగారః సుకుమారతరః సమనాగపి విరోధి సమావేశం న సహతే". జగన్నాథ పండితరాయల రసగంగాధరంలోని సూక్తుల నాయన రమ్యాలోకాదుల్లో అనువదించుకోవటం ప్రసిద్ధం. ఇలా ప్రాచ్యపాశ్చాత్య దృక్పథాలు ఆయన భావనానికి ప్రేరకాలైనా ఆయన దర్శనాని కొక ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నదనటంలో ఎలాంటి విప్రతిపత్తి ఉండబోదు !

ప్రయోగాలు - ప్రమాణాలు :

అమలిన శృంగారతత్త్వానికి కేంద్రబిందువు స్త్రీ. అందువలన ఆతత్త్వాన్ని ఆలంబనంగా చేసికొని రచించిన కావ్యరచనాప్రయోగాలన్నిట్లోనూ స్త్రీ ప్రధాన పాత్రగా ఉంటుంది. ఆమె కనుసన్నల్లో కథ కదలాడుతుంది. రాయప్రోలు కృతుల్లోపురుషుడు ప్రణయసాధకుడో లేక ప్రేమసమారాధకుడో అయివుంటాడు. కథాంతంలో అతని కన్నులకు గాని సహృదయుల మనోనేత్రాలకుగాని గోచ

రించే స్త్రీ ఆట్వే (Ottway) మాటల్లో చెప్పాలంటే ఇలా ఉంటుంది.

"Oh woman; lovely woman; nature made thee
To temper man; we had been brutes without you;
Angels are painted fair; to look like you;
There is in you all that we believe of heaven
Amazing brightness, purity and truth
Eternal joy and everlasting love." (స్నేహలత పీఠిక)

రాయప్రోలుమాటల్లో చెపితే '(స్త్రీని కవి) కాముకునివలె కామింపక, తల్లివలె దగ్గరకు పోవును. ఆమె యౌవనావస్థయందుగూడ ప్రకృతికృపణుడైన పురుషుని ధూర్తచారణమునకు తొణకక నిండుకుండవలె నిలచును. అబలాసమ్మితముగ నాతనికి పుత్రభావము నుపదేశించును.'

అబలావ్యక్తిత్వంలో సప్తసహజ గుణాలను ప్రత్యేకంగా తమవిన్నిగారు చెప్పేవారని రాయప్రోలువారు పేర్కొన్నారు. వాటిని వ్యక్తీకరించుటయే తమ కావ్యరచనాపరమార్థ మని ప్రయోగశీలియైన రాయప్రోలు సంకల్పించియుండ వచ్చు. ఆ సంకల్పశక్తిలోనుంచి ఆయన కావ్యనాయికలు పుట్టారు. ఆయన రచించిన ఏడుకావ్యాలు అమలినశృంగారధర్మసవనాని కనువైన సప్తసమిధలు. ఆ కావ్యాలనూ, ఆ నాయికలనూ, వారు ప్రతినిధులుగా నిలిచే గుణాలనూ, వారి యందు ప్రధానంగా ప్రపంచితమయ్యే ప్రేమస్వభావాలనూ ఈ క్రింది విధగా వివేచింపవచ్చు.

| కావ్యం | పాత్ర | గుణం | ప్రేమస్వభావం |
|---|---|---|---|
| 1. లలిత— | లలిత— | ధృతి— | అచంచల ప్రేమ. |
| 2. తృణకంకణం— | నాయిక— | క్షమ— | అమలిన ప్రేమ. |
| 3. అనుమతి— | అనుమతి— | దయ— | ఆర్ద్ర ప్రేమ. |
| 4. కష్ట కమల - | కమల— | శౌచం— | అనాసక్త ప్రేమ. |
| 5. స్నేహలత— | స్నేహలత— | కారుణ్యం— | ఉద్విగ్న ప్రేమ. |
| 6. స్వప్నకుమారం— | స్వప్నసుందరి | వాగనిష్ఠురత్వం- | వాత్సల్య ప్రేమ. |
| 7. రూపనవనీతమ్— | వకుళమాల— | మిత్రుల కభి ద్రోహం చేయకుండటం— | దాక్షిణ్య ప్రేమ. |

ఇక నాయకులనుగూర్చి ఆలోచిస్తే- లలితలో నాయకుడైన సత్యవర్ధనుడు ప్రేమతపస్వి, తృణకంకణంలో ప్రేమోపాసకుడు; అనుమతిలో అసువులను గోలుపోయినవాడు; కష్టకమలలో కామమోహితుడు; స్నేహలతలో ధనాశాపరుడు; స్వప్నకుమారంలో విషయవాంఛారతుడు; రూపనవనీతంలో కామకౌతుకి. వీరందరినీ ఆయా నాయికలు కాంతాసమ్మితంగా, అమలినశృంగారాన్ని ప్రబోధించటంద్వారా, ప్రవర్తనద్వారం మార్చి మహనీయశీలాన్ని అలరింప ప్రయత్నించిన వారే. నాయకుల్లో లలిత తృణకంకణాల్లోనివారు ఉదాత్తులు; ఉత్తమ శీల సంపన్నులు. అమలినశృంగార తత్త్వానికి ప్రమాణప్రాయులైన పురుషపుంగవులు. అనుమతిలోని నాయకుడు విధివంచితుడు; విషాదపాత్ర. కష్టకమలలో కుమారుడు పరిణతిలేని ప్రాకృతుడు, ధూర్తుడు. స్నేహలతలో వరుడు సంఘ దురాచారానికి బానిసయైన అస్వతంత్రుడు; అర్థలోభి. స్వప్నకుమారంలోని నాయకుడు కాముకుడయ్యీ పరిణతిని సాధించిన సాధకుడు. సుందరుడు దోషి అయ్యీ చేసినపాపాన్ని పరిధౌతం చేసుకోవాలని పరితపించేవాడు. వీరందరూ సమకాలీన సమాజంలో ప్రేమసమస్యల్లో చిక్కుకొన్న యువకుల చిత్తవృత్తులకు ప్రతీకలు. రాయప్రోలువారి దృష్టిలో ప్రణయధర్మానికి ప్రాణం పడతి. ఆమెను పతితను చేసేదీ, పరమదేవతామూర్తిగా మార్చేదీ పురుషుని ప్రవర్తనయే. కాముకుడు ఆమె శీలాన్ని కలుషితం చేసినా ఆమె కరుణార్ద్రహృదయం ఆమె త్యాగంలో అమలినమైన ఆరాధ్యాంశంగా వివేచింపదగినదని రాయప్రోలువారు భావిస్తారు. ప్రేమికుడు ఆమెలోని స్నేహశీలాన్ని ఆరాధిస్తూ అమలిన ప్రేమభావ సంభావనంతో అంతఃకరణాన్ని రసార్ద్రం చేసుకుంటాడని రాయప్రోలువారు నిర్దేశిస్తారు.

రాయప్రోలు లఘుకావ్యాలలో అనువాదాలున్నాయి; స్వతంత్రాలున్నాయి. ఏవయినా ఆయన అమలిన శృంగారతత్త్వాని కనుగుణమైనవే గ్రహించారు. లలిత గోల్డ్‌స్మిత్ హెర్మిట్ ననుసరించిన తెలుగు కృతి. అనుమతి టెన్నిసన్ డోరాకు అనువాదం. ఈ రెండూ అమలిన శృంగారతత్త్వాని కాదర్శప్రాయమైన తృణకంకణానికి ముందు రచించినవే. హెర్మిట్‌లోని ప్రణయవ్రతదీక్ష రాయప్రోలు నాకర్షించింది. దానిని కొంత పరిష్కరించి తెలుగులో లలితగా ఆయన నిర్మించారు. లలిత జయపాలు డనే రాజుకు కూతురు. అపరంజి మేడల్లో పుట్టినా ఆమెకు చిన్నప్పుడే అమ్మ కరువైపోయింది. తండ్రి ఆమెను కడు గారాబంగా పెంచాడు. ఆమెలో యౌవనం అంకురించింది. వలపు వాసనలు గుబాళించాయి.

అని సత్యవర్ధనుడనే ఒక యువకునికి అంకితమయ్యాయి. ఆ తరువాత రాకుమారు లెందరో ఆమెను వివాహం చేసుకోవాలని ఉవ్విళ్లూరారు. కాని, ఆమె తన ప్రియునికోసమే ప్రతీక్షించింది. సిగ్గువలన తన మనసులోనిమాట తండ్రితో గాని చెలులతోగాని ఆమె చెప్పుకొనలేదు. సత్యవర్ధనుడు సంపన్నుడు కాడు. కాని, 'కరుణాతరుణాభరణుడు', 'ప్రాణసుస్నేహమృదువ్రతుడు', 'కులశీలవయోలలితుడు', 'సాహితీదోహనమాధురీహృదయతోయజుడు'. అతడు లలితాను రాగాన్ని తెలుసుకొన్నాడు. మనసార ఆ మగువను ప్రేమించాడు. కాని, అతనికీ లలితకూ సంధానం సాధ్యంకాదని భావించి, ఆమెను పొందే భాగ్యం తనకు లేదని నిరాశతో కుమిలి చివరకు అడవిలో జడదారిలా నివసింప మొదలు పెట్టాడు. ఆతని వర్తనం ఆమె చెవులకు సోకింది. తండ్రినీ, తన భాగ్యాన్ని పరిత్యజించి పగవానివేషంతో అడవులజాడలలో ప్రవేశించి ప్రియుణ్ణి అన్వేషించటం ఆరంభించింది. ప్రియవియోగబాధను పరిపరివిధాల వ్యక్తంచేస్తూ అడవిలో తిరుగుతుంది లలిత. దప్పిక యైనప్పు డొక స్వచ్ఛజలపూర్ణమైన సరోవరంలో నీరు త్రాగుతుంది. అలసినప్పు డొక మావిచెట్టునీడ విశ్రాంతి తీసికొంటుంది.చీకటిపడటంతో ఆమె భయవిహ్వలయై ప్రలాపించింది. సమీపంలోనే ఒక కుటీరంలో సత్యవర్ధనుడు మునిరూపంలో నివసిస్తున్నాడు. పాంథుని ఆర్తిని విని ఆదరంతో ఆహ్వానిస్తాడు. హాని చేయనని అభయహస్త మిస్తాడు. అనుమానిస్తున్నా లలిత అతని ఆశ్రమానికి వెళ్ళి ఆ రాత్రి వసిస్తుంది. తెల్లవారుతుంది. ముని ఆ పాంథుని నవమోహనాంగరేఖా సౌందర్యానికి ముగ్ధుడౌతాడు. లలిత ఆ ముని సుందరసౌకుమార్యాలకు అచ్చెరువు చెందుతుంది. అతడు స్నానానికివెళతాడు.ఆమె ఆశ్రమశాంతవాతావరణానికిఅబ్బురపాటుచెందుతుంది. అతడు తిరిగివచ్చి పాంథుని కుశల మడిగి వగపునకు కారణాలను ప్రశ్నిస్తాడు. లలిత మారుపల్కలేక కన్నీరు మున్నీరై పోతుంది అప్పుడాముని కలమిలేముల అశాశ్వతత్వాన్ని, సుఖదుఃఖాల బుద్బుద స్వభావాన్ని, సృష్టిలో దర్శింపదగిన అనంతప్రేమ స్వరూపాన్ని, జీవితంలో భాసించే వాత్సల్య, స్నేహ, ప్రేమ రస పరిణామ సంస్కారాన్ని, ఆమెకు సాంత్వనవచనాలుగా ప్రబోధిస్తాడు. ఆమె ప్రసన్నురాలౌతుంది. తాను పాంథుడను కాననీ, లలితననీ నిజవృత్తాంతాన్ని చెప్పుతుంది. ఆమె మాట లాలకించి ఆ ముని ఆమెను కౌగిలించుకొంటాడు.ఆమె విభ్రాంతితో 'చలీకృత కురంగివోలె' కంపించి, కౌగిలిని విడిపించుకొని, సమీప శాల్మలీ వృక్షంచాటుకు పోయి మునిధూర్తవర్తనాన్ని గర్హిస్తుంది. సత్యవర్ధనుడు

సౌమ్యంగా తనకథను చెప్పి తనను తాను పరిచయం చేసుకొంటాడు. ఆకృతులను పోల్చుకొని ఇరువురూ ఆనందంతో పునఃపరిష్వంగాన్ని స్వీకరిస్తారు. వారి ప్రణయవ్రతదీక్ష ఫలిస్తుంది. ఇది లలితలోని కథ.

ఈ కథను పాంథుడు వియోగవేదనతో అడవులందు సంచరించే ఘట్టంతో ప్రారంభించటంలో ఉత్కంఠావహమైన ఆరంభ శిల్పం కనబడుతుంది. నాయికానాయకుల నిజస్వరూపావగాహనంతో అద్భుతంగా ముగుస్తుంది. మూలంలో నాయకుడైన ఎడ్విన్ బాటసారిని ఓదారుస్తూ నిజమైన ప్రేమ లోకంలో లేదనీ, ఉంటే ప్రకృతిలో స్వేచ్ఛగా నివసించే పక్షుల్లోనే ఉందనీ; స్త్రీలను త్రోసివేసి బాధను ఉపశమించుకో మనీ ప్రబోధించినట్లుంది. రాయప్రోలు ఈ ఘట్టంలో తన తత్త్వాన్ని చికిలిపెట్టి సత్యవర్ధనునినోట పలికిస్తాడు.

'స్పష్టముగ ప్రబోధించు నీ సృష్టిలోన
జీవకల సమస్తచరాచరావళీ స
మంతరముల సూత్రప్రాయ మయి హసించు
వింతవిధమును, తలపోయు మింత సఖుడ !'

'తల్లింబిడ్డలలో విలీన మగు వాత్సల్యంబు మైత్రీ సము
త్ఫుల్లాంతఃకరణాప్తులౌ సఖుల సాధుస్నేహమున్, ధర్మసం
పల్లగ్నాధ్యవసాయకంకణుల దాంపత్యంబు, వాలారి వ
ర్ధిల్లున్ ప్రేమరసాతిరేక పరిపూర్ణీభూత జీవంబులై'.

ప్రేమ పరిపూర్ణజీవసంస్కార మనే ప్రథమసూత్రం ఈ మునిసూక్తులలో నిబంధించాడు రాయప్రోలు. లలితకావ్య మిచ్చే మధురసందేశ మిదే లోకానికి. ఇదే ఈ కవికోకిల ఈ అనువాద కావ్యం ద్వారా స్వతంత్రంగా లోకాని కందించే కల కుహూనాదం. అమలినశృంగారతత్త్వంలో రాయప్రోలు ప్రథమంగా ప్రతిపాదింప దలచుకొన్న సుమానుషత్వ స్నేహభావానికి లలిత లావణ్యోపనిషత్తు. ప్రణయ వ్రతదీక్ష దాంపత్యప్రణయానికి ప్రాణభూత మని ప్రపంచించే అభినవ భావ సంహిత లలిత; అనువాదంకోసమే వ్రాసింది కాదీవాక్యం. అమలిన శృంగారానికి ఆదిసూత్ర మనే అచంచల విశ్వాసంతోనే లలిత రూపొందింది. పాశ్చాత్యభావాంకురం ప్రాచ్యసంస్కృతి దోహదంతో అభినవసౌగంధ్యాన్ని సమర్పించే ప్రసూన మంజరిని ప్రసవించింది లలితలో. రాయప్రోలు లలితోపాసనంలో ఉన్న ఆధ్యా

త్మిక దర్శనం ఈ కావ్యంలో ప్రచ్ఛన్నంగా కానవచ్చే కాంతి పరివేషం. గోల్డ్‌స్మిత్ నుండి గైకొన్న బంగారాన్ని పుటంపెట్టి తెలుగుభారతికి తగినట్లుగా నవ్యాలంకారాన్ని రూపొందించిన కీర్తి రాయప్రోలుకు దక్కింది.

లలిత ప్రణయవ్రత దీక్షతో పతిని పొందగలిగిన భాగ్యవతి. దాంపత్య జీవనం పండిన ధన్యురాలు. తెలుగు తోరా 'అనుమతి' జీవితం దానికి భిన్నమైనది. వలచిన ప్రియుడు కారణాంతరాలవల్ల మరోవనితను వివాహమాడుతాడు. ఆమెయం దాతడు సంతానాన్ని పొందుతాడు. కాని, విధివక్రతచేత ప్రాణాలు కోల్పోతాడు. అతని మరణానంతరం ఆమె అతని భార్యాపుత్రులకోసం ఎంతో త్యాగంచేస్తుంది. పతిని పొందలేని ఆమెప్రణయం త్యాగరూపమై స్నేహంగా పరిణమించి అమలినత్వాన్నీ అమరత్వాన్నీ అందుకొంటుంది.లలితలో అచంచల ప్రేమవలన కలిగిన వియోగబాధ వ్యక్తమైతే, అనుమతిలో విషాదబాధ వినిపిస్తుంది.ఈ రెండు ఘట్టాల్లో ప్రేమ ప్రవృత్తినుండి నివృత్తికిపోయే అవకాశం ఉంది. కాని, రాయప్రోలువారు సంయోగ వియోగాల్లోకూడా ప్రణయం ప్రవృత్తిని భజించే ప్రకృతిని తమ తత్త్వంలో వ్యక్తీకరించారు. ఒకటి అన్వేషణ వల్ల అందుతుందనీ, మరొకటి ఆరాధనంవల్ల అలవడుతుందనీ నిరూపించారు. అనుమతి అమూర్తమైన ప్రియస్నేహాన్ని ఆరాధిస్తునే మూర్తమైన ప్రియుని భార్యాపుత్రుల రూపాలను సేవిస్తుంది. స్నేహం సేవాధర్మంగా పర్యవసించే అనుమతి ప్రవృత్తిలో విశ్వజనీనమైన ప్రేమ విపులార్ద్రరూపాన్ని భజిస్తుంది. ప్రమోదాంతమైన ప్రణయాన్ని లలితలో ప్రకటించి, విషాదాంతమైన ప్రణయానికి విలువనిచ్చే ప్రవృత్తిని అనుమతిలో వెలార్చి రాయప్రోలు ఏకత్రానురాగ భావానికి భంగ్యంతర వ్యాఖ్యానాన్ని సంతరించారు. దంపతిప్రణయంలో ఇది ఒక సూక్ష్మగ్రంథి మానవతాదృక్పథంతో దీనికి మహనీయత్వాన్ని సంతరించి చూపించారు. దీన్ని 1910 లో రాయప్రోలు రెండవ ప్రయోగంగా వెలయించటంలో పరిణామసార్థక్యం ఉంది; ఔచిత్య పరమార్థమూ ఉంది.

రాయప్రోలు స్వతంత్రకృతుల్లో తృణకంకణం సమున్నతమైంది; అమలిన ప్రణయతత్త్వ ప్రయోగంలో ఇది పరాకాష్ఠ నందుకొన్నది. ప్రక్రియ పాశ్చాత్య ప్రభావంతో ప్రభవిల్లినా ప్రవృత్తిమాత్రం ప్రాచ్యసంస్కారభరితమై ప్రభవిల్లిం దీకావ్యంలో. రాయప్రోలువారి మాటల్లో- 'ఇంగ్లీషులో రసికజన కామితమయిన రచనలలో లిరిక్కు ద్రాక్షపళ్ల గుత్తివంటిది. ఆ భంగిమను తెనుగులో

నవదరింపవలెనను సంకల్పమే తృణకంకణ రచనకు ప్రధానహేతువు. అలాగని, ఆంగ్లలిరిక్కు సంప్రదాయములను మక్కికిమక్కి అనుసరించలేదు. కథ చిన్న దిగా ఉంటుంది. అంగోపాంగములు అంతగా విస్తరింపవు. పూర్వోత్తరములు కూడా అధికంగా కథితములు కావు. పెద్ద చెఱుకుగడలో రసస్నిగ్ధములయిన కందకణుపులు ఏ రెండోమూడో ఏరికొని సహృదయచర్వణకు అందంచడమే ప్రధానదృష్టి. ఆ లిరిక్కులలో అధికాధికంగా అనురాగమే ఇతివృత్తభాగంగా కనపడుతుంది అయితే కార్యకలాపము కంటె పాత్రల భావనమూ, చేష్టావిలా సమూ, నర్మసంలాపమూ విశేషంగా తరంగించుచున్నట్లు తగులును. కాగా బాహిరముకంటె అంతరమూ, వాచ్యముకంటె వ్యంగ్యమూ, ప్రస్తుతం కావడం ఈ లాంటి రచనలో ప్రధానవైఖరి. అయితే లిరిక్కులోని అనురాగము మన కావ్యములలోవలె సంభోగపరిణామము పొందనక్కరలేదు. విషయేంద్రియ భుక్తము కాక భావాత్మక మయిన స్నేహయోగంగా పరిణతమౌతుంది. దీనిని అమలిన శృంగార మని సంకేతించితిని. మలినము కాజాలదని భావము. ఇలాటి అనురాగ ధర్మము సకలప్రాణి సహజంగా అనుభవంలో ఉన్నది. ఇలాటి కావ్యవృత్తము శుచిరుచి సమ్మిళితంగా ప్రసార మయితే రసాస్వాదనం కాదా? కచకుచాభివర్ణనలతో అలంకృతము కాకపోతే కాంతాసౌందర్యం రూపు కట్టదా? సాల రసాల హింతాలములను వదలి నిమ్మదానిమ్మలను వర్ణనోజ్జీవితం చేస్తే ప్రకృతిరామణీయకం పుంజుకోదా? నైఘంటికములైన లతాపుష్పములను విడిచి నిత్యసాంగత్యసుందరము లయిన తీగపందిళ్ళనూ పూలపొదలనూ చిత్రిస్తే ఆవరణ సౌందర్యం అనుసంధానం కాదా? ఈ మనోరిరంసను నాగరక పద బంధములో పొదిగి ఒలకపోయవలెననే ఉత్కంఠ ఈ రచనా రీతికి హేతువు.' ప్రాచీన ప్రబంధ కవిత్వంకంటె రాయప్రోలు నవ్యకవిత సంతరించుకొన్న అభినవ స్వభావాన్ని ఈ మాటలు వ్యక్తీకరిస్తాయి.

తృణకంకణారంభం ఒక నూత్న దివసాభిసారికావతరణం.

'అడుగులు బొబ్బ లెత్త, వదనాంచలముందున చిన్కుచెమ్మటల్
మడుగులు గట్ట, మందు కసుమాలపుటెండ పడంతి యోర్తు జా
ఱెడు జిలుగుంబయంట సవరించుచు చొక్కిన యింపుతోడ కా
ల్నడకన బోవుచుండె నెడలన్ గనుపట్టెడు తోటలోనికిన్.'

పసినిమ్మపండు చాయలో నున్న పదునారేండ్ల పడతి నట్టెండలో నడచి ఊరికి

కొంత దూరంగా ఉన్న తోటలోకి పోతున్నది. వనంలోకి చేరంగానే ఆమె అందెల చప్పుడు విని పెంపుడు లేడి ఒకటి ఆమెను సమీపించింది. ఆమె ఆ లేడిని చెమట లూరే చేతులతో లాలించి వాత్సల్యం ఒలికేలా తృణపరిమళం విరజిమ్మే ఆ లేడి మొగాన్ని ముద్దుపెట్టుకొన్నది. దానిని వెంటగొని సమీపంలో ఉన్న ఒక వృద్ధవృక్షచ్ఛాయలో పులినతలంమీద కూర్చున్నది. చేలాంచలంతో మొగంమీద చెమట లొత్తుకొంటున్నది; అలకలను తొలగద్రోసికొంటున్నది; పెదవిపై వ్రేలుంచి కనులు పెద్దవిచేసి ఏవేవో తలపోసికొంటున్నది; చిటికిన వ్రేలు కున్న ముద్దుటుంగరాన్నీ, పాణిబంధాన పూన్చిన పచ్చని పట్టుతోరాన్నీ చూడలేక చూడలేక చూచుకొంటున్నది. ప్రక్కనున్న లేడిపిల్ల మాగన్ను వెట్టి నిదురపోతున్నది.

అంతలో ఒక యువకు డా వనీస్థలికి గద్గదకంఠంతో ప్రియావిరహాన్ని ఆలపిస్తూ వచ్చాడు. అత డామెకు ఆజననసహవాసంతో కలసి మెలసి వర్తించిన ఆప్తస్నేహితుడు. ఆమె అన్యునికి వివాహమైంది. అతడు నిరాశాహతుడై వివాహాన్ని త్యజించి వియోగవేదనతో ఆశాబంధాలు తెంచుకోలేక పూర్వప్రణయ స్మరణంతో దివారాత్రాలు వేగిపోతున్నాడు.

'చెలియా ! యెన్నడో చేరదీసె మనలం జిన్నారి నేస్తంబు, ము
గ్ధులమై యుంట నెఱుంగ మైతి మపు డే ఘోషన్ రవంతైన కం
దళితస్నిగ్ధరసోదయం బగుట చేతం బిప్పు డల్లాడి యా
కులు మేయున్, బలవద్వియోగము లనుంగుం బ్రేమలన్ ద్రెంపగన్'

'అకట !వంచించె విధి మోహమా ! విఫల మ
నోరథుడు వీడు నీ వింక చేర నేల
భావమా ! వేపె దేల యీ ప్రణయకృపణు !
శూన్య మగుచు నెందేని గాంచుము ప్రశాంతి'

ఇలా విలపిస్తూ కంచెను దాటి వచ్చి ఆమెను సమీపించాడు. ఇద్దరూ చూచుకొన్నారు. పది అడుగులు కదియ నడిచి సమీపించారు. ఇరువురు ఒకరిచేతు లొకరు అందుకొన్నారు. మోదఖేదసంశయాలు వారి యెదల నలముకొన్నాయి; అరగన్నుల నెత్తలేక, మొగము లెత్తి సూటిగా చూచుకోలేకపోయారు. స్పర్శ కూడా ఇరువురికీ సైచియు సయింపగలేనిదై పోయింది. పెదవి కదపలేక, నిశ్చే

ష్టులై చిత్తరువుల్లాగా నిలువబడిపోయారు. చివర కాయువకు డామె చేయి వదలి తియ్యనిమాటలతో పలకరించాడు. 'నెచ్చెలీకుశలమా? రోజులు అనుకూలమోహ నాలుగా ఉన్నాయా ? సమస్తం మనః ప్రియంగా ఉందా ?' అని అంటూనే గాద్గ ద్యంతో మరి మాటలాడలేకపోయాడు. ఆమె అతని హృదయస్థితిని లెస్సగా గ్రహించి అస్ఖలిత ప్రేమరహస్యసూత్ర విశదబుద్ధితో కుశలంగా హృదయవాదిగా మాట్లాడ నారంభించింది. 'స్నేహితుల ప్రేమబంధం అఖండ మని వింటాము కదా ? ఇన్నాళ్ళూ ఒక లేఖైనా ఎలా వ్రాయకుండా ఉండగలిగావు? నన్ను దుఃఖ పెట్టటం నీకు న్యాయమా ? చిన్నప్పటి నుండి పాలమీగడలతో కలిపిన గోరు ముద్దలు తినిపించిన తల్లిమాట ఎందుకు నిరాకరించావు ?'

"విడుపు లెఱుగని కోర్కులన్, ఎడలు గనని
భావ పరిచయముల, నింతవఱకు తనిసి
తనియని అభేదరాగబంధములు పెనచి
యేల త్రెంపంగ నిపుడు సుహృద్వ్రతంస !'

అని ప్రశ్నిస్తుంది. ఆత డామాటలు విని ఆర్తుడౌతాడు. అంతర్వేదనను ఆవే దనగా అభివ్యక్తం చేస్తాడు.

"బాలా ! యేటికి మాట లెత్తి నను నొవ్వంజేసె దింకన్ వృథా
లీలాభ్రాంతి యటం చెఱుంగక వ్యథాలీనుండ నై తిన్ తుదిన్
చాలున్ నెయ్యపుతీరుతియ్యములు, బాష్పజ్ఞేయ విద్యార్థినై
కాలంబు న్వ్యయసున్ వ్యయించెదను సౌఖ్యం బౌను నిశ్శాంతిమై"

"సరస సాంగత్యసుఖ వికాసములకన్న
దుస్సహవియోగభరమె మధురము సకియ !
బాధ లేక వ్యసనరుచి బోధపడదు-
చీకటులు లేక దీపిక చెలగనట్లు"
"నష్ట మైనట్టి ప్రేమఖండముల కొక్క
సుకవి యక్షర జీవ గీతికయ చాలు
సకియ ! విశ్వాసబాష్పముల్ చాలు నాకు
లేదు వేఱాస ప్రణయవల్లీమతల్లి !"

అతని అశ్రూక్తులు విని ఆమె అనునయోక్తులను శాంతశ్రుతిగా ప్రసరించింది.

'దైవికం బగు సుకృతిని దక్కనవని
జతల ప్రేమోదయంబు సంగతము కాదు
అందు నస్ఖలిత ప్రణయానురక్తి
చిరతపశ్శుద్ధిచే గాని దొరకబోదు.'

'కలిసిన యంతమాత్రమున కాదుసుమీ చెలికార; మంతరం
బుల నతుకంగ జాలిన అపూర్వపులంకెయె స్నేహమౌ; తద
స్ఖలిత సమస్త సాధనము జ్ఞానవిదగ్ధుల మార్గసూత్ర, మే
వలతిని నైన ప్రేమపరిపాకము లిట్టులె యన్వయించెడిన్'.

'పరమధర్మార్థ మైన దాంపత్యభక్తి
స్తన్య మోహన మైన వాత్సల్యరక్తి,
సాక్షిమాత్ర సుందర మైన సఖ్యసక్తి,
పొందు నాదిమ మగు ప్రేమమంద ముక్తి.'

'మనసుచే, వాక్కుచేత, కర్మంబుచేత
కలుషితములు కాదగిన నీ వలపు లవని,
తపసుచే, తాల్మిచే, ధ్యానధారచేత
లీనమై యైక్య మీయజాలినది ప్రేమ.'

'కనుల నొండొరులను చూచుకొనుట కన్న
మనసు లన్యోన్యరంజనల్ గొనుటకన్న
కొసరి యేమోయి, యని పిల్చుకొనుట కన్న
చెలుల కిలమీద నేమి కావలయు సఖుడ !'

అని బోధించి తనచేతి కాత డిదివరలో కట్టియుంచిన పట్టుతోరాన్ని విప్పుమని అడుగుతుంది. అత డామెచేయి గ్రహించి యేదో చెప్పబోయాడు. కాని, పలుక లేకపోయాడు. ఆమె రెండవచేతిని కన్నుల కడ్డంగా ఉంచుకొని కొమ్మ నానుకొని నిలుచుండిపోయింది. ఇద్దరూ అలాగే కొంతసేపు నిశ్చేష్టులై నిలబడిపోయారు. వారి బహిరంతరవస్థలు వాచామగోచరాలు. చివర కత డాతోరాన్ని విప్పివేశాడు. ప్రక్కనున్న లేతగరికతో వింతకంకణాన్ని అల్లి ఆమెచేతికి కంకణాలమధ్య కట్టాడు. 'సకియ! మన ప్రేమమధురలాంచన మిదియే' అని, 'సోదరీ !' అని సంబోధించి ఇలా తుదికోర్కె కోరాడు.

'ఈ తృణకంకణంబు ధరియింపుము నీ మణిబంధమందు సం
ప్రీతిని అప్పుడప్పు వలపింపులనెయ్యము జ్ఞప్తిగొన్న ప్రా
భాతికవేళ నీ ప్రణయబాష్పజలాంజలి నింత యిచ్చి, యే
రీతిని వాడకుండ నలరింపు, మిదే తుదివాంఛ సోదరీ!'

అని మొగం ఆవలకు త్రిప్పుకొంటాడు. ఆమె అతనిచేతికి తనవలపుటుంగరాన్ని అలంకరిస్తుంది.

'వలపు నశియించియును ప్రేమ నిలువగలద
యేని, కలనైన కలుషము గాని స్నేహ
మృదుమధురసానుభూతిని బొదలి, మనము
నీడ లట్టుల నైక్య మందెదము గాత!'

అని ఆశ్వాసిస్తుంది ఇరువురూ అల్లనల్లన వెనుదిరిగిచూచుకొంటూ మెల్లమెల్లగా తమ యిండ్లకు చేరుకొంటారు. రాయప్రోలువారి యీ భరతవాక్యంతో తృణకంకణకావ్యం సమాప్తమౌతుంది.

'కడిగిన మృగమదపాత్రిక
విడువని పరిమళము పగిది, విధినియమమున్
విడబడియును వారల పెం
పుడు మైత్రీప్రేమబంధములు తెగ వవురా!'

లలితకంటె తృణకంకణం వేయిరెట్లు గొప్పది. అందులో ప్రణయతపః ఫలమైన మిథునయోగం ఉంది; ఇందులో స్నేహయోగఫలమైన అమలిన ప్రేమ తత్త్వ ముంది; రాయప్రోలు దర్శనానికి లలిత పూర్వరంగం; తృణకంకణం ప్రధానరంగం. ప్రేమరూపమైన రతిలోని శుచి, రుచి ఇందులో సమగ్రంగా ఆవిష్కరింపబడినాయి. అందులో ఆర్త స్త్రీ; తత్త్వప్రవక్త పురుషుడు. అది పాశ్చాత్యముద్ర. ఇందులో ఆర్తుడు పురుషుడు, చిత్తప్రసాదన ప్రవక్త స్త్రీ. ఇది రాయప్రోలుసిద్ధాంతానికి సన్నిహితమైన ప్రయోగం. అందుకే ఇది స్వతంత్రం. అందులో సంవేదన అంతస్సూత్రం; ఇందులో సంఘర్షణ అంతశ్శక్తి. తృణకంకణంలోని స్త్రీ పురుషులు ఆబాల్యస్నేహితులు. బాల్యంలో వారిమధ్య అనాసక్తయోగం ప్రవర్తిల్లింది. యౌవనోదయంతో యువకునిలో భోగవాంఛ అంకురించింది. విషయభోగం ఆమె అన్యకాంత కావటంతో భగ్నమైంది అతనిలో

అది విషాదాన్ని రేకెత్తించింది. విషాదానికి మోహం మూలం. అది సర్వజంతు సహజం. మోహావరణాన్ని అధిగమిస్తే సాక్షాత్కరించేది స్నేహం. స్నేహం తనుయోగాన్ని కోరదు. అనాసక్త యోగంలో అంకురించిన స్నేహాన్ని అమలినంగా ఆరాధిస్తుంది అదే నిత్యమైన ప్రేమతత్త్వమని స్ఫురిస్తుంది. అతడు సాంగత్యసుఖం సాధ్యంకాదని వియోగదుఃఖాన్నే మధురంగా భావించుకొనే సంస్కారాన్ని విప్రలంభంలో సంతరించుకొన్నాడు. ఇక ఎక్కవలసిన మెట్టు దాన్ని స్నేహయోగంగా మార్చుకోవటమే. దాన్ని నాయిక ప్రబోధిస్తుంది. ఆమెచేతి కున్న పట్టుతోరం పూర్వప్రణయ చిహ్నం. అందులో యోగస్పర్శ కంటె రాగస్పర్శ అధికంగా ఉంది. దానికి సంభోగసిద్ధి అయితే దంపతిప్రణయ మయ్యేది. అలా కాకపోవడంచేత అది విరోధాభాసమై పోయింది. ఆమె ధర్మార్థమైన దాంపత్యభక్తి ననుసరిస్తోంది. దానికి సఖ్యసక్తి అనాసక్తమూల మైనప్పుడే పోషకమౌతుంది; లేకపోతే భంజకమౌతుంది. ఆమె చేతికి స్నేహితుడు కట్టిన పట్టుతోరం తంతుమూలమైంది; అది తనూయోగస్మృతి కలుషితమై మనసును తాడిస్తున్నది. ఆ తోరం పీడితే ఆమెకు ధర్మస్థితి నిలుస్తుంది; ఆతోరాన్ని విప్పవలసినవాడు స్నేహితుడు; విప్పుమని అడిగే అధికారం ఆమెకు వాత్సల్యరక్తి వలన కలిగింది. ఆ అధికారాన్ని కలిగించిన మనస్సిద్ధి ఆమె హరిణశాబకాన్ని లాలించిన విధంలో వ్యక్తమౌతున్నది. అందువల్లనే ఆమె ప్రణయతత్త్వప్రవక్త కాగలిగింది. కాంతాసమ్మితంగా స్నేహితుణ్ణి ప్రబోధింపగలిగింది. విప్రలంభ వేదనలోని విషయమోహాన్ని త్రుంచి విశ్వప్రేమతత్త్వంలోని స్నేహరుచిని అతని కందించింది. అతనిలోని మార్పుకు తృణకంకణం చిహ్నం. తృణం హిమ బిందువుచేత పెంపొందుతుంది; కాని, అది ఆబిందువును మౌక్తికంలాతనయెదపై నిలుపుకొని అనాసక్తయోగాన్ని ప్రకటిస్తుంది. అది స్నేహయోగానికి ప్రతీక. దాన్ని అతడు ఆమె చేతికి కడతాడు. ఆమె దాంపత్య భక్తిలోని ధర్మస్థితి కది శుచిత్వాన్ని కలిగించింది. వారిరువురి మధ్య నున్న వలపు నశించింది. ప్రేమ నిలిచింది. ఆమె వలపుటుంగరాన్ని అతని చేతికి తొడుగుతుంది. అతని వలపున కాలంబన మయ్యే అర్ధాంగి నన్వేషించుకొని అమ్మకోర్కెను నిలువబెట్టు మని వ్యంగ్యంగా వ్యపదేశించింది. అది కథలో పరమధ్వనిగా పరిమశించింది. దాంపత్యం బంధయోగం, మైత్రి భావయోగం. విధినియమాల కొదిగి సుమానుషత్వ సిద్ధిని సాధించేది దాంపత్యం. వియోగంలో వినిర్మలసఖ్యసక్తిని

సంరక్షించేది భావయోగం. రాయప్రోలు భావకవిత్వ ప్రయోగానికి ఈ భావ యోగమే జీవం. దానికి తృణకంకణ కావ్యం ప్రమాణం !

తృణకంకణంలోని ప్రేమను డా॥ సుప్రసన్న ఇలా వివేచించారు– "లోకంలో ప్రేమ అంతా మూడుపాయలుగా తీర్చబడ్డది ఈ కవిచేత. దాంపత్య భక్తి, వాత్సల్య రక్తి, సఖ్యసక్తి అని. పైతృకమైనది వాత్సల్యము, స్త్రీ పురుషయోగము దాంపత్యము, ఇతర వ్యక్తుల నడుమ అనుబంధము సఖ్యము. ఈ విధంగా త్రిపథగ ఈ ప్రేమ. ఈ మూడు "అదిమమగు ప్రేమయందె ముక్తి పొందుతవి అంటాడు. వ్యక్తి ఆవిర్భావమునకు మూలము దాంపత్యనిష్ఠమైన ప్రేమ. శిశువులో అనురాగము, ఆత్మవిశ్వాసము, ఆనందానుభవము, లోకజీవనం లోని సుఖదుఃఖాలను పంచుకొని అనుభవింపగల నేర్పు, ఇవన్నీ ఈ ప్రేమకో నుంచే వస్తవి. తల్లిదండ్రులే ఆరంభంలో మనస్సును తీర్చిదిద్ది అహంతను నిల బెట్టేవాళ్ళు. ఈ విధంగా వాత్సల్యప్రేమ స్థితికారకము. వ్యక్తి సమాజంలో కలసి పోవడము, ఇతరుల ఇష్టముకోసం తన ఇష్టాన్ని వదలుకోవడము, సానుభూతి పొంది తన వ్యక్తిత్వాన్ని మరచిపోవడము, క్రమంగా త్యాగభావపరాకాష్ఠ- ఇవీ సఖ్యప్రేమ లక్షణాలు. ఇవి లయలక్షణము. వ్యక్తి అహంకారము సామాజిక చైతన్యములో లీనంకావడం ఇక్కడ పరమార్థమైన విషయం. ఈ విధంగా ఈ మూడు దశలూ జగచ్చైతన్యపరిణామంలో మూడు ఘట్టాలు. స్వర్గమర్త్యరసా తలాలు". (మర్మిని. పుట 17)

అవిదితకామమైన అనాసక్తయోగాన్ని అలంబనంగా తీసికొని రాయప్రోలు కష్టకమల కావ్యాన్ని వ్రాశారు. కమలాకుమారులు మేనత్త మేనమామల బిడ్డలు; ఆ బాల్యస్నేహితులు. కుమారుడు చదువులకై పట్నం వెళతాడు. కమలకు లేఖలు వ్రాస్తుంటాడు. అందులో అవిచ్ఛిన స్నేహధార ప్రసరిస్తుండేది. అతనిలో యౌవనం అంకురించింది. కమలపట్ల వలపు ఉదయించింది. ఒక లేఖలో ఆభావాన్ని ఆవిష్కరిస్తాడు. కమల ఆకులపాటు చెందుతుంది. ప్రాణసంకటమైన వేదనను వహిస్తుంది. బావలోని పరివర్తనానికి పరితాపాన్ని ఒక లేఖద్వారా వ్యక్తం చేస్తుంది. మనసులోని బాధను మేనత్తతో చెప్పుకొం టుంది. మేనత్త కమలను కోడలిగా చూస్తుంది. ఆమె అనాసక్తభావాన్ని అర్థం చేసుకొనేవారు లేకపోతారు. ఆమె అంతఃకరణం పరమ శౌచ్యాన్ని ఆరాధిస్తుంది.

అట్లతద్దె రోజున అలంకరించుకొని పూలతోటలో ఊయల లూగుతుంటుంది. లతాపాశమొకటి అమె మెడ కుర్రిత్రాడుగా చుట్టుకొనటంతో అసువులను కోల్పో తుంది. ప్రకృతి ఆమెపావిత్ర్యాన్ని రక్షించటానికో యన్నట్లు తనలో లీనం చేసి కొంటుంది. అమె విషాదాంతగాథ ఒక బోధగా లోకానికి మిగిలిపోతుంది. రూప నవనీతంలో రాయప్రోలువారు భామతినోట పలికించిన వాక్కు లీగాథకు తత్త్వ సూత్రం- 'శైశవము అనాసక్త యోగాంగములలో అనాహత చక్రం వంటిది. దానిని కేవలం అప్రబుద్ధఇంద్రియావస్థగాపాటిస్తున్నాము.నిలిపితే అది నిలుస్తుంది. శ్రీశుకాదులు ఆ యోగసిద్ధికి దృష్టాంతం. సహజంగా పూర్ణమయ్యే అనుష్ఠానము కూడా అదే!' కమల 'కష్ట కమల'కావటానికి కారణం లోకం దాన్ని గుర్తించ లేక పోవటమే. ఆమె విషాంతగాథ లోకంలో దానివైఫల్యాన్ని వ్యంజింపజేసే వేడినిట్టూర్పు. అస్ఖలితమైన అమలిన ప్రేమకు అనాసక్తయోగం ఆదిబీజం. చిత్పదార్థమైన రతి అందులో చిరంజీవి. అది అందరిలోఉన్నా అందరికీ అందే మ్రానిపండుకాదు ఆర్తిని ఆనందమార్గానికి మళ్ళించే అమలిన సాధన మది. దాన్ని పదేళ్ళ పిల్లలో ప్రదర్శించి కన్యకాపథ కమనీయత్వాన్ని ప్రదర్శించి వర్తనలో శుచిత్వాన్ని వ్యంజింపజేసి రాయప్రోలు ఒక అసాధారణమైన తత్త్వ గ్రంథి నీ కావ్యంలో వ్యక్తీకరించారు. తెలుగు వాతావరణం వెలుగుజిలుగులు నింపుకొనే ఈకావ్యం వస్తుతః ఎంతసుందరమో, తత్త్వతః అంత మందరము.

ఈ కన్యకాపథంలో రాయప్రోలు రచించిన మరోకావ్యఖండం స్నేహలత. వరశుల్కాన్ని ఇవ్వలేక తన పెండ్లికోసం పరితపిస్తున్న బీదతల్లిదండ్రుల యిక్కట్లు చూడలేక అగ్నికి ఆహుతియైన అబలాచరిత్ర మిది. 'కన్నియను పెండ్లియాడునో? కన్నెతండ్రి యర్పణము చేయు శుల్కరూపాప్పరసను పెండ్లి యాడునో' పెండ్లికొడుకుల నడుగు డనే ఆ కన్నెప్రశ్న నేటికీ నిలిచియుండిన సంఘదురాచారానికి సూటిగా తగిలే వాఙ్మయాస్త్రం. అర్థదృష్టితో అబలాచారిత్రం అర్థరహితమై పోయిందన్న వేదన ఈ కృతిలో జ్వాలగా వెలుగొందుతుంది. స్నేహలతలో బంధుకారుణ్యరూపమైన ఉద్విగ్నప్రేమ ఆత్మత్యాగంతో అమరమై నిలిచింది.

స్వప్నకుమారం ఒక చక్కని ఉపదేశకావ్యం.ఒక యువకుడు స్వప్నంలో ఒక సుందరిని చూస్తాడు. కామదృష్టితో ఆమె కొంగును లాగుతాడు. ఆమె

మనసీయక మోమివ్వటం మంచిదికాదని మందలించి మధుపాత్ర నందిస్తుంది. అంతటితో తనివితీరక ఆమెను మరలా వాంఛిస్తాడా యువకుడు.ఆమె పరిశుద్ధ ప్రేమతత్త్వాన్నీ, బాధామాధుర్యాన్నీ బోధించి అతణ్ణి ప్రసన్నుని చేస్తుంది భగవతీరూపమైన ప్రకృతిలోని మాతృమూర్తి వత్సలరసావతారంగా అతనికి సాక్షాత్కరిస్తుంది. వాక్కులో నిష్ఠురత్వం లేక పురుషుని ఉన్మాదవర్తనాన్ని సౌమ్యోపదేశంతో సంస్కరించే స్త్రీ శక్తియే యిందులో నాయిక. ఇందులో ప్రబోధాని కున్నంత విలువ ప్రక్రియకు లెదు. అయినా రాయప్రోలు అమలిన శృంగారతత్త్వ చిత్రణంలో ఇది వత్సలప్రేమకు వాడిపోని కవితాకుసుమం!

రాయప్రోలువారి 'రూపనవనీతమ్' నిజానికి పద్యకావ్యం కాదు. చర్చారూపంగా సాక్షాత్కరించిన తత్త్వోపనిషత్తు. రవీంద్రకవీంద్రుని ప్రయోగ ప్రభావం దీనిమీద బలంగా ఉంది. హృద్యమైన వచనబంధం కవితాశక్తితో కళకళలాడుతోంది. అమలిన శృంగారతత్త్వ వ్యాఖ్యానంగా, మాధురీ దర్శన మార్గ ఘంటాపథంగా ఈ ప్రయోగం రాయప్రోలు దర్శనానికి దర్పణంగా నిలిచేది. అందుకే ఈ వరుసలో దీన్ని పేర్కొంటున్నాను. స్త్రీలలోని దాక్షిణ్య ప్రేమ ఇందులో దర్శనమిస్తుంది.

"స్త్రీ చైతన్యములోదాక్షిణ్యధాతువు అధికంగాఉన్నది.అందువల్లనే అలభ్యమానమైన స్తన్యదానసుకృతి ఆమె సొత్తైనది. సహజ సాత్త్వికమైన ఈ ధర్మము చేతనే ప్రాణిక్రతుకాండ సంపూర్ణంగా నిర్లిప్తంగా నిర్వాహక మవుతున్నది. ఇది అనన్యమయిన ఒక మహా చైతన్యానుభూతి. దీని మహిమవల్లనే స్త్రీకి లోకమంతా రక్త ప్రజాసూత్రంగా పొడకట్టుతున్నది. శైశవం అతినగ్నమూ అజ్ఞాత విషయమూ అయిన కారణంచేత స్త్రీపుంస వైషమ్యమునకు ప్రసక్తిలేదు. ఇది లోకంలో కనపడుతూనే ఉన్నది: పడుచుదనము పల్లవించి నప్పుడే ఈ సంబంధము విషమించడమూ, విరూపం కావడమూ సంభవిస్తుంది. అయినా, దాక్షిణ్య మహోదయం సంఛన్నం కాలేదు. దీని విచారపరిహారములు స్మృతి సంహితలలో లభించుట లేదు.నిజమే. పురాణ ప్రణవాదులు అకామహతులగుటచే వారి కీప్రస్థాన చింత పట్టలేదేమో !" అని రాయప్రోలు ఈ ప్రస్థానాన్ని ఇందులో నిర్వహించారు. అహల్యావృత్తాన్ని దృష్టాంతంగా ఎన్నుకొన్నారు. కామలాలస తీరని దేవేంద్రు డకించనుడై, అతికృపణుడై, యాచ్నాదీనుడై

అహల్యను కామ్యభిక్ష నర్థించాడు. ఆ మహాపతివ్రత దాక్షిణ్యంతో కరిగిపోయింది. ఒకవైపు శీలభంగ మౌతున్న భయం. మరోవైపు దాక్షిణ్యభావ ప్రభావం. చివరకు దాక్షిణ్యమే గెలిచింది. ఆమె తన జీవక్షీరాలను ధారబోసి అమరేంద్రుణ్ణి బ్రతికించి తాను పాషాణమైపోయిందని రాయప్రోలు వ్యాఖ్య. అహల్యవంటిదే అనసూయ. మహామాతృ స్వరూపిణి. ఆమె త్రివర్గశుద్ధిని పరిశీలింపదలచారు త్రిమూర్తులు. ఆ నిత్యజనయిత్రి సమక్షంలో త్రిమూర్తులు శిశువులై పోయారు. ఈదేతత్త్వం అంతర్గర్భితమై ఉంది రాధామాధవ ప్రణయంలో. ఇలా స్త్రీలోని దాక్షిణ్య ప్రేమలో భాసించే మాతృమహిమకు శుద్ధివిచారణ మక్కరలేదంటారు రాయప్రోలువారు. 'శుద్ధమైతేనే కాని సిద్ధి కా' దంటారు. పురుషుని కంటె స్త్రీ దాక్షిణ్యమూర్తి అని చెప్పి- "పరుషములే సరళములు కాదగినవి. సరళములు పరుషములు కావు కదా !" అనే అర్థాంతరన్యాసంతో సమర్థించారు

రూపనవనీతంలో లీలా-వకుళమాలల గాథలు ఈ మార్గంలో నడిచాయి. లీలాసుభాషులు ఆబాల్యస్నేహితులు. లీలకు వివాహమైపోయింది. సుభాషుని వివాహం నిశ్చయమైంది. ఆ సమయంలో లీల ఆ వూరుకు వచ్చింది. పెండ్లి కొడుకును చూడాలని వెళ్ళింది. అతడు పెరటిలో పూలతీగలను సవరిస్తున్నాడు. ఎవ్వరూ అక్కడ లేరు. లీల పరుగున అతనిని సమీపించింది. అత డామెను చూచి ఆవేశంతో చుబుకాన్ని పట్టి ముద్దు పెట్టుకుంటాడు. ఆమె ముద్దుబారిపోతుంది. అతడు చేసిన తప్పిదాన్ని తెలుసుని దూరంగాపోయి బావిదగ్గర స్నానం చేస్తాడు. లీల మోము అమలినమైనట్లు భావిస్తుంది. ఇది లీల కథ. ఇక వకుళ మాల నవనీతుని భార్య. దాక్షిణ్యమయి, దైన్యయాచనాదులకు అవశంగా కరిగి పోయే స్వభావం కలది. ఆమెకు సుందరుడు ఆబాల్యమిత్రుడు. అతడు సంగీత సాహిత్యాలలో నిష్ణాత. కామకౌతుకి. అతని సంగీతం ఆమెకు అవ్యక్త మాధు ర్యాన్ని అందిస్తుంది. ఇరువురూ యౌవనదశలో పడ్డారు. ఇరువురూ వివాహితు లయ్యారు. ఒకరోజు బంధుజాలం ఊళ్లోలేనిరాత్రి ఒంటిగా వకుళ అతని యింటికి పోతుంది. అత డొకచిత్రాన్ని తదేకధ్యానంతో తిలకిస్తున్నాడు. అందులో శిశు వుకు పాలిస్తున్న ఒక కులాంగన ఉంది. ఆమెవెనుక ఉత్కంఠతో ఒక యువ కుడు ఉన్నాడు. అత డా చిత్రాన్ని వకుళకు చూపించి "దీని కేంపేరు పెడతా" వని అడుగుతాడు. 'స్తన్యప్రదానం' అంటుంది వకుళ. సుందరడు వెంటనే

ఆమె కొంగును పట్టుకుంటాడు. 'ఆమె స్తన్యదానం చేస్తుంటే నీవు నాకు స్నేహదానం చేయరాదా ! అంటూ ఇంకా ఏమో మాట్లాడుతూ ఆమెను కౌగిట్లోకి లాక్కుంటాడు. ఆమె పెనగులాడుతుంది. అతడు దీనంగా 'స్నేహాభిషేకం చేయవా ? కర్పూరదీపం ఆర్పివేస్తావా?' అంటూ ఆమెను యాచిస్తాడు. మిత్రుని ఇష్టార్థచ్ఛేదనం వకుళకు అభిద్రోహంగా భాసించింది. అది చేయలేక స్తన్యప్రదానంతో పాటు శీలదానాన్ని కూడా చేసింది. ఆపైన తాను అమలినమై పోయినట్లు భావించి తనుయోగాన్నే త్యజించి శరీరాన్ని కృశింపజేసికొన్నది. రూపనవనీతంలోని ఈ యిద్దరి యువతుల శీలానికి అన్వయం చెప్పటానికి యత్నించారు రాయప్రోలువారు. సాక్షాత్ నారదమహర్షిని ప్రవేశపెట్టి మాధురీయోగాన్ని ఉపదేశింపచేశారు. దాక్షిణ్యప్రేమతత్త్వాన్ని దృష్టిలో ఉంచుకోకపోతే ఇది దుష్టమని అనిపిస్తుంది. అందువల్లనే రాయప్రోలువారు. దాక్షిణ్యక్షమమైన కాంతాకులానికీ, రసాలంకార సలక్షణమైన సాహిత్యచయనమునకు వలెనే లోకాపవాదపీడ తప్పినది కాదు. స్పష్టంగా ఉన్న ఈ సృష్టిరహస్యం ఎప్పటికి అవిష్కృతం కావలసియున్నదో!' అని విచారాన్ని వ్యక్తం చేశారు రూపనవనీతంలో.

సాహిత్యానికి ఈ తత్త్వాన్ని అన్వయిస్తూ దాక్షిణ్యమూర్తి యైన స్త్రీశక్తి వంటిది శబ్దమనీ, ఇష్టవ్యంజనానురంజనమైన అర్థాన్ని ప్రసాదించటమే దాని స్వభావమనీ పేర్కొన్నారు. "సాహిత్యం సంపూర్ణకళ, నాట్యగాంధర్వములు దీనిలో ఉపసర్జనీకృతములై, అదృష్టముదితములయి ఒదిగినవి. సాహిత్యము శబ్దబంధం, శబ్దశక్తి అక్షయమునూ, అనంతముఖమునూ. శబ్దము లేకపోతే బ్రహ్మాండము లేదు. బ్రహ్మము జ్ఞాతవ్యము కాదు. శబ్దమే ధర్మము. తదర్థమే అర్థము. శబ్దార్థ బంధమే కామము. శబ్దకౌమారమైన కలభాషణము అవ్యక్తమధుర మయిన గానాంశలో లీనమౌతున్నది. శబ్దబాల్యము శ్రుతియై సామగాన స్వరంగా విన్యసించింది. దాని తారుణ్య భాగమే రసాత్మకమయిన సాహిత్యంలో ధ్వనిగా తరంగించింది. ఇందులో నాట్యకళాభిముఖంగా రసప్రతీతిని కల్పించే కల్పన రూపకంగానూ, శబ్దార్థవ్యంజనా మూలంగా రసనిష్యందియగు రచన కావ్యంగానూ విలక్షితములై నిలచినవి. మృదుపద ముదితమైనది వాక్కు. ఇష్టవ్యంజనానురంజనమైనది అర్థం. ఈ రెంటి ఋజూపగూహనలో రాగిల్లే భావము నిత్య నవ్య మాంగల్యంగా స్థాయి స్ఫురితమయింది. తొలుదొల్త ప్రాచేతసునికంఠములో ఈ వాగంశ అవిష్కరించి భాసించింది.

కావ్యంలో కళాస్థాన మదే. అదే రసరూపంగా అనుభూతమయ్యే బ్రహ్మానందం." రాయప్రోలు ప్రపంచించిన ఈ వాఙ్మయోపనిషత్తు అమలిన శృంగార తత్త్వానికి, అభినవ కవితా తత్త్వానికీ ఆయువుపట్టు లాంటిది.

"మామిడికొమ్మమీద కలమంత్ర పరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవ స్వరకల్పన కుద్యమించితిన్
కోమల గోస్తనీ రుచులకున్ కదలీ ఫలపాక సిద్ధికిన్
లేములు దీర్చు మా తెనుగు లేతముదుళ్ళ వెలార్చు వేడుకన్"

అన్న రాయప్రోలు కవితాదృక్పథాన్ని రమ్యాలోకనంతో విలోకించటానికి ఆయన సాహిత్యతత్త్వ దర్శనం ఒక అమృతవాతాయనం!

దశసూత్రి :

రాయప్రోలు కవితాదృక్పథాన్ని తెలిపే గ్రంథం రమ్యాలోకం. ఆయన లక్ష్యాన్ని చెప్పే గ్రంథం మాధురీ దర్శనం. ఈ రెండూ వీరి అభినవ కవితకు లక్షణగ్రంథాలు. వీటిని వివేచించి ప్రధానంగా ఒకదశసూత్రిని దర్శింపవచ్చు.

1. 'జన్మభూమి స్వర్గంబ యగును.' 'తల్లినుడికంటె పరమామృతంబు లేదు.' 'భాషకంటె నవ్యులకు తపస్సు లేదు'.
2. 'సంస్కృతములగు గాక, దేశ్యంబు లగును గాక, పరదేశజము లగు గాక, సూక్తు లాత్మభాషాశ్రుతిస్థాయి ననులయించి లీన మగును స్వస్థాన వేషానుకృతుల.'
3. 'కాలధర్మానుగతమై జగత్ప్రవృత్తి మారునపుడు వాఙ్మయమును మారు; నిజము.'
4. 'రసములకు నెల్ల శృంగార రసము తల్లి' అనిరి పూర్వులు సంభోగ మవధి గాగ; అక్షరానందసిద్ధి లక్ష్యముగ నెంచు నవ్యులకు నది అప్రధానంబ యయ్యె!'
5. 'కానరాదు సౌందర్య శృంగారములకు భేద మధిక మారాధన వృత్తి యందు. గుణము శృంగార మగును; తద్గుణ శరణ్య మమృత సౌందర్య మగును నవ్యార్చకులకు.'

6. 'కానబడ కనుమాన ప్రమాణమునకె అంది యందని పరతత్త్వ మవల నుంచి పంచభూత దృశం బైన ప్రకృతి యొకటె సన్నిహిత లక్ష్య మనియె వచస్వి నేడు.'
7. 'కలశుభాంగీవయోధీర కుసుమమందు మోహమధువె గవేషించె మున్ను సుకవి; సాత్త్విక ప్రేమ కోశపేశలము లయిన వత్సలామృత రుచులను వలచె నేడు.'
8. 'ప్రేమతంత్ర మహోపాసనామయులగు నవ్యుల కుపాధియయ్యె సౌందర్య మొకటె.'
9. 'కవితకు రస మసువులు, తత్కవనము భావప్రఫుల్ల కమనీయముగా నవనవలాడెడి నుడువుల నవరింత్రు కవులు సుహృత్ప్రిసన్నగతి బుధా!'
10. 'భావము సాహిత్యకళాజీవము; తత్కామనీయసిక్త స్థాయీభావము రసోదయోషః శ్రీవాల్లభ్య మగును కవికృతియందు బుధా!'

ప్ర బో ధ క వి త :

రాయప్రోలువారి మిగిలిన కృతులన్నీ ఒక యెత్తు, ఆయన దేశభక్తి ప్రబోధ కవితా ఖండికలన్నీ ఒకయెత్తు.

'ఏ దేశ మేగినా ఎందు కాలిడినా-
ఏ పీఠ మెక్కినా ఎవ్వ రేమనినా
పొగడరా నీ తల్లిభూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము'-

అన్న జన్మభూమి గేయం ఆంధ్రజనుల నాలుకలమీద నిత్యనివాసం చేయటమే కాకుండా 'ఏ దేశమేగినా ఎందుకాలిడినా' అన్నది తెలుగుపలుకుబడుల్లో ఒకటిగా నిలిచిపోయింది. ఇలాంటిదే 'తమ్ముడా' గేయంకూడా. వారి దేశభక్తి గేయంలో సాగితే రాష్ట్రభక్తి పద్యాలలో పల్లవించింది.

అలనాటి నెల్లూరి ఆంధ్రసభలనాటినుండీ, నేటి ప్రపంచ తెలుగు మహాసభలదాకా ఆంధ్రవైభవాన్ని కీర్తించుకోవాలంటే రాయప్రోలు పద్యాలే మొదట హృద్యాలుగా తెలుగువారినోట వెలువడినాయి. ఇకముం దంతకంటె మంచి పద్యాలు వస్తాయనే ఆశ ఇప్పట్లో లేదు. ఆ పద్యాలలోనూ సీసపద్యాలు మరీ చెప్పుకోతగినవి. ప్రబోధాని కనువైన పాదవిన్యాసం ఆ సీసాలకు కుదిరినట్లు

మరేపద్యాలకూ కుదరలేదు. రాయప్రోలు సీసపద్యముద్ర ప్రబోధకవితకు రాజముద్ర.

'అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు'
'తన గీతి అరవజాతిని గాయకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుగువాణి'
'విఱిగి వచ్చిన ప్రాణవిభునకు పసుపిచ్చి
వేడినీళ్ళను తోడె కోడలౌకతె'
'గడ్డపారలు గోగుకాడలవలె ముళ్లు
వేసినారట కొండవీటిరెడ్లు'
'శ్రీకాకుళస్వామి సిగపై సువాసించె
తెల్లని ఆంధ్రుల మల్లెపూలు'

మొదలైన పద్యాల ఎత్తుగడలు, చరణాల చివర చిగురింపచేసే పదవిన్యాసాల సొంపు, కవితలోని ఉక్తివక్రత ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. జన్మభూమి, పుస్తకము, ఆంధ్రమాత, తమ్ముడా, ఆంధ్ర, తెనుగుతల్లి, తెలుగుమాన్యము మొదలైన ఖండకృతులు దేశభక్తి ప్రబోధకవితలో ప్రసిద్ధికెక్కినాయి. "నాదు జాతి, నా దేశము, నాదు భాష' అను అహంకారదర్శన మందు మాంధ్రః' అన్నది వారి ప్రబోధకవితా సారం.

రాయప్రోలు ప్రబోధకవితాశాఖ అనంతర కవుల నెందరినో ఉత్తేజ పరిచింది. వస్తుధ్వనిగా సాగిన రాయప్రోలు సీసపద్య చరణాల కూర్పు,తరవాతి చారిత్రకవస్తుకందకావ్య మహాకావ్య ప్రక్రియలకు దారితీసింది. వీరు నాటిన మొక్క తెలుగులో చారిత్రక కావ్య మహావృక్షమై గౌరవాదరాల నందుకొన్నది.

ఖండకావ్యాలూ-కొత్త విశేషాలూ :

రాయప్రోలువారి మిగిలిన రచనలను రెండు విభాగాలుగా చేయవచ్చును. 1. ఖండకావ్య సంపుటులు, 2. అనువాదాలు. ఖండకావ్యాలలో జడకుచ్చులు, తెనుగుతోట, వనమాల, మిశ్రమంజరి, కన్నెపాటలు మొదలైనవి. అనువాదాలలో ఉమర్ ఖయ్యాం అనువాదం మధుకలశం. శ్రీ శంకరాచార్య రవీంద్రాది కవుల రచనల అనువాదాలు,కాళిదాసుని మేఘదూతానువాదం దూతమత్తేభం,

భవభూతి నాటకానువాదం ఉత్తరరామచరిత వాల్మీకి సుందరకాండానువాదం పేర్కొనదగినవి.

ఖండకావ్యాదులలో కనవచ్చే కొత్తవిశేషాలు- 1. కథాత్మక-భావాత్మక ఖండకావ్యరచనం, 2. మధ్యతరగతివారి జీవితచిత్రణం, 3. కాపుదంపతుల జీవితచిత్రణం, 4. పల్లీయుల జీవిత (గొల్లవారి) వర్ణనం, 5. ఉగాదిశోభావర్ణనం, 6. కోయిలనుగూర్చి ఖండకవిత అల్లటం, 7. ప్రశంసాగీతాలను, స్మృతిగీతాలను రచించటం, 8. పుల్లిస్తరాకువంటి నీరసవస్తువుపై కూడ రమణీయ కవిత చెప్పటం, 9. పద్యరచనతోపాటు గేయరచన చేయటం, 10 తెలుగువారి జీవిత ప్రకృతి వాతావరణాలను కృతులలో విరివిగా చిత్రించటం, 11. సమకాలీన సాంఘిక స్పృహను వెలార్చటం, 12. అపూర్వకవి సమయాలను కల్పించటం, 13. నవ్యభావవాహికలుగా పదబంధాలను, శబ్దచిత్రాలను, భావరూపాలను, ఉక్తి విశేషాలను కల్పించటం, 14. ఆత్మాశ్రయ కవితాపద్ధతిలో విరహవేదనాగీతికలు వ్రాయటం, 15. కవితలో భావరామణీయాని కనువైన శబ్దయోగాన్ని సాధించటం వంటివి రాయప్రోలు ప్రారంభించినవే. ఈ ప్రక్రియలన్నీ తరువాతి భావకవిత్వయుగంమీద బలంగా ప్రభావం చూపాయి.

వీరి 'విరహవీథి' 'పిలుపు' వంటి ఖండకృతులు కృష్ణశాస్త్రివంటి భావ కవిత్వ ప్రయోగకర్తలకు ప్రాతిపదికల నందించాయి. 'హేమపాత్రల చందన మెండిపోయె' 'నిశలు పులకించె కనులకు నిదురరాదు' 'నా విరహగంధ గీతి కన్వయము చెప్ప' మొదలైన పద్యాలు ఆత్మాశ్రయ విరహవియోగ కవిత్వానికి అక్షరాభ్యాసాలు. 'ఈయన కావ్యాలతో కాల్పనికోద్యమం అంగణంలో నుంచి ముంగిలిదాకా జరుగుతుం' దన్నారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

**అనువాదాలు : అంతర్యాలు :**

రాయప్రోలువారు మధుకలశాన్ని ఉమర్‌ఖయ్యాం అబోధ వేదాంతాన్ని చూచి ఎన్నుకోలేదు. ఆయన కవితలో ఉన్న మాధుర్యానికి ముగ్ధులై అనువాదం చేసినట్లున్నారు. ఫిట్‌జిరాల్డ్ ఆంగ్లానువాదం వీరి అనువాదానికి మూలం. ఇలాగే 'ప్రేమార్చన' ఎక్బాల్ గీతానికి, 'అవసాన సమర్పణ' డాక్టర్ రిజాల్ కృతికి, 'గీతాందేహి' మీరా గీతానికి, 'దూతిక' 'పారశీక పదాలు' పారశీక గేయాలకూ, 'రేవుపాటా', 'వచ్చినావా ఎందుకోయీ' - బెంగాల్ జానపదగేయాలకు అనువాదాలు. వీటిలోని మాధుర్యం రాయప్రోలు ఆకర్షణ.

ఇక శ్రీ శంకరాచార్యుల 'సౌందర్యలహరిని' రాయప్రోలు అనువదించారంటే ఆశ్చర్యంలేదు. అమలిన శృంగార తత్త్వంలో అతనికి నారీ తత్త్వంలో కనవచ్చేది ఆ లోకమాత, వాత్సల్యమూర్తి. దాని కాధ్యాత్మిక మూలాధారం సౌందర్యలహరి. ధ్వన్యాలోకం రాయప్రోలువారి పరమప్రమాణ గ్రంథం మాధురీదర్శనమంతా అందులోనే దర్శించి తాము రమ్యాలోకం వ్రాశారు. అందులో ఉదాహృత శ్లోకాలలో కొన్నింటికి చక్కని అనువాదం సంతరించారు "ధ్వన్యాలోకము" శీర్షిక క్రింద. ఇక రవీంద్ర కవీంద్రుడు రాయప్రోలుకు తత్వచక్షువు. ఆయనగీతాల కనువాదాలు కొన్ని చేశారీయన. 'అభ్యర్థన' 'ఊర్వశి' "వసంతము" మొదలైన వందుకు ఉదాహరణాలు.

వాల్మీకి వ్యాస కాళిదాస భవభూతులు రాయప్రోలు సాహిత్య సంస్కారానికి నాల్గు స్తంభాలు. వారికృతులను వార్ధక్యంలో అనువదించటం పూర్వస్నేహస్మృతిచర్వణం వంటిది. విరహబాధలో కూడా విశ్వచైతన్యంలోని స్త్రీపుంసయోగాన్ని సంభావించిన యక్షగీత మేఘసందేశం. దాన్ని మత్తేభ వృత్తాల్లో అనువదించి దూతమత్తేభ మన్నారు. తెలుగుపద్యానికి సహజాలంకారాలైన యతిప్రాసలను తీసి స్వేచ్ఛను కల్పించా రిందులో. ఇది స్వేచ్ఛయో సంస్కృత సంప్రదాయ ప్రీతియో చెప్పలేము. ఏమైనా పద్యంకంటె హృద్యమైన భావమే ఇందు ప్రధానం. 'విరహధ్యానప్రదీప్తమగు ప్రణయయోగపరిణతి' ఈ రచనలో కానవస్తుందంటారు రాయప్రోలువారు. భవభూతి ఉత్తరరామచరిత సుమానుషత్వ సందర్శనంలో రాయప్రోలుకు రసోపనిషత్తు. దానిని తెనిగించటం గీర్వాణాన్ని తెలుగులో మననం చేసుకోవటం. ఈ రెండింటికంటె పెద్ద గ్రంథం సుందరకాండం. 'రామాయణములో సీతారాముల మిథునకామము విపాకమును పొందింది. అందువల్లనే (వాల్మీకి) ముని కంఠాన స్యందించిన సుందరకాండ అమృతభాండమైనది. దంపతీధౌతమైన ఆ కామం త్రివర్గ పరిణద్ధమైన శుద్ధకామం. అది అవ్యభిచారి'- అని సుందరకాండ అమృత కలశత్వాన్ని ఆయన రూపనవనీతంలో స్మరించారు. దాన్ని తెలుగు గేయంలో ఆత్మగీతిగా పాడుకొన్నారు. మధురవాదియైన రాయప్రోలుకు సుందరకాండం ఒక ఆనందభాండం.

ఒక్కడే మిగిలాడు :

రాయప్రోలువారు నవ్యకవిత్వానికి అందించిన క్రొత్తబాటల నన్నిటినీ

ప్రక్రియలో, భావంలో, భాషలో, అభివ్యక్తిలో, ప్రబోధంలో, ప్రకృతి చిత్రణంలో, విప్రలంభభావనంలో-ఇలా ఎన్నో మార్గాలలో తరువాతి భావ కవిత్వయుగపు కవులు అందుకొని ఆయన్ను అనుసరించారు కాని, అమలిన శృంగారతత్త్వాన్ని మాత్రం మరెవ్వరూ గ్రహించి కావ్యాల్లో చిత్రించలేదు. ఆయనొక్కడే మిగిలా డీతత్త్వానికి ప్రవక్తగా, ప్రయోక్తగా సాహిత్యక్షేత్రంలో!

దీనికి కొన్ని కారణా లుండవచ్చును. 1. ఆ తత్త్వాన్ని సమగ్రంగా దర్శించి అందులోని సమగ్రాంశాలనూ వివిధ కావ్య ప్రయోగాల ద్వారా ఆయనే ప్రపంచించటంతో మిగిలినవారికి వస్తువులో వైవిధ్యం దొరకకుండా పోయి ఉండవచ్చు. 2. 'స్తన్యప్రదానం' 'శిలదానం' వరకూ సాగిన ఆ ప్రస్థానం లోకంలో సాధన కసాధ్య మని ధర్మశృంగార వాదులకు తోచి ఉండవచ్చు. 3. అమలిన శృంగారం సంభోగ శృంగారం లాగా సహజావబోధ కాకుండా సాధనయోగం కావటంతో లోకుల కందుబాటులో లేని దన్న భావం ప్రబలియుండవచ్చు. 4. అద్వైతదృష్టితో కులపాలికా ప్రణయం లోకంలో సంప్రదాయ బద్ధంగా వస్తూ ఉండటం, అది కర్మభక్తిజ్ఞానమార్గాల కుపస్కారకంగా ఉండటం. 5. సమకాలీన ప్రణయ సమస్యల కిది వాస్తవమూ, హేతుబద్ధమూ అయిన సంపూర్ణపరిష్కారమార్గం కాదేమోనని చాలమంది భావించడం-మొదలైనవి దీనికి కారణాలుగా పేర్కొనవచ్చు. అందుకే 'కులపాలికా ప్రణయ' ప్రస్థానం చేసిన విశ్వనాథవారు 'ఏకవీర'లో ఈ సమస్యలోని సాధక బాధకాలను వ్యంగ్యంగా స్పృశించారు. కుట్టాన్ మీనాక్షిని సోదరీ అని పిలుస్తాడు. వారిద్దరు తృణకంకణంలోని స్త్రీ పురుషపాత్రల వంటివారే. అయితే మీనాక్షిభర్త కీవిషయం తెలుస్తుంది. అత డామెను స్వీకరింప లేకపోయాడు. దానికి కారణం కుట్టాన్‌మీది భక్తి కావచ్చు; అన్యులతో పూర్వరాగం ఉన్న స్త్రీని భార్యగా సహించే ఓర్పు లేక కావచ్చు. వీరభూపతివంటివారికి మీనాక్షీ కుట్టానుల వంటి వారి అమలిన ప్రేమను తెలుసుకొనే సాధన, యోగం ఉంటేనే అది జీవితంలో ఆచరణయోగ్య మౌతుంది. రాయప్రోలు కృతుల్లో ఎక్కడా అమలినశృంగారం పచరించే నాయికయొక్క భర్త రంగంలోకి ప్రవేశించడు. ప్రవేశిస్తే ప్రళయం తప్పదని విశ్వనాథ భావించినట్లున్నారు. బహుశః ఈ భయమే ఈ తత్త్వానికి ఆంధ్రసాహిత్యంలో భవిష్యత్తును కల్పించకుండా నిగ్రహించిందేమో! కావచ్చు.

కాని, రాయప్రోలు ఒక మహాసాహిత్య దార్శనికుడు. 'తను గావించిన సృష్టి తక్కొరుల చేతం గాదు నా' ప్రసిద్ధి కెక్కిన నవ్య కవిబ్రహ్మ !

ఆ చా ర్యు డు :

రాయప్రోలువారు ఉస్మానియావిశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులుగాను, ఆచార్యులుగాను 27 సంవత్సరాలు పనిచేశారు. వరంగల్ కళాశాల అధ్యక్షులుగా విశ్రాంతి తీసికొన్నారు. ఆపైన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులైనారు. విశ్వవిద్యాలయాలలో తెలుగు శాఖలో మొదటి ఆచార్య గౌరవం, మొదటి కళాశాలాధ్యక్ష గౌరవం ఆయనకే దక్కాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి గౌరవ డాక్టరేట్ పట్ట మిచ్చి గౌరవించింది. ఆయనకు సాహిత్య సంస్థలు 'కవిభూషణ' 'సాహిత్యస్థాపక' మొదలైన బిరుదా లిచ్చాయి. షష్టి పూర్త్యుత్సవం, తృణకంకణ రజతోత్సవం వారి సాహిత్యజీవితానికి నీరాజనాలు. కేంద్ర సాహిత్య అకాడమీవారు వారి 'మిశ్రమంజరి'కి అవార్డును బహూకరించారు. రాయప్రోలువారు అకాడమీవారి ఆంధ్ర భాగవతాన్ని సంపాదించారు. సాహిత్య పరిషత్తుల కాధ్యక్ష్యం వహించారు. లౌకిక గౌరవాలెన్నో పొందారు. పూర్ణజీవితాన్ని గడుపుతూ వార్ధక్యంలో కూడా వాగ్దేవిని ఉపాసిస్తూ వాఙ్మయసేవ చేస్తున్నారు !

ఈ అభినవనన్నయ ఆదినన్నయను గూర్చి చేసే ప్రార్థన ఈ వ్యాసానికి భద్రగీతి !

'తెనుగున్ తొల్లిట సర్వలక్షణ సముద్దీప్తంబుగా తీర్చి ది
ద్దిన దక్షుండు సరస్వతీచయన ఋత్విఙ్మౌళి రమ్యాక్షర
ధ్వని వాచారుచిలాలనాభణితి సంపన్నుండు, నన్నయ్య బ్ర
హ్మను ప్రార్థింతు మదీయ భావకవితా మార్గంబు రక్షింపగన్.'



# లాస్య కింకిణి *

'What divine drink wouldst thou have, my God, from this overflowing cup of my life?

My poet, is it thy delight to see thy creation through my eyes and to stand at the portals of my ears silently to listen to thine own eternal harmony? Thy world is weaving words in my mind and thy joy is adding music to them. Thou givest thyself to me in love and then feelest thine own entire sweetness in me'[1]

విశ్వరూపునిముందు గీతాంజలి ఘటించి గొంతెత్తి పాడుతున్న విశ్వకవి రవీంద్రుడు రసికలోక మనోనేత్రాలకు ప్రత్యక్షమౌతా డీగీతంలో. ఆయన జీవిత భాండం కవితామృతంతో పొంగులువారేది. అది ఆ అనంతరూపుని ఆరాధనలో అర్పితమయ్యేది. ఆయనకంటికి ఆ ప్రభువు ప్రాణేశ్వరుడు; 'కవీనాం కవిః'. దృష్టమైన విశ్వవైభవమంతా ఆ విశ్వపాలకుని విలాసవీచీవికాసం. భుక్తమైన భువన రాగ మాధుర్యమంతా ఆ అంతర్యామి అనంతరసానందసింధువు. సృష్టమైన గీతమంతా ఆ విశ్వమోహనుని అనంతప్రేమాక్షర ప్రసూనమంజరి. విశ్వకవిలో వినిపించే కవితావిపంచి వాగ్వృత్తిలో శ్రుతులు మీటుతున్న అంతఃకరణ కారుణ్య స్రవంతి. ఆ శ్రుతికీ, ఆ గీతికీ అవినాభావ సంబంధాన్ని కల్పించేవి ఆర్ద్రమైన ఆయన భావన, అభివ్యక్త చైతన్యమైన శబ్దం. ఆయన గీతాలు విభిన్న రాగాలలో సాగవచ్చు; ఆయనశబ్దం అభినవార్థాలను ఆవిష్కరింపవచ్చు. కాని, వాటికి మూలమైన శ్రుతిమాత్రం చెదిరిలేనిది. ఆ శ్రుతి విశ్వకవి గీతిలోని పరమార్థం. 'స యథా వీణాయై వాద్యమానాయై న బాహ్యాన్ శబ్దాన్ శక్నుయా ద్గ్రహణాయ వీణాయై తు గ్రహణేన- వీణావాదస్య వా- శబ్దో గృహీతః' అన్న బృహదారణ్యకోపనిషద్వాక్యం గీతాంజలి అంతర్నాదానికి అన్వేషణ సూత్రం :

---

* డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి "ఊర్వశి" కావ్యానికి పీఠికగా ప్రచురితం. ('ఊర్వశి-కాళిదాసు'- 197౮)

1. Gitanjali - 65 వ గీతం.

సాహిత్యంలో మనోబుద్ధుల నాశ్రయించి రెండు ప్రసిద్ధ ప్రస్థానాలు ప్రాచుర్యంలో ఉన్నాయి. ఆ రెండూ సత్యం, శివం, సుందరమన్న కళాధర్మాలను కాదనక నడిచేవే. కాని, వాటి దృక్పథాలు వేరు. ఒకటి సౌందర్యదృష్టి, మరొకటి శాస్త్రదృష్టి. ఒకటి కవిత; మరొకటి సంహిత. సత్యం సౌందర్యమంటుంది కవిత; సత్యం చిత్పదార్థ మంటుంది సంహిత. కవిత నడిచేది రాగమార్గం; సంహిత సాగేది విరాగమార్గం. అందువల్ల వాటిగతిలో భేదం భాసిస్తుంది. కవిత ప్రకృతిలో సత్యాన్ని దర్శిస్తుంది; సంహిత ప్రకృతిలో వికృతిని వివేచిస్తుంది. కవిత సమాజ సంసక్తియే శివ మంటుంది. కవిత సౌందర్యం అలౌకిక మంటుంది. సంహిత దానిని ఆధ్యాత్మిక మంటుంది. కవిత లౌకికమైన సత్యంనుండి భక్తిసూత్రంతో అలౌకికమైనసౌందర్యాన్ని రసానందంగా సాధించి రమిస్తుంది; సంహిత లౌకికమైన సత్యాన్ని అనిత్యంగా అనాదరించి విరక్తిసూత్రంతో ఆత్మానందాన్ని అనుభవిస్తుంది. కవితది కళాప్రస్థానం; సంహితది వేదాంత ప్రస్థానం! ఒక ప్రస్థానం ప్రకృతిలో పరమార్థాన్ని చూపి, ప్రవృత్తిలోనే పరమాత్మను బోధిస్తే, మరొకటి ప్రకృతిలోని వికృతిని చూపి, నివృత్తిలో నిర్గుణ బ్రహ్మను నిరూపించింది. కవితా ప్రస్థానం వేదాంత ప్రస్థానంలో లయమైతే సౌందర్యం సత్యంలో సంగుప్తమై పోతుంది. వేదాంతప్రస్థానం కవితా ప్రస్థానానికి వెన్నెముకగా నిలిస్తే సత్యం సుందరరూపంగా సాక్షాత్కరిస్తుంది. భారతదేశంలో వేదాంతికీ, కవికీ సంఘర్షణ సహజంగా సాగుతూనే వచ్చింది. కాని, వాల్మీకి వ్యాస కాళిదాసాదులు వేదాంతాన్ని కవితాప్రస్థానానికి జంటగా నిలిపినారే కాని పంటగా పండించలేదు. రవీంద్రు లాకోవకు చెందిన కవీంద్రులు. "If art is concerned with existance, we must not shut our eyes to the existance of Beuty"[2] అని కన్నులు మూసుకొనే వేదాంతిని కన్నులు తెరిపించారు. ముముక్షువును మనస్వీగా, తేజస్వీగా, ఓజస్వీగా ముందుకు నడిపించారు. 'Not self-immolation, but self-expression

---

2. A Random Discourse - 1927 - Tagore - Translated by Kshitis Roy from Bengali article Alapalocana - Rabindranath Tagore on Art & Aesthetics - Page 71.

must be our aim'[3] అని దారి చూపించారు. గీతాంజలి ఈ లక్ష్యంతో సాగిన కవితా ప్రస్థానం !

రవీంద్రుని గొంతుక ఒకశతాబ్దం క్రితం క్రొత్తగా జగత్తుకు వినిపించింది. యుగయుగాల ఉపనిషత్తులు ఉపాధిభేదంతో ఉజ్జ్వలంగా ఆయన ఉక్తుల్లో అభినవంగా ఉన్మీలించాయి. దానికి కారణం లేకపోలేదు. విరాగ సంహితలు విరివిగా వ్యాపించటంవల్ల సమాజంలో వేదాంతవిజ్ఞానం కరుడు కట్టింది; జాతి క్రియాశీలాన్ని కోల్పోయింది. పరదేశీయుల దాడుల్లో అది ప్రవృత్తిని పుంజుకోలేక పోయింది. మొగలాయిరాజ్యం మోహరించటానికీ అది మూలకారణమైంది. వారి ప్రభావంవల్ల మన జాతికి భోగదృష్టి అలవడింది. భోగవిరాగాలకు కొంతకాలం సంఘర్షణ రేగింది. భోగం క్రమంగా భౌతికవిజయాన్ని సాధించిందే కాని అది జాతి నొకరోగంగా పీడించింది. అందువల్ల ఆంగ్లేయుల వక్రనీతికి విరుద్ధంగా చక్రం తిప్పే వీర్యం మొక్కవోయింది; పరపీడన ప్రవృత్తికి బలవంతిగా తలవంచింది. వంచినతల యెత్తలేక బానిసవృత్తికి బలిఅయిపోయింది. తన జాతిదీనావస్థను చూచి రవీంద్రులు కన్నీరు కార్చారు. కన్నీటితో కరిగిపోతే కాలం కాటువేస్తుందని గ్రహించారు. జాతీయులను మన్నీలుగా మలచాలని మధనపడ్డారు. జాతి తనస్థితిలోని సత్యాన్ని తెలుసుకోవాలి; సాహసంతో శివంకరమైన మార్గాన్ని అనుసరించాలి; స్వాతంత్ర్యాన్ని సంయమనంతో సాధించాలి; స్వతంత్ర జీవనసౌందర్యాన్ని దర్శించి బ్రతుకును సమగ్రం చేసుకోవాలి. ఈ చతుస్సూత్ర ప్రగతిని పుంస్కోకిల కంఠంతో ప్రబోధించారు రవీంద్రులు! అందువలన ఆయనకవితలో రణధ్వనికిబదులు రసధ్వనిరవళిస్తుంది. సమకాలీన పారతంత్ర్య సమీక్ష, స్వాతంత్ర్య సమరానికి దీక్ష, స్వాతంత్ర్యసిద్ధికి నిరీక్ష—వారి ప్రబోధగేయాల్లో ప్రచురంగా కనపడతాయి.

రాజకీయంగా భారతజాతి స్వాతంత్ర్యాన్ని సాధించటంతోపాటు, సంప్రదాయంగా వస్తున్న సంస్కృతిని సమున్మీలితం కావించుకోవాలి. దానికై శక్తితోపాటు భక్తిని తనగీతికల్లో మేళవించారు గురుదేవులు. శక్తి జాతి విముక్తికి సాధనంగానూ, భక్తి జీవితానురక్తి బోధకంగానూ కవితలో రంగరించి

3. The Sense of Beauty - Tagore -1906 - Page - 1.

రూపొందించారు. రవీంద్రులు దేశసముద్ధరణంలో ఆత్మసముద్ధరణాన్ని విస్మరించలేదు. గురుదేవులు భారతంలో మహామానవుణ్ణి దర్శించారు. మానవ సమరంలో మనస్వాతంత్ర్య సమరం ఒక సముజ్జ్వలాధ్యాయంగా భావించారు. శివాజీ ధర్మధ్వజంలోని సంయమనసంగ్రామ శీలాన్ని సమర్థించారు; మహాత్ముని సత్యాగ్రహంలోని సమాజసాత్త్వికసాహసప్రవృత్తికి సమ్మోదించారు;అరవిందుని ఆధ్యాత్మిక తేజః ప్రకాశాన్ని ఆదరించారు; దేశాన్నీ మనిషినీ దైవంగా భావించే చైతన్యాన్ని ప్రశంసించారు; మానవతలో మాధవుడు మేల్కొన్న జాగృతిని ఆకృతివికారాల అలజడులపాలు కాకుండా అఖండ విశ్వాత్మ స్వరూపంగా సంభావించారు; ప్రకృతిలో పరమాత్మ దివ్య సౌందర్యాన్ని దర్శించారు; ఆ సౌందర్యాన్ని తమ భక్తిగీతాలలో శుక్తిమౌక్తికంగా సృజించారు; జీవిత విమర్శనంలో చిన్మయానందాన్ని అందించారు ; భక్తితో బడుగుజీవిని బలవంతుణ్ణి చేశారు; సామ్రాజ్యకనకసింహాసనం వెనుకసహస్రశీర్షునివిశ్వగురుపీఠాన్నిసందర్శించారు; నేలమీద అడుగులు వేస్తూనే నింగివరకు ఎగప్రాకటం నేర్పించారు; మహామానవ సాగరంతీరంలో నరదేవతకు సమస్కరించారు; మహామానస కాసారంలో రాజహంసకు రాసక్రీడలు బోధించారు; కన్నీటితోనే కాంతిదీపం వెలిగించారు; చింతలోనే జీవితసత్యాన్ని అన్వేషించారు; సంజ్ఞావాచకంలోని సర్వేశ్వరుణ్ణి సర్వనామంగా మార్చారు; భుక్తిలోనుండి భక్తిని తీసి నైవేద్య మందించారు; సాయుజ్య భక్తి మాధుర్యాన్ని గీతాంజలిగా కీలించారు; స్వర్గ మర్త్యః సంబంధానికి సగుణమైన ప్రకృతి సంబంధాన్ని సాధించారు; 'I believe that the vision of Pardise is to be seen in the sun-light and the green of the earth, in the beauty of human face and the wealth of human life, even in objects that are seemingly insignificant and unprepossessing. Every where on the earth the spirit of Paradise is awake and sending forth its voice· It reaches our inner ear without knowing it [4]. అని విశ్వసించారు. విశ్వకవి, అంతశ్శ్రవణం విన్న ప్రణవం ఆయన గీతాల్లో వినబడే అనంత జీవనరాగ ప్రణయం !

4. The Religion of an artist-Tagore-Lecturers delivered in China & Decca - Revised by the author-1936.

రవీంద్రుని కవితలోని దార్శనికత మార్మికతావగుంఠనంతో దర్శన మిస్తుంది. సగుణమైన సత్యంలో నిర్గుణమైన సౌందర్యాన్ని వ్యక్తీకరించుకొని సందర్శించటం దార్శనికత. సౌందర్యాభివ్యక్తిని ఆరాధిస్తూ దానిలోని తత్త్వాన్ని అవ్యక్తమధురంగా, ఆలోచనామృతంగా ఆవిష్కరించటం మార్మికత. సౌందర్యాభి వ్యక్తిలా కవి పచరించే వాచ్యశక్తికి వ్యంగ్యవైభవాన్ని అందించే కళావాహిక మార్మికత. వ్యక్తంలోనుండి అవ్యక్తమాధుర్యాన్ని ఆస్వాదించటానికి అనువైన రుచితోపాటు, పరిమళాన్ని కూడా ప్రసరింపచేసే ప్రక్రియ మార్మికత; అంత రాత్మ విశ్వాత్మతో సంవదించటానికి సరసమైన అభివ్యక్తిమార్గం మార్మికత; భక్తి కవితకూ తత్త్వకవితకూ నడుమ భావప్రతీకలతో నిర్మించే పూలవంతెన మార్మి కత; సౌందర్యమే సత్యమనీ, సత్యమే భగవత్స్వరూపమనీ భావించి, దాని సాయుజ్యంకోసం సాత్త్విక భక్తితో సంవేదనాన్ని రసార్ద్రగీతంగా ఉల్లేఖించే ఉపజ్ఞ రవీంద్రుని ప్రతిభకు ప్రభాచక్రంగా పరివేషించి ఉంది. రవీంద్రుని భక్తిలో అద్వైతంకంటె ద్వైతమే అధికంగా భాసిస్తుంది. ఆ కవీంద్రుని భావ నలో సృష్టికర్త కెంత గౌరవముందో స్పష్టమైన మానవాత్మ కంత మన్నన ఉంటుంది. మనిషి మాధవుణ్ణి పిలువగలడు. అత డిచ్చిన దానికంటె ఘనంగా ప్రతిదానం చేయగలడు.

'నా ప్రేమలతో నేను ఒసగగలదానిని
సింహాసనమునుండి దిగి
దరహాససుఖముతో, వక్షమునకు ఎత్తి
తీసికొనుము.

నా హస్తములలోనికి దేనిని ఇచ్చెదవో
దానికన్న అధికముగాగ తిరుగ
నీ చేతులలోనికి పొందెదవు'[5]

దేవుడు మనిషిని చేశాడన్న స్పృహతో దీనంగా వరంకోసం ప్రార్థించట మొకపద్ధతి; దేవుడు తనలో ఉన్నాడన్న స్పృహతో లోవెలుగును వెలుపల దర్శించట మొకపద్ధతి. దివ్యాత్మచైతన్యమైన భగవంతుడు మానవు డుపాసించే

---

5. 'ప్రతిదానము.' ఊర్వశి- అనువాదము - డా॥ బెజవాడ గోపాలరెడ్డి గీతం.

ప్రేమామృత బిందువుకంటె భిన్నుడుకాడన్న తెలివిడితో భగవంతుని యెదుట నిలిచి ఆయన్ను ఆహ్వానించటం మరోపద్ధతి. చివరిది ప్రేమమార్గం. ప్రేమారాధకుడు దైవాన్ని సౌందర్యంగా చూస్తాడు, ఐశ్వర్యంగా చూస్తాడు, శక్తిగా చూస్తాడు ; తన ప్రేమామృత సింధువులో తాను స్నానంచేస్తూ భగవంతుణ్ణి కూడా మునకలు వేయిస్తాడు. మునిగినప్పు డిద్దరికీ భేదం తెలియదు ; తేలినప్పు డిద్దరుగా కనపడతారు. ఈ మజ్జనోన్మజ్జన మధుర వాక్ప్రక్రియాకలాపం మార్మికతలో మనస్వులు మెచ్చే మహనీయగుణం.

రవీంద్రుని కవితలో మరో మధురమైన గుణం (సం)గీతం. కవితకు ఋతం ప్రాణం. ఆ ఋతం రాగప్రవంతిగా ప్రసరిస్తే గీతం; నియతగతిలో నడకసాగిస్తే పద్యం; స్వేచ్ఛాప్రేరితమైన అంతర్లయతో పలుకులు సారిస్తే వచనకవిత్వం. ఈ మూడింటిలో రవీంద్రుని ఋతంభరమైన అంతఃకరణం గీతాన్ని వరించింది. ఋతాన్ని Rhythm అంటారు పాశ్చాత్యులు. 'This is the creative force in the hand of the artist'[6] అంటారు రవీంద్రులు. ఋతం గీతంలో జాలు వారినప్పుడు అది పామరజనాన్ని కూడా పరవశింప చేస్తుంది; పాషాణాన్ని కూడా కరిగింప చేస్తుంది; పసిపాపల్ని కూడా స్పందింప చేస్తుంది. రవీంద్ర సంగీతం జనాదరణం పొందటానికి ఆయన కవితలో ఉన్న ఋతమే కారణం; గీతం ప్రజలనోట ప్రతిధ్వనించింది.

## 2

రవీంద్రుని మనోదర్పణంలో ప్రతిబింబించిన ప్రతిభామూర్తి ఊర్వశి ఒక తేజస్విని. వేదకాలంనుంచీ వినవస్తున్న ఈ వేల్పులపడతి రవీంద్రుని భావనలో ఒక క్రొత్త మెరుపు మెరిసింది. పురాణాలు ఆమె పుట్టుకనుగూర్చి పుట్టెడు కథలు చెప్పినా అన్నింటా ఆమె అయోనిజ. నారాయణుని ఊరువునుండి పుట్టిందని ఒక గాథ ఉంది. ప్రతీకాత్మకమైన ఆకథలో నారాయణుడు శృంగారరసాధిదేవత. దాని

---

6. The Religion of an artist - Tagore - Rabindranath Tagore on Art and Aesthetics- Page 49

గతికి ఊరువు ఆధారం. స్త్రీ స్పర్శ లేకుండా పురుషుని తనువునుండి పుట్టిందా తలోదరి ఆకథలో. పురుషసృష్టి ఎప్పుడూ సంకల్పప్రధానమే. సంకల్పాన్ని సాకారంగా రూపొందించటానికి తనయొడలికండలనే ఉపయోగించాడు నారాయణుడు. దాన్నిబట్టి తేలిన సారాంశ మిది. పురుషుని సంకల్పంలోనుండి సృజనశక్తిగా అంకురించి శృంగార చైతన్యానికి ప్రతీకగా ప్రవర్తించే సౌందర్యాభివ్యక్తి ఊర్వశి.

ఊర్వశి క్షీరసాగరంలోనుండి పుట్టిం దని మరోకథ. అమృతంతోపాటు పుట్టిన ఊర్వశి మృతిని జయించినది. ఒక చేత విషాన్ని, మరోచేత అమృత కలశాన్ని ధరించి జీవితంలోని సుఖదుఃఖాల ఉభయ స్పర్శలను సమదృష్టితో చూచింది. ఆమె స్వర్గాధినాథుని సభలో నాట్యం చేస్తుంది ; అతనిచేత మహర్షుల తపోభంగానికి నియుక్తురాలై కార్యసాధనంచేస్తుంది; ఒక్కొక్కసారి మనిషిమీది మమకారంచేత ప్రేమలో చిక్కుకుంటుంది. కాని, కొంత కాలానికి తెలివితో తప్పుకుంటుంది. భువిపై తల్లిగా సంతానాన్ని కనినా, దివికై తిరిగి ప్రయాణం కడుతుంది. ఇది స్థూలమైన ఊర్వశి రేఖాచిత్రం-మన ప్రాచీన వాఙ్మయభిత్తిక మీద గీయబడింది. ఊర్వశివంటి పాత్రలు పాశ్చాత్య సాహిత్యాల్లోనూ ఉన్నవి. గ్రీకుల సంప్రదాయంలో సైకీ(Psyche) అటువంటిది; స్కాండినేవియన్ సాహిత్యంలో ఎరిజా (Ereja) కూడా అటువంటిదే. సంస్కృత సాహిత్యంలో కాళిదాసు తన విక్రమోర్వశీయనాటకంలో నాయికగా చిత్రించాడు ఊర్వశిని. స్త్రీపుంసయోగరూపమైన రతి సంభోగపర్యంతంగా సమాప్తిచెందకుండా, వియోగంలో విషాదార్చిని వెలిగించి, అందులో దాన్ని పుటంపెట్టి ప్రకాశింపచేశాడు కాళిదాసా నాటకంలో. రతిని ఆంగికానుభవం నుండి ఆరాధనా విశేషంగా మార్చే అమోఘప్రయోగాన్ని కాళిదాసు నిర్వహించాడు. కవిలోకాని కది యొక కాంతి మార్గమై నిలిచింది.

అరవిందులు ఊర్వశిని తపస్సును భగ్నంచేసే మోహాంతరాయంగా భావించారు. క్రియాశీలాని కది మచ్చుమందుగా సంభావించారు; కర్తవ్యంనుండి దీక్ష తిరోధానం చెందటానికి ఊర్వశి సౌందర్యం కామరూపమని వ్యాఖ్యానించారు. కాళిదాసు కవితాపథంలో ఊర్వశి ప్రేమారాధన సోపానం;అరవిందుని ఆధ్యాత్మికలోకంలో ప్రవృత్తి నివృత్తులను నిరోధించే అవరోధ విధానం ;

రవీంద్రుని ఊర్వశి ఈ రెండుమార్గాలకంటె భిన్నమైన ప్రస్థానానికి సంబంధించింది. ఆయన భావనలో ఊర్వశి- విరక్తివలన రాగం విస్మృతం కాకుండా జగత్ప్రవృత్తిని జాగృతంచేసే సౌందర్యశక్తి. ఆశక్తిని రవీంద్రులు తమ ఊహాశక్తితో ఉల్లేఖించారు కవితలో. సగుణ నిర్గుణాలనడుమ మజ్జనోన్మజ్జనంగా సాగే భావదర్శనాన్ని మనోలోకంలో విమర్శనం చేసేలా వివేచించారు.ఆమె అచ్ఛమైన సౌందర్య స్పృహకు సజీవ ప్రతీక. ఆమె మాతకాదు, కన్యకాదు, వధువుకాదు, నందనవాసినియైన సుందరరూపం. కన్య అయితే అవ్యక్తకామ. పురుష భావ స్పర్శలేని అచ్ఛమైన పుట్టతేనె. కాని, ఆమె సకామ. పురుషునిలోని మధుర కామానికి తొలికోడికూత. ఆమె వధువు కాదు, వధువు ప్రజాతంతు కార్యధర్మరూపమైన దంపతి ప్రణయానికి త్రివర్గబంధురంగా కట్టుబడిపోయేది; పురుషునిలోని సగమై తాను సగమైపోయేది. ఆమె మాతకాదు. రతిని వాత్స ల్యంగా మార్చుకొని జీవనరాగాన్ని జీవకోటికి పంచేది మాతృత్వం. ఊర్వశి వత్సలానికి వెనుకనున్న రతిని రమించేది; వధువువలె నియతికి కట్టుబడక నిసర్గ స్నేహాన్ని పచరించేది;- అట్లని ఆమె అర్థలోభియైన వేశ్యకాదు; కామదృష్టికల కాముకురాలు కాదు; అతిచారియైన అభిసారిక కాదు. ఆమె ఒక వ్యక్తి అయితే ఇన్ని అవస్థ లున్నాయి. ఆమె- వ్యక్తిలోని సౌందర్యానుభవేచ్ఛగా అంకురించిన అబల. ఆమె వ్యక్తినిష్ఠమే కాదు; విశ్వవ్యాప్తం. అందుకే ఆమె 'ఉషోదయం వంటి' దంటారు రవీంద్రులు. ఉషస్సులో రాగమూ ఉంది, తేజమూ ఉంది. రాగంతో వ్యక్తిని రంజింపజేస్తుంది; తేజంతో లోకానికి కనువిప్పు కలిగిస్తుంది. వ్యక్తిగా చూస్తే ఆమె 'అనవగుంఠిత'; సమష్టిగా చూస్తే ఆమె 'అకుంఠిత'.

ఆమె 'తొడిమలేనిపూ' వంటారు రవీంద్రులు. బంధంలేని అనుబంధ మామె. ఆమె సమగ్రవికాసిని, అంటే పరిపూర్ణ ప్రేమస్వరూపిణి. సాగర మథనంలో తొలివసంతంలా వెలుగొందిందామె. అమృతసిద్ధికి సురాసుర ప్రకృతులు మానవమనఃక్షీరసాగరాన్ని మథించిన వృత్తాని కా గాథ ప్రతీక. అందులో హాలాహలం పుట్టింది, అమృతమూ పుట్టింది. ఆ రెండింటినీ రెండు చేతుల్లో కీలించింది ఊర్వశి. అలసిపోయిన ఆదిశేషుని సహస్రఫణాల్లాగా సముద్రతలం ప్రశాంతమై ఉంటే ఆ అంచున నిలచింది ఊర్వశి. ఇంద్రియసంక్షోభం చల్లారిన సత్త్వసాగరానికి ఆమె అధిదేవత. సుఖదుఃఖాలను శాసించే సౌందర్య శోభ. జగత్క్షోభోపశాంతికి ప్రాతిభాసిక రసానందాన్ని కలిగించే కళాపూర్ణరేఖ. భోగి

యైన సురేంద్రు డామె కుందశుభ్రకాంతిని చూచెనా-సంభోగతృష్ణమాని నమస్క-రిస్తాడు· భోగభూమిలో భోగంకంటె రాగం గొప్ప దని చాటే యోగ మామె. అందుకే అవనీతలంలో ఆమె అనింద్య. ఆమె పుట్టినప్పుడే సంపూర్ణయౌవన· ప్రేమ సాధనలో పరిణతి చెందేది. దానికి యౌవనదార్ఢ్యం ఊతకర్ర. అయినా ఆమె సాధకురాలు కాదు; సాధింపదగిన ఉన్నతస్థానం.

తపస్వుల తపోభంగానికి ఊర్వశి ఒకఉజ్జ్వలసాధనం మనిషి మాహర్షిగా మారి ప్రవృత్తినీ, తనచుట్టూ ఉన్న ప్రకృతినీ నిర్లక్ష్యంచేసి, నిత్య సమాధిలో నిర్గుణబ్రహ్మను ఉపాసిస్తాడు. నిర్గుణబ్రహ్మోపాసన నిశ్శ్రేయసానికి నిచ్చెన కావచ్చు. కాని, అందులో మనిషిని దేవతలకంటె మిన్నగా దిద్ది తీర్చే సౌందర్య చేతనం సమాధియైపోతున్నది· ఆజీవసమాధిలోనుంచి సౌందర్య రిరంసకు ముక్తిని సాధించేశక్తి ఊర్వశి. ఆమె చేసేది తపోభంగం కాదు; సమాధిలో నుంచి సౌందర్య సృష్టి. సౌందర్యం సశరీరభోగ పరిధిలో పరిమితం కాదు. సీమలులేని సౌందర్య చైతన్య సమారాధనంగా అది మానవ ప్రస్థానంలో సాగ వలసి ఉంది. దానికి తపస్సుకావాలి· కళ్ళుమూసుకొన్న తపస్సు కళ్ళు తెరవాలి. నివృత్తిప్రవృత్తియై ప్రకృతిలో సత్యాన్ని సగుణసుందరంగా దర్శించాలి. ఆదర్శ నానికి ఆలంబనమైన సగుణమూర్తి ఊర్వశి. ఆ ఆరాధనకు ఆరాధ్యమైన నిర్గుణ తేజస్సు ఊర్వశి. 'ధ్యానభంగ మొనర్చి మునులు నీపదతలమున అర్పింతురు తపఃఫలమును'-అంటారు రవీంద్రు లీసౌందర్యోపనిషత్సారాన్ని.

ఊర్వశి విద్యుత్ చంచల. నిష్కామజీమూతాలు ఆవరించిన అవనీతలంలో రసోదయాన్ని సూచించే రవ్వలతోరణం ఊర్వశి. ఆవెలుగులో ఆకులత్వమూ ఉంది. సంకులత్వమూ ఉంది. కాని ఆమె పిడుగులు పడత్రోయదు; నూపుర రవళిని శ్రవణానందంగా వినిపిస్తుంది. సంక్షుభిత జీవనగాథలో అనుక్షణం ఆశా కిరణాలను ప్రసరించే ప్రజ్వలిత రాగశక్తికి ఆమె విద్యున్మూర్తి! ఒక ప్రతిభా స్ఫూర్తి !!

ఆమె విశ్వప్రేయసి. సురసభామంటపంలో ఆమె చేసే నృత్యం భోగ సీమలో ఆమె కావించే పరివర్తనం. ఆమె భూతలానికి స్వప్నసంగిని. కళ్ళు మూసుకొంటే మనోలోకంలో విహరిస్తుంది; కళ్ళు తెరిస్తే ప్రకృతి రంగంమీద

లాస్యం చేస్తుంది. తారలు ఆమె స్తనహారవిగళిత మణిపుంజాలు; దిగంతం ఆమె జారవిడిచిన మేఖల. త్రిలోక హృదయరక్తం ఆమె చరణ శోణిమ. విశ్వవ్యాప్తమైన ఆమె విరాడ్రూపం జీవసంస్కారంలోని సౌందర్యశోధనం!

ఆధునిక నాగరకతలో ఊర్వశిలాస్యం లోపించింది. అస్తాచలవాసినిగా ఊర్వశి అస్తమింపరాదని రవీంద్రుని ఆకాంక్ష! ఉషోమూర్తిగా మరల ఉన్మీలించాలని ఆవేదన! ఆ చిరవిరహపు దీర్ఘనిశ్వాసాలను రవీంద్రు లీగేయంలో ఊపిరిగా ఊదారు. నిర్వీర్యమైన సమకాలీన సమాజానికి ఉషస్సు రావాలనీ, అది విశ్వప్రేమోపాసనగా వికసించాలనీ, హేతువాద శాస్త్రదృక్పథాలలో కవితాకళారాగ ప్రస్థానం ప్రస్ఫుటించాలనీ రవీంద్రుని అంతర్వేదన ఈ అప్సరోంగన అభినవావతారంలోని అంతరార్థం!

'ఇద్దరు నారీమణు' లన్న గీతంలో రవీంద్రులు ఊర్వశి ప్రక్కన లక్ష్మిని నిలువబెట్టారు. ఊర్వశి 'విశ్వకామనారాజ్యమున రాణి'; లక్ష్మి విశ్వజననియైన కల్యాణి. ఒకరు స్వర్గ అప్సరస; మరొకరు స్వర్గ ఈశ్వరి. ఒకరు లోకానికిచ్చేది 'నిద్రావిహీనయౌవనగానములు', మరొకరు ప్రసాదించేది 'హేమంత హిమకాంత శాంతి పూర్ణతలు', వారు పుట్టినచోటు 'సృజనసముద్రమంథనం'. రవీంద్రుల సాహిత్య దర్శనానికి ఇద్దరు నారీమణులు ప్రతీకలుగా నిలిచిన రెండుకళ్ళు. సృజన వ్యాపారం సౌందర్యాన్నీ, విశ్వశ్రేయాన్నీ సంపాదించాలన్న కళాతత్త్వానికి ఈగీతం ధ్వన్యాలోకం!

# 3

ఈ 'ఊర్వశి' ఖండకావ్యసంపుటి అష్టాదశపర్వాల భారతం కాదు; పదునెనిమిది కళాఖండాల కమనీయకదంబం. రవీంద్రులు రచించిన కావ్యాలను కాలానుక్రమంగా, యథాతథంగా అనువదించాలన్న దృష్టితో చేసింది కాదీయత్నం. డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారిని కదిలించిన, కరిగించిన రవీంద్ర కవితాకృతులే తెలుగులో కర్పూరఖండాల్లా ఇందులో కుప్పలుపడ్డాయి. రవీంద్ర సాహిత్యాన్ని ఆంధ్రభారతికి అలంకారంగా సమర్పించాలన్న డా॥ రెడ్డిగారి ప్రవృత్తి అనువాదమూలం కాదు; అనుభూతిసాంద్రం. అందువల్లనే ఈ సంపుటిలో రవీంద్రుని గీతాల్లో జాతి జీవననాడులన్నీ స్పందింపజేసిన రచనలు

వైవిధ్యంతో చోటుచేసుకొన్నాయి. ఇందులో ప్రబోధగీతా లున్నాయి. ప్రకృతి వర్ణనగీతా లున్నాయి. భక్తిగీతా లున్నాయి. సమాలోచనాసక్తి గీతాలు న్నాయి. అభినందనగీతా లున్నాయి. ఊహాచిత్రా లున్నాయి. భావచిత్రాలు న్నాయి. అనువాదకుని అభిరుచిలో ఆకృతిదిద్దుకొన్న ఈ ఖండకావ్యాలు రవీంద్రుని కాంతికిరణాల్లో ఉన్న హరివిల్లును అపూర్వంగా ఆవిష్కరిస్తున్నాయి.

'జనగణమన అధినాయకమైన' భారతసమైక్య శక్తిని ప్రస్తుతించే ప్రసిద్ధ గీతం 'భారతతీర్థము'. భారతజాతి చరిత్ర పరిణామ దశావికాసాన్ని ఐతిహాసిక ప్రవృత్తితో సమీక్షించే సూత్రం ఈగీత నిర్మాణశిల్పం. ఆరుఖండాలుగా సాగిన ఈ గీతంలో ఆర్యులనుండి ఆంగ్లేయులదాకా భారతసంస్కృతి వాహినిలో విలీన మైన సంస్కారధారా తరంగిణుల షట్పదవిన్యాసం వినబడుతుంది. సర్వనదీ గర్భమైన సాగరాన్ని భారత మహామానవ సారంగా రూపించారు రవీంద్రులు. ఆ సాగరతీరంలో నరదేవతను స్థాపించి నమస్కరించుమన్నారు; ఆ దేవతనే భారతమాతృమూర్తిగా భావించి అభిషేక తీర్థాలను సమీకరించుమన్నారు. మాతృపూజకై పిలిచే ఈ గీతం దేశభక్తిని ప్రబోధించే ప్రభాతభేరి. 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అన్నతత్త్వం ఈ గీతంలోని అంతర్ని నాదం. మనిషికి మానవతయే మాత-మానవతయే మాతృదేశానికి మారుమాట అన్నది ఈగీతంలోని మహనీయ సందేశం!

ఈ సంపుటిలో విస్తృతితోనే కాక వీరరసాకృతితో అవతరించిన గేయం 'శివాజి-ఉత్సవం'. శివాజి 'ఏకధర్మ రాజ్యస్థాపన' ఉద్యమాన్ని భారతీయ స్వాతంత్ర్యసమరానికి ప్రేరణగా పరివర్తించుకొన్న సమకాలీనసమాజసమరోత్సా హాన్ని సమర్థిస్తూ వ్రాసిన రచన. మొగలాయి ప్రభుత్వాని కెదురొడ్డి సనాతనధర్మ రక్షాదీక్షతో కాషాయధ్వజాన్ని ఎగురవేసి కరవాల సాధనంతో కదనయజ్ఞాన్ని నిర్వహించి, నిర్వీర్యమై విచ్ఛిన్నమైన భారతజాతిని ఏకసూత్రంమీద నడపించి, ఏకలక్ష్యసాధనకై జాగృతం చేసిన మహావీరుడు శివాజి. మహమ్మదీయ యుగ చరిత్రలో శివాజీ ఒకజాతీయోద్యమశక్తి. ఆంగ్లేయులపాలనలో ఆత్మగౌరవాన్ని కోల్పోయిన భారతజాతి-మరలా మూడువందల సంవత్సరాల తరువాతఇతిహాసపు పుటల్లో ఇరులు కమ్ముకొనియున్న శివాజీ వీరభారతాన్ని శిరమెత్తేటట్లు చదువు కొన్నది. మహమ్మదీయయుగంలో శివాజీఒకవ్యక్తి నాశ్రయించిన జాతీయశక్తి.

బ్రిటిష్ యుగంలో శివాజీ ఒకజాతి నాశ్రయించిన చైతన్యశక్తి. ప్రభుశక్తి ప్రజాశక్తిగా పరిణామమంచెందినట్లు ఇతిహాసగతిని సమీక్షించే రవీంద్రుని ప్రజ్ఞాచక్షువీ గీతంలో ప్రఫుల్లంగా వికసించింది. 18 ఖండాలుగా సాగిన ఈ గీతం చిన్న పాటి శివభారత మనిపిస్తుంది. శివాజీని దస్యుడుగా పాశ్చాత్య చరిత్ర చిత్రించింది. ఆ మిధ్యావ్యర్థ ప్రసంగాల ఇతిహాసాన్ని రవీంద్రులు కన్నెఱ్ఱచేసి మందలించారు. 'ఏది మరణింప నేరదో, దానిని ఎట్లు అణచివేయగలవు, నీ వ్యంగ్య వాణుల ?' అని అధిక్షేపించారు. వంగరాష్ట్ర ఉద్యమ తేజస్సుకు మహారాష్ట్ర శివరాజశక్తి పునరుత్తేజాన్ని కలిగించిన ఇరువయ్యోశతాబ్దపు తొలిఉషస్సు రవీంద్రుని గొంతుకలో గీతంగా మారుమ్రోగింది. ఐక్యభారత స్పృహ సత్యం; స్వాతంత్ర్య కాంక్ష శివం. శివాజీ వాటిని వెలుగులోకి తెచ్చిన వీరతేజం. నిప్పు నివురుతో కప్పబడవచ్చునుగాని నిర్మూలంకాదు; సత్యం శతశతాబ్దాల విస్మృతి తమస్సులో చిక్కుపడవచ్చును గాని సమూలంగా నాశనం కాదు. శివాజీ ఒకనాడు చారిత్రకవ్యక్తి- మరొకనాడు ఉద్యమశక్తి. ఇవి చరిత్రలో పునరావృత్త మయ్యే నిత్యసత్యం. అది రవీంద్రుని కవితలో కమనీయ భావ వర్ణాంబరాలను తాల్చి అవతరించింది. స్వభావాన్ని బట్టి ఇది సంస్మరణ గీత మనిపిస్తుంది; ప్రవృత్తిని బట్టి ప్రబోధగీత మౌతుంది. నడిపిస్తున్న శక్తి దీని రేఖాచిత్రం; రవీంద్రుని హృదయ స్పందన వర్ణసంయోజనం !

అరవిందుల జన్మదినోత్సవ సందర్భంగా రవీంద్రులు నమస్కరించి సమర్పించిన గీతాంజలి 'అరవిందు'. ఇరవయ్యో శతాబ్దపు పూర్వార్ధంలో నవ భారత చైతన్యానికి త్రికరణాలని చెప్పదగిన త్రిమూర్తులు—రవీంద్రుడు, అరవిందుడు, మహాత్ముడు. భారతజాతి హృదయ స్పందన రవీంద్రుని కవితలో వినిపిస్తుంది. దివ్యవాక్కు అరవిందుల వాక్కులో ధ్వనిస్తుంది; కార్యశీలం గాంధీమహాత్ముని సత్యాగ్రహ సమరంలో కనిపిస్తుంది. రవీంద్రుని కవిత దివ్య వాక్కును ఆత్మతో అందుకొన్నది; కార్యశీలాన్ని అంతఃకరణంతో ఆమోదించింది. ఆయన కవిత అందుకే త్రివేణీ సంగమంగా వెలుగొందుతుంది.

'అరవిందు ! రవీంద్రుని నమస్కారముల స్వీకరింపుము.
మిత్రమా ! దేశబంధూ ! స్వదేశ ఆత్మ యొక్క
వాణీమూర్తివి నీవు !'[7]

అని రవీంద్రుడు జోహారు లర్పించాడు. దాస్యాంధకారంలో జాతికి ఆధ్యాత్మిక జ్యోతిస్సులా వెలుగొంది ముక్తిని ప్రసాదింపయత్నించే ఆయన అభినవ యోగమార్గం తాత్త్వికుడైన రవీంద్రునికి ఆశాకిరణంగా కనిపించింది. కారాగారంనుండి వెలువడ్డ అరవిందుడు విజ్ఞాన పారావారంగా విస్తరిల్లాడు; మానవజీవిత ప్రస్థానంలో దివ్యమానవ లక్ష్యాన్ని దర్శించాడు. మృత్యువునుండి జాతిని అమరత్వంవైపు మరలించాడు. ఆ యోగి పిలుపును జాతికి వైతాళిక గీతంగా వినిపించాడు రవీంద్రుడు. అరవిందుడు కవియైన తాత్త్వికుడు; బుద్ధికి కావలసింది అరవిందుడు. మనస్సు బుద్ధికి ప్రణామా లర్పించిన సంస్కారసిద్ధి ఈ గీతంలోని భావనవనీతం[7]

అస్పృశ్యతను వ్యంగ్యంగా నిరసించేగేయం 'అవమానితులు'. పతిత పావనత్వాన్ని ప్రతిపాదించే భజనగీతాలతో భగవంతుని వైపు దృష్టి మళ్ళించిన మహాత్ముని క్రియాశీలం హరిజనోద్యమంలో మాధవసేవగా మన్ననగాంచింది. రవీంద్రుని భక్తిచిత్తానికి అస్పృశ్యత అవమానంగా భాసించింది. హిందూధర్మం అస్పృశ్యతను ఆదరిస్తే అంతరించటం తథ్యం. అంతమొందిన తరువాతనైనా చితాభస్మంలో సర్వవర్ణాల సమానత్వం తప్పక నిలిచేదే. మృత్యువునకు లేని అస్పృశ్యత మృత్యువును జయించలేని అహంకారం ఏర్పరచుకొన్న నియమ బంధం. దానిని త్రెంచివేయుమన్నారు రవీంద్రులు.

'నీవు బంధించియుంచుకొనిన
నల్గడల మునిగి స్వాభిమానమున
మృత్యుమధ్యమున కావలసియున్నది
చితాభస్మములో అందరి సమానము'[8]

అని ప్రబోధించారు. 'అవమానములో కావలసియున్నది వారందరి

7. ఊర్వశి - అనువాదము - డా॥ బెజవాడ గోపాలరెడ్డి — గీతం. అరవిందు.

8. ఊర్వశి - ,, ,, - గీతం. అవమానితులు.

సమాసము' అన్నది మకుటంగా అయిదు చరణాలు సాగి ప్రబోధపంచకంగా ప్రకాశిస్తున్నదీ గీతం. ఆరవచరణం కర్తవ్యాన్ని సూచించి ఉపసంహార శిల్పాన్ని సంతరించుకొన్నది.

ఉపనిషత్తులోని అర్థవాదంలాగా ఆకృతి సంతరించుకొన్నది. 'రెండు పక్షులు' గీతం. వనంలో స్వేచ్ఛగా విహరించేది ఒకపక్షి; పంజరంలో పదిలంగా నిలిచేది మరోపక్షి. స్వతంత్రగీతాన్ని పాడమంటుంది మొదటి పక్షి. నేర్చిన పలుకులే నెమరువేస్తానంటుంది రెండవపక్షి. పంజరపు బ్రతుకులో ఎప్పుడో ద్వారాలు మూతబడతాయని హెచ్చరిస్తుంది మొదటిపక్షి; స్వేచ్ఛగా ఎగిరే సత్తువే రెక్కలకు పోయిందంటుంది రెండవపక్షి. పారతంత్ర్యంలో స్వతంత్ర శక్తిని కోల్పోయిన దేశీయులపై విసరిన కశాఘాతం ఈ గీతం!

మానవుడు త్యాగధనంతో మాధవునికే ప్రతిదానం చేయగల మహాదాత-అని చిత్రించిన భావచిత్రం 'ప్రతిదానం'. హృదయానికున్న విలువను ఉపాఖ్యాన శిల్పంతో చెప్పేది 'ఉత్కృష్ట మూల్యము'. రాజబలాత్కారంగాని, ధనికుల బంగారం గాని, విలాసినీ మందహాసంగాని విలువకట్టలేని హృదయం ముద్దుబిడ్డముందు ముత్తెంలా మెరసిపోతుంది. మనిషికి బాల్యం మూలం. దానికి లేదు లోకంలో మూల్యం అన్నసత్యాన్ని సున్నితంగా చెప్పేగీతమిది. 'ఉత్కృష్టమూల్యము'నకు ఉజ్జీగా నిలిచేది 'ఉచితస్థానము'. 'ఏ సంతలో నీవు అమ్ముడు పోకౌరెదవు ఓనా గానమా? ఎచ్చట నీస్థానము?' అని ఉల్లేఖిస్తూ ప్రశ్నించటం ఈగీత నిర్మాణశిల్పం. చివరకు 'విశ్వవేణురవముల మధ్య' గానస్థానమని సూచించటం కొసమెరుపు. కళాప్రయోజనాన్ని కవితామయంచేసి చెప్పే నేర్పు ఈ గీతంలో అనంతంగా భాసిస్తుంది. 'What are literature, music or fine arts? They are all media of artistic self-expression through the language of words, the sound, the line and the colour. And all of them seek to record but one thing-- the wonder and joy of man's discovery of the Truth'.[9] విశ్వసత్యాన్వేషణలో కళకు విశ్వజనీనత అలవడుతుంది. అదే కళాధర్మమని విశ్వకవి వివేచన!

---

9. The Sense of Beauty - Tagore - 1906 - Translated by kshitis Roy from the Bengali essay 'Saundarya Bodh.'

రవీంద్రుని స్త్రీభావన 'మానసి' గీతంలో రమణీయంగా దీపించింది.

'కేవలము విధాతృని సృష్టివి కావు నీవు నారీ !
పురుషులు రచించిరి నిన్ను, సౌందర్యముల సేకరించి........
సగముమాత్రమే మానవివి నీవు, సగము కల్పనవు'[10]

సత్యానికీ సౌందర్యానికీ సంగమతీర్థం స్త్రీ. సౌందర్యంలో సత్యాన్ని అన్వేషించటానికీ, సత్యాన్ని సౌందర్యంగా దర్శించదానికీ సృష్టి సమర్పించిన సజీవ కళాఖండం స్త్రీ. ఆమెను కళాదృష్టితో ఆరాధిస్తే కవితగా జాలువారుతుంది. కామదృష్టితో చూస్తే మోహంగా మోహరిస్తుంది; ప్రణయదృష్టితో పరిశీలిస్తే భక్తిగా పరిణమిస్తుంది; ధర్మదృష్టితో దరికి చేరితే శక్తిగా సహకరిస్తుంది; తత్త్వదృష్టితో ఉపాసిస్తే అమృతమూర్తిగా అవతరిస్తుంది. స్త్రీలో పురుషుడు అందుకొనే అనుభూతి ఉంది; అందుకోవలసిన పరంజ్యోతి ఉంది. టాగూర్ మాటల్లో- 'Woman is endowed with the passive qualities of chastity, modesty, devotion and power of self-sacrifice in a greater measure than man is. It is the passive quality in nature which turns its monster forces into perfect creations of beauty ... Life should be like a lamp where the potentiality of light is far greater in quantity than what appears as the flame. It is in the depth of passiveness in woman's nature that this potentiality of life is stored[11]

'ప్రణయప్రశ్న' ఒక చక్కని యక్షప్రశ్న. ఆవరణపరిధిలో చిక్కుకొన్న ప్రణయం అనంత విశ్వవ్యాప్తంగా ఆవరించే భక్తిభావంగా పరిణమించే జిజ్ఞాసను ఈగీతం కలిగిస్తుంది. 'అసీమతత్వము లిఖితము నా సుకుమార లలాటఫలకమున, అన్న ప్రణయబోధ మనిషిలోని మోహావరణ విచ్ఛిత్తిని కావించే మధురవాదంగా వినిపిస్తుంది.

---

10. ఊర్వశి-అనువాదము - డా॥ బెజవాడ గోపాలరెడ్డి-గీతం. మానస.

11. Woman - Tagore - Personality - Lectures Delivered in America Ed. 1970 P. 173-174

రవీంద్రుడు ప్రకృతిని ఉల్లేఖించే ఊహాచిత్రం 'విచిత్రరూపిణి'. విశ్వా న్నంతా కనురెప్పలతో అప్పళించి అందించినట్లుంది ఈ గీతమాధుర్యం. చంచల త్వంలోనుంచి స్థిరత్వంలోకి పయనించే దర్శనప్రగతి ఈగీతంలోని అంతశ్శిల్పం. ప్రకృతి మొదట చంచలగామినిగా, ఆ పైన మంజులరాగిణిగా, ఆ తరువాత విచిత్రరూపిణిగా, క్రమంగా చిరయామినిగా, అచపలదామినిగా, చివరకు అనంతవాసినిగా సాక్షాత్కరించే విలాసం బహిర్లోకం నుండి అంతర్లోకానికి కవి దృష్టి సాగించిన ప్రస్థానంలా కనపడుతుంది 'Art awakens a sense of the real by establishing an intimate relationship between our inner being and the universe at large, bringing us a consciousness of deep Joy'[12] అన్న రవీంద్ర కళాతత్త్వం ఈ గీతికలో భావనాపక్షాలను విప్పి విహాయసంలో విహరించింది.

ప్రకృతివర్ణన కవిప్రతిభకు నికషోపలం. ప్రకృతికి ఋతుశోభ పరిణామ రమణీయతను ప్రసాదిస్తుంది. దాన్ని మధురంగా దర్శించి, ఆత్మీయంగా ఆవిష్కరించటం మహాకవులందరిలో కనబడే మహనీయగుణం. ఆరు ఋతువు ల్లోనూ వసంతం ఋతురాజం. స్త్రీపుంసయోగరూపమైన ప్రవృత్తి ప్రకృతిప్రత్య ణువులో ప్రఫుల్లమౌతుంది. సృష్టిస్థితికి వసంతచైతన్యం మూలప్రకృతి. దాని కంటె ఘనమైనది వర్షర్తువు. ఇందులో కారుమబ్బులు క్రమ్ముతాయి. అవి కరు ణారసధారలు వర్షిస్తాయి. విలయచైతన్యంతోపాటు విలాసమాధుర్యాన్ని కూడా ఈఋతువు వెలారుస్తుంది. భీకరరమణీయమైన వర్షర్తువు కవులలోతును, ఎత్తును పరీక్షిస్తుంది. అందువల్లనే లోకంలో వర్షర్తువును విరివిగా వర్ణించినవాడే మహా కవి అవుతాడన్న జనవాక్యముంది. రవీంద్రులు వసంతంకంటె వర్షర్తువునే కవితల్లో, కథల్లో విస్తారంగా వర్ణించారు. ఈ సంపుటిలో 'వసంత', 'నవవర్ష', 'వర్షామంగళము' అనేవి ఋతుగీతాలు.

రవీంద్రులు 'వసంత' లో లోకలోకాంతరాలలో వెల్లివిరిసే మనోహర మాధుర్యంతోపాటు, అశ్రునీరములతో చిత్రింపబడిన విరహగాథా ప్రపంచాన్ని

---

12. Maker of Form-Tagore-1931-Notes of lecture given extempore in Bengali at Kala Bhavan, Santiniketan Translated by Lila Ray.

సైతం దర్శించి, మనోరథమురళిలో వినిపించే అమరవేదనను వసంతమర్మర నిశ్వాసంలో వింటూ, 'ఉత్తప్తయౌవనమోహము రక్తరౌద్రంగా రంజిత మొన ర్చిన చైత్య సంధ్యాకాశాన్ని' చిత్రించారు. వసంతంలో సంభోగం కంటె విప్ర లంభం వైదగ్ధ్యాన్ని వెలారుస్తుంది. 'వర్షామంగళం' లో వైవిధ్యంతో కూడిన 'అతిభైరవ హర్షం' అతివేలంగా తాండవిస్తుంది. భావానికితోడు శబ్దరీతికూడా ఓజస్సుకు తాళంవేస్తుంది. ఘనగర్జారావం, ఉన్మత్త కలాపి కేకాకలరావం, అభిసారికల కింకిణీలాస్యరాగం, అనురాగిణుల మేఘమల్హారరాగాలాపం, కదంబ రేణువుల పుష్పశయన విలాసం, పురకామినుల వాసకసజ్జికాప్రలాపం, నీప శాఖలడోలోత్సవ కలాపం, వనవీథిలో కవికదంబాల గీతికాప్రచారం- ఇవన్నీ వర్షర్తు మంగళవేళా జీవన చైతన్య స్వరాలు!

'నవవర్ష' గేయం బెంగాలీలో బహుజనాదరాన్ని పొందింది. రవీంద్ర సంగీతంలో రత్నమై నిలిచింది. ఇందులో నాదమాధుర్యంతోపాటు, రవీంద్రుని ఆత్మాశ్రయ కవితాసౌందర్యంకూడా శ్రుతికలిపి నడుస్తుంది. గేయగతిలో మయూర నృత్యం ప్రత్యక్షమౌతుంది. రసోదయవేళ వెల్లివిరిసే మానసహర్షో ల్లాసానికి ఈగీతం మచ్చుతునక!

నూరు సంవత్సరాలతరువాత తనకవితను చదివి నవకవి ఏమనుకుంటాడు? అని ప్రశ్నించుకొని ఊహించి చిత్రించిన కవిత 'శతవర్షములపిదప'. అప్పటికీ ఇప్పటికీ, మరెప్పటికీ కవికి కనపడే ప్రకృతి ఒకటే, అనుభూతి ఒకటే-అయితే అభివ్యక్తి భిన్నం. 'నావసంతగానములు నీవసంత దినముల, ధ్వనితమగుకాక క్షణకాలమునకై'-అని సందేశమిస్తారు రవీంద్రులు భావిశతాబ్దపు కవికి.

ఈ సంపుటిలో చివరిగేయం 'అంత్యనమస్కారము'. గీతాంజలి చివరి గేయంతో ఈ సంపుటి ముగియటం విశేషం. గీతాంజలి భగవంతుని ముందు రవీంద్రుడు పట్టిన గేయసుమాంజలి. విశ్వకవి సాహిత్యోద్యానంలో విరిసిన గేయగుచ్ఛాలలో మనసుకు నచ్చినవాటిని ఎన్నుకొని, మనసు మెచ్చినవిధంగా మలచుకొని, అనువాదకుడు స్వీయాభిమానంతో దండ కూర్చుకొని తెలుగువారి కర్పించిన పుష్పాంజలి ఈ సంపుటి।

విశ్వకవి సాహిత్యవ్యక్తిత్వంలోని వెలుగుల వైవిధ్యాన్ని వెలార్చే కూర్పు ఈసంపుటిలోని సంవిధానశిల్పం. సౌందర్య చేతనమైన ఊర్వశిని ఆహ్వా

నిస్తూ, వర్షమంగళానికి ఆహ్లాదిస్తూ, శివాజీ ఉత్సవాన్ని శివమెత్తి కీర్తిస్తూ, అరవిందుని వెలుగుబాటకు స్నేహాన్ని పచరిస్తూ, మహామానవ సాగరతీరంలో మాతృపూజలు సాగిస్తూ, విశ్వనాథుని సాన్నిధ్యంలో కేలెత్తి నమస్కరించే రవీంద్రుని కవితామూర్తి ఇందులో సాక్షాత్కరిస్తుంది. 'ఘనశ్రావణ మేఘము మాడ్కి- రసభారముచే నమ్రము, నతము'- ఈకవితాకృతి।

# 4

'నీమాధుర్యము నన్ను బంధించి ఉంచకుండును గాక !
నీ ఐశ్వర్యము వైపునకే అది నన్ను లాగుచుండునుగాక !'[18]

బెంగాలీ కవితలో రవీంద్రులు భగవంతుని సంబోధిస్తూ, ఆత్మనివేదనం చేస్తున్నట్లుంటే- డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు తెలుగుకైతలో అంతర్వర్తియైన గురుదేవుణ్ణీ, సర్వవ్యాప్తియైన సర్వేశ్వరుణ్ణీ కలిపి పిలుస్తున్నట్లుగా ఉంటుంది. రెడ్డిగారి ప్రతిభానేత్రం విశ్వకవి కవితావాతాయనంలోనుంచి విశ్వేశ్వరుణ్ణి విలోకిస్తుంది.

శాంతినికేతనంలో అంతేవాసిత్వం నెరపేరోజుల్లో రెడ్డిగారు రవీంద్రగీతాలను విన్నారు. స్వయంగా తన్మయులై ఆలపించారు. బెంగాలీ రచనలోని రాగమాధుర్యం వారిలో కల్పించింది శ్రవణానందం. దానికి వారు చేసింది మననం. అందువల్లనే గురుదేవులది తాళ లయలను మన్నించిన గేయరచనమైతే- రెడ్డిగారిది అంతర్లయను అలవరచుకొన్న వచనరచనగా రూపొందింది.

గురుదేవుల గీతాల్లోని గతివిలాసం బహిరలంకార శృంగారం. అది రచనలోని భావాల కబ్బిన వేషాలంకరణం. రెడ్డిగారిదృష్టి ఆకృతిసౌందర్యంమీద ప్రసరించినంతగా అలంకారవిలాసాలమీద వ్యాపింపదు. రచనకు ఆకృతిసౌందర్యం శబ్దార్థాలవల్ల ఏర్పడుతుంది. వేషాలం[illegible] ఛందోగతివల్లా శబ్దార్థాలంకారాలవల్లా వస్తుంది. ఆడంబరవేషాలంకరణాన్ని [illegible] నని రెడ్డిగారు రాగరంజితమైన గతివిలాసాన్ని అనువాదంతో గ్రహిం[illegible]ని,

18. నైవేద్యము-అనువాదము- డా॥ బెజవాడ గోపాలరెడ్డి

మూలంలో ఉన్న అర్థగాంభీర్యాన్నీ, శబ్దవిన్యాసాన్నీ అనువైనచోటల్లా బింబ ప్రతిబింబ భావంతో అనువాదంలోనికి అవతరింపచేశారు !

గురుదేవుల రచనలోని గేయవృత్తి భావావేశాన్ని కలిగించటానికి తోడ్పడుతుంది; రెడ్డిగారి రచనలోని వచన ప్రవృత్తి ఆలోచనను వికసింపచేయటానికి ఆలంబనమౌతుంది. మూలంలోని గేయావేశం అనువాదంలో ఆలోచనామృతంగా అవస్థాంతరం చెందుతుందన్నమాట; గురుదేవుల రచనలో అంతర్ముఖమైన రాగలయకు బాహిరమైన రచనాభివ్యక్తి జరిగితే- రెడ్డిగారి అనువాదంలో మూల రచనాభివ్యక్తిని అంతర్ముఖంగా ప్రవహింపజేసుకొని ఆత్మీయతాముద్ర వేసికొనే వచనరచనానియుక్తి రూపుకట్టింది. పైగేయ వాక్యాల్లోని తాత్పర్యాన్ని గురుదేవులపరంగా అన్వయిస్తే రెడ్డిగారి రచనలోని ఈ రహస్యం బోధపడుతుంది. 'కర్మక్షేత్రమున సక్షమ స్వతంత్రుడను కానిమ్ము'[14] అని చేసిన ప్రార్థన సార్థకమే అనిపిస్తుంది. ఇక్కడ కవికర్మ కావ్యం; కర్మక్షేత్రం అనువాదకావ్య నిర్మాణం; క్షమ మూలతాత్పర్యం ; స్వతంత్రత రెడ్డిగారి వచనకవితారచనా ప్రక్రియ !

ప్రక్రియలో స్వాతంత్ర్యాన్ని ప్రకటించిన రెడ్డిగారు పదబంధాల్లో మూలాన్ని అనుకరించట మొకవిశేషం. దానివల్ల రెడ్డిగారిశైలి కొక వైలక్షణ్యమేర్పడింది. తెలుగులోని కావ్యానువాద పద్ధతుల్లో రెండు మూడు విశేషాలు కనపడతాయి. అర్థప్రధానాలైన ఇతిహాసపురాణాలను అనువాదం చేసేటప్పుడు మూలతాత్పర్యమే గ్రహించి కవులు స్వతంత్రశైలిలో రచనలు చేశారు. ఈ మొదటి మార్గానికి కవిత్రయం ఆద్యం. శ్రీనాథాది కవులు శబ్దార్థోభయ ప్రధాన కావ్యాలను అనువదిస్తూ మూలభావాన్ని స్వతంత్రశైలిలో ఆవిష్కరించటంతోపాటు పదబంధాలనూ, సమాసాలనూ, ప్రౌఢోక్తులనూ యథావకాశంగా అనువాదంలో పొందుపరచుకొన్నారు. మొదటిది స్వతంత్రశైలిగల అనువాదం; రెండవది పాక్షికస్వాతంత్ర్యంగల అనువాదం. పాక్షికస్వతంత్ర శైలిలో అనువాదకుని మూలశబ్దానుకరణప్రీతికి సంస్కృత ప్రౌఢోక్తి రామణీయకత్వాన్ని పరిరక్షించాలన్న ఆసక్తియే కారణం. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు రవీంద్రుల

14. నైవేద్యము- అనువాదము – డా॥ బెజవాడ గోపాలరెడ్డి.

శబ్దమాధుర్యాన్ని తెలుగువారికి పరిచయం చేయాలన్న దృఢసంకల్పం కల వారు. అందులోనూ మూలంలోని శబ్దాలూ, వాటి సంవిధానం, దానివల్ల ఏర్పడే భావచిత్రాలూ తెలుగులోనికి వస్తే వంగభాషా సరస్వతీ వైఖరీవిన్యాసం తెలుగులో వెలుగులు చిమ్ముతుందని భావించారు. కొందరికి ఈ ప్రయోగం విడ్డూరంగా కనపడవచ్చు. తెలుగు పలుకుబళ్ళ తీయందనాలకూ, ప్రసిద్ధ సంస్కృత సమాస చర్వణకూ మరిగిన నాల్కలకు ఈ పదబంధాలు వింత రుచులను కల్పించవచ్చు. కాని, అవి అందించే నవ్యభావ చిత్రాలు భావుకుల చిత్తాలకు ఊహాపరీవాహాలను పంచిపెడుతున్నాయి. 'ఉచ్ఛ్వసితఫణలక్షశత ములు', 'సముద్రకల్లోల సంగీతములు', 'సింధుమధ్య తరంగదళము', 'వ్యాకుల కరవేణువు', 'భావోచ్ఛ్వాసములు', 'నవతృణదళములు', 'మేఘరాగి ణుల సజలనయనములు','నదీజపమాలలు','దుఃఖపు రక్తశిఖలు', 'మహామానవ సాగరతీరము', 'ఘోరవ్యవధానము', 'అసమ్మాన భారము', 'అఖ్యాతదివసము', 'తంద్రాతుర సంధ్యాకాలములు', 'గైరికపతాకము', 'ప్రాణోత్సర్గలు', 'సుఖ కోణము', 'ప్రదీప్త వాంఛాధారలు', 'హృదయ వృంతశయనము', 'ఉచ్చహాస అగ్నిరసము', 'అశ్రుశిశిరస్నానము', 'ఉన్మాదపవనము', 'కంపిత కుంఠిత అగణ్యచుంబన ఇతిహాసములు', 'మనోరథమురళి', 'రక్తరౌద్రము', 'వీణా ఝుంకారములు', 'ఆశోల్లాసములు', 'పాషాణ పంజరములు', 'భైరవహర్షము', 'అచల అలస ఆవేశములు', 'చంచల పులకరాశి', 'మహామరణపారము'- ఇలా ఎన్నో ! కుప్పలు, తెప్పలు. వంగజిహ్వకు ఈ సమాసరచన జాత్యన్నసమము; ఆంధ్రజిహ్వకది అభ్యాసవశము. రెడ్డిగారి శైలి బెంగాలీదుస్తుల నలంకరించు కొన్న తెలుగుపిల్ల. ఆహార్యం వేరైనా, అభినయం వేరైనా, అభినవమైన ఆమె రూపురేఖ తెలుగు పడుచుదే. గోపాలరెడ్డిగారు అనువాదంలో గురుదేవులకు తమ వాక్కును అంకితం చేశారు; ప్రక్రియలో ఆత్మప్రత్యయాన్ని ఆవిష్కరించు కొన్నారు. ఇది మూడో విశేషం ! అందువల్ల తెలుగులో వెలసిన రవీంద్ర సాహిత్యంలో రెడ్డిగారి వాక్పాకం ఒక ప్రత్యేక ఫణితిలో ప్రసరిస్తుంది; ప్రత్యేక ప్రతిపత్తిని పరిరక్షించుకొంటుంది !

తెలుగులో తనదైన ఒకనిష్ఠ, ఒకలక్ష్యం, ఒకశైలి, ఒకప్రస్థానం అను వాదంలో కూడా అచంచలంగా నిలుపుకొన్న సాహితీ తపస్వి డా॥ బెజవాడ గోపాలరెడ్డి. ఊర్వశి విరక్త తపస్సులను భగ్నం చేసింది కాని, కళాతపస్సును

మన్నించి కొంగుబంగారంలా నిలిచింది. ఆ తేజస్వినిని ఆంధ్రభూమికి అంకితం చేసిన మనస్వి డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు.

ఈ కృతి ముట్నూరి వారికి, కట్టమంచివారికి అంకితం కావటం ముదావహం. ఒకరు సాహిత్యతత్త్వవేత్త; మరొకరు కవిత్వతత్త్వప్రవక్త! కళాతత్త్వ రేఖా మాధుర్యం ఊర్వశి; అంకితం ఆ తత్త్వ మెరిగిన కళా హృదయాలకు. ఇచ్చిపుచ్చుకోవటాల్లో ఎంతో ఔచిత్యం కుదిరింది!

ఇక నే నీ సంపుటికి పీఠిక వ్రాయటం సాహసం! యువతరాన్ని వెన్నుదట్టి ప్రోత్సహించే గోపాలరెడ్డిగారి వాత్సల్యమే దానికి కారణం! వారి స్నిగ్ధరోచికి నా కృతజ్ఞతలు. ఇది శక్తి ఉండి చేసినపని కాదు; భక్తితో రవీంద్రుని ఊర్వశికి అందించిన లాస్యకింకిణి :

"When thou commandest me to sing it seems that my heart would break with pride; and I look to thy face, and tears come to my eyes."[15]



15. Gitanjali - 2వ గీతం.

# భావసౌరభం*

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితో౽పి జన్తుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని.'

ఒక మహాకవి మధురవాక్కు మరో మహాకవికి కాలాంతరంలో పర్యుత్సుకతను కలిగింపవచ్చు. అది మధురమైన సృజనాత్మక మనోద్రుతిగా పరిణమిస్తుంది. కాలపురుషుడు జీవనభిత్తికమీద రాగసిక్త ధాతువుతో గీచిన సజీవ చిత్రాలు కవిజీవితాలు. కాలగర్భాన్ని చీల్చుకొని పుట్టి కలకాలం కవితలో బ్రతికే క్రాంతదర్శులు కవులు. అనుభవాలను అమృతంలో ముంచి అనాదినుండి అనంతందాకా ఆవరించే ఆసక్తిని అలంకృతంచేసి అందించే భావచైతన్య స్రవంతులు కావ్యాలు. జన్మాంతర సౌహృదంతో జీవించే కవితాత్మలు సంవదించుకొనే పూర్వాపూర్వస్మృతులు కవితాకృతులు.

'నేను జన్మించియుండిన - కాళిదాసు కాలమున
అదృష్టమున అయియుందును -
దశమరత్నమును నవరత్నమాలయందు'

అన్నారు రవీంద్రులు. ఇది జన్మాంతర సౌహృదమూలమైన రసస్పందన.

మూడుపదులు నిండనినాడే రవీంద్రులు కాళిదాసు కవితకు ముగ్ధులైనారు. ఆయన కవిత ఈయన హృదంతర కవితాచైతన్య తటిత్తుకు తొలకరి మేఘమై తొంగలించింది. తనకూ మెరిసే గుణమున్నది. ఆత్మప్రత్యయం అనర్ఘరత్నంలా కాలం వెలకట్టలేనిది. భోజవిక్రమార్కుని ఆస్థానంలో ఉండి ఉంటే దశమరత్నంగా నిలువగలననే నిబ్బరం ఆ వయస్సులోనే రవీంద్రునివాక్కులో ధ్వనించింది.

---

* డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి 'కాళిదాసు' కావ్యానికి పీఠికగా ప్రచురితం.

ఈ ఉక్తిలో ఒక ఊహాచిత్ర మున్నది. భావాంబరంలో ఎగసి భూత భవిష్యత్తులను కూడా పునర్విమర్శనం చేసే ప్రతిభాస్ఫూర్తి అందులో భాసిస్తున్నది. ఊహకున్న ఈ శక్తి ఊర్జితమైన అభివ్యక్తి. 'Images, however beautiful donot themselves characterise the poet· They become proofs of original genius only as far as they are modified by a predominant passion, or by associated thoughts or images awakened by that passion' అని కాలెరిడ్జి నిర్దేశిస్తాడు. అందువల్ల కాళిదాస రూపచిత్రాలమీద అభినివేశంతో రవీంద్రులు ఈ ఊహాచిత్రాలను నిర్మించటంతో అవి ఆకవి ఆత్మాభివ్యక్తి దర్పణా లౌతున్నవి.

గతంలో ఉన్న కాళిదాసుకంటె వర్తమానంలో ఉన్న కవీంద్రుడే అదృష్టవంతు డంటారు రవీంద్రులు. దానికి కారణం - 'కాళిదాసు పేరుననే ఉన్నాడు- నేను జీవించియున్నాను' అని పేర్కొంటారు. అంతేకాదు— 'అతని కాలపు స్వాదగంధములు - నేను పొందుదు కొద్దో గొప్పో- నా కాలపు ఒక కణమునైనా పొందలేడా మహాకవి' అని తన వ్యవస్థను సమర్థించుకొంటారు. గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్' అన్నసూక్తి వ్యతిరిక్తమై రవీంద్రుల వాక్కులో నవ్యాలోకాన్ని ప్రసాదిస్తున్నది. వర్తమానం ఆధునిక కవికి గతం కంటె సాధించిన అభినవదర్శనం. అదే అతని అభివ్యక్తికి అహంకారదర్పణం!

'జడలు ఊపుచు వెడలువారు - ఈ ఆధునిక వినోదినులు
మహాకవి కల్పనలో - లేవు వారి చిత్తరువులు
ప్రియా ! నీ తారుణ్య నయనముల ప్రసాదముల కాంక్షించుచు
కాళిదాసుని ఓడించి - గర్వమున తిరిగెద గంతులిడుచు.'

అని రవీంద్రులు కాలాంతరంలో కాళిదాస విజయాన్ని స్మరిస్తారు. నవరత్న మాలలో దశమరత్నం ఉండదు. ఉంటే ఏ మూల ఉన్నా నాయకరత్నమౌతుం దంటారు రవీంద్రులు. ఆత్మాభివాదం కూడా యోగ్యత కుచితాలంకార మన టానికి కవీంద్రుని వాక్కు చక్కని దృష్టాంతం !

సంస్కృత సాహిత్యంలో కాళిదాసుకు కవికులగురుస్థాన మున్నది. గీర్వాణభారతికి వేదాలు సత్యభాషణాలను నేర్పాయి. పురాణేతిహాసాలు అర్థవాదాల నలవరించాయి, రామాయణం రసవాక్కు నిచ్చింది, కాళిదాసు కవిత వైదర్భీరీతిలో యౌవనవిలాసాన్ని కల్పించింది. రవీంద్రుని యువహృదయాన్ని ఆకర్షించిం దాగుణం. దాన్ని మనోమయకోశంలో మథనం చేసి మధుర ప్రశంసలు చేశారు; దశగుణాదర్శంలా పదికవితలను రంవీంద్రు లావిష్కరించారు. ఒక కులపతి కవికులపతికి ఉపాయనంగా సమర్పించిన దశరత్నహారం ఈ కవితాసంపుటి.

ఈ సంపుటిలోని పదిగీతాలూ దాదాపు పది సంవత్సరాలకాలంమీద (1890 నుండి 1899 వరకూ) పరచుకొని సాగినవి. కాలక్రమాన్ని అనుసరించి ఈ గేయాలను చదివితే కాళిదాసకావ్యా లీకవిపై వేసిన ప్రభావాన్ని గమనించటానికి వీలౌతుంది. ఆ మహాకవి నాటకాలను రవీంద్రులు సమీక్షించిన జాడలు ఇందులో లేవు. కాళిదాస కావ్యదర్శనమే ఇందులో ప్రదర్శింపబడింది.

నిండు యౌవనంలో ఉన్న రవికవికి 'మేఘదూత' మొదట మనసు నాకర్షించటంలో ఆశ్చర్యం లేదు. అందులో జాలువారిన ఆత్మాశ్రయ కవిత రవీంద్రుల కంతఃస్పర్శనందించింది. మందాక్రాంతలో వినవచ్చే విరహచేతనంలోని మంద్రసంగీతం ఆయన చిత్తద్రుతిని రాగరంజితం చేసింది. విరహిణీ విప్రలంభ ఆహార్యవిశేషం, ఆషాఢ మేఘావతార లీలాప్రభావం జనగణ మనో మందిరాలలో వెలిగించిన ప్రణయ దీపాల తోరణాలను దర్శింపజేశాయి.

> 'ఎంతో కాలముగ ఎందరు విరహజనులు-ప్రియా విరహిత గృహముల
> వృష్టిక్లాంత, బహుదీర్ఘ, లుప్తతారాశశి
> ఆషాఢ సంధ్యలందు, క్షీణదీపాలోకనమున కూర్చుండి
> ఆ ఛందమును మంద మందముగా ఒనర్చి ఉచ్చారణ
> నిమగ్నము కావించిరి నిజవిజనవేదనను'

అని మందాక్రాంత మాధురీ చిరస్రవంతిని సమాశ్లేషించారు రవీంద్రులు. ఒక నాటి వర్షనిశీథిలో రవికవి మేఘదూతను చదువ నారంభించారు. మనస్సు

మేఘంలా లేచింది. ఆమ్రకూట వింధ్యాది నగాల అంచులపై వప్రక్రీడ చేసింది రేవా వేత్రావతీ నదుల్లో తలమున్కలు వేసింది: దశార్ణగ్రామ చతుష్పథంలో మొగలిపూల వాసనలు మైపూతగా నిలిపింది; ఉజ్జయినీ నగరంలో శిప్రానదీ శీకరాలతో చెమ్మగిల్లిన తమోభిసారికల కపోలాలను స్పృశించింది; జహ్నుకన్యయౌవన చాంచల్యంలో గిరిజను పరిహసించే నురుగుల నవ్వులను చంద్రకళా వీచికల్లో చూచి మందహాసాలు చేసింది; సర్వఋతుసామ్రాజ్యమైన అలకానగరంలో, అమూలసౌధంలో ముక్తవాతాయనంలో క్షీణశశిలా వెలుగొందే యక్షపత్ని విరహార్త మూర్తిని చూచి విహ్వలయైపోయింది. కల చెదిరిపోయింది; కారుచీకట్లో వానకాళ్ళ చప్పుళ్ళు వర్తమానాన్ని స్మృతికి తెచ్చాయి. శప్తుడైన యక్షుడు వర్తమాన మానవుడుగా స్ఫురించాడు.

'ఎవ రొసగిరి ఇట్టి శాపముల - ఈ వ్యవధాన మేల ?
రుద్ధమనోరథములు ఏల ఊర్ధ్వమును కాంచి - క్రందించుచున్నవి
తమ తమ ప్రేమములు ఏల ఒక మార్గమును - పొందజాలకున్నవి ?,

ప్రణయ మార్గాన్ని మేఘదూత మార్గంగా దర్శింపలేని ఆధునిక మానవాంతఃకరణం ఆర్తితో తలయెత్తి చూస్తే రవీంద్రుల 'మేఘదూత' అమరసందేశంతో తన మంద్రగర్జను మల్హారరాగంలో వినిపిస్తుంది.

'ఆరు ఋతువులు చామరచ్ఛత్రముల పారవైచి సభాభంగ మొనర్చి హఠాత్తుగ దింపివేసిన రంగయవనిక'-అని యక్షశాపాన్ని రూపించిన రవీంద్రుల ప్రతిభ ప్రభాపూర్ణం. విశ్వసభామధ్యంలో విరహవిపంచిక మ్రోసిన కరుణామయగీతం 'మేఘదూత'. దీని తత్త్వరూపం గీతాంజలిలో ప్రభవించింది.

"It is the pang of separation that spreads throughout the world and gives birth to shapes innumerable in the infinite sky. It is this sorrow of separation that gazes in silence all night from star to star and becomes lyric among rustling leaves in rainy darkness of July.

It is this overspreading pain that deepens into loves and desires, into sufferings and joys in human homes ; and this it is that ever melts and flows in songs through my poet's heart." (84వ గీతం)

మేఘదూతలో ఉజ్జయినీఘట్టం కాళిదాస మనోవిశ్రాంతి కేంద్రం. కాళిదాసు ఆత్మీయతను తనపై ఆరోపించుకొన్న హృదయసంవాదస్థితిలో రవీంద్రుని మనోనేత్రం తన్మయముద్రా నిద్రను పొంది కన్నస్వప్నం ఒక మధుర స్మృతిరూపకావ్యంగా జాలువారింది. ఆ స్వప్నంలో ఆయన శిప్రానదీ తీరంలో పూర్వజన్మ ప్రథమప్రేయసి నన్వేషిస్తాడు. మహాకాళ దేవాలయ ఘంటానినాదం ఉపశ్రుతిగా వినిపిస్తుంటే - కాళిదాసకృతాలంకారాలను ధరించి మాళవిక దీపశిఖతో దిగివస్తుంది ; మధురపరిష్వంగాన్ని ప్రసాదిస్తుంది. భాషను మరచి పోయిన మనసులు తలపులతో పలకరించుకొన్నాయి. ఉజ్జయిని అంతా ఏకాకారమైనట్లు స్ఫురించింది. కల కరిగిపోయింది; దీప మారి పోయింది ; మహాకాళ దేవాలయంలో నీరాజనఘంటానినాదం నిశ్శబ్దంలో లీనమైపోయింది. ఉత్తమకవిత ఉద్విగ్న స్వప్నాల నందిస్తుంది; 'స్వప్నము' కాళిదాస భావచిత్రాలకు అందించిన ప్రశంసాపత్రం.

మేఘయవనిక వెనుక విరహవిపంచి మ్రోయించిన కాళిదాసు ఋతు సంహారంలో ప్రేయసీసహితుడై ఆత్మదర్శనాన్ని ప్రసాదిస్తాడు రవీంద్రులకు. యౌవన యువరాజ్య సింహాసనం మీద కూర్చున్న కవీంద్రునికి ఆరు ఋతు వులూ వలయవర్తనంతో నృత్యనీరాజనాల నిస్తున్నట్లు, నవనవ వర్ణశోభితాలైన మదిరాధారల నందిస్తున్నట్లూ, త్రిభువనాంతఃపుర శోభనగృహంలో దర్శిస్తారు రవీంద్రులు. పురుషుడు ప్రకృతి సౌందర్యోపరాగాన్ని కాలావచ్ఛిన్నంగా విశ్వ మనోమందిరాలలో సుఖదుఃఖాతీతంగా సమాశ్లేషించే ముగ్ధపైదగ్ధ్యాన్ని ఋతు సంహారంలో సమీక్షించారు రవీంద్రులు.

కాళిదాసు కుమారసంభవకావ్యం రవీంద్రులను ఎంతో ప్రభావితంచేసింది. మేఘదూతలో స్త్రీ పుంసప్రవృత్తులు విప్రలంభయోగా న్ననుసరించి పునస్సమాగ

మాన్ని పొందాలని యత్నిస్తే, కుమారసంభవ కావ్యంలో తపస్సు నాశ్రయించి పాంచభౌతికస్పృహను పరిత్యజించి వాగర్థాలవంటి అద్వైతస్థితిని సాధించాలని యత్నించాయి. ఒకటి నిర్గుణాన్ని ఆలంబనంగా చేసికొని సగుణత్వాన్ని సాధించేది; మరొకటి గుణత్వాన్ని అధిగమించి నిర్గుణత్వాన్ని సాధించేది. రెండవ మార్గంలో పార్వతీ పరమేశ్వరుల గాథ పరమోదారంగా ప్రస్తరింపబడింది.

కాళిదాసు ఈశ్వరార్చన కళాశీలియైన అద్వైతి. ఆయన పరమేశ్వరాభిమానం అష్టమూర్తి భావనంగా అంతరంగ ప్రవృత్తిలో వ్యాపించి ప్రతి కావ్యంలోనూ పూలల్లో దారంలాగా అంతర్నిబిడమై ప్రసరించింది. రవీంద్రుని భావనలో కాళిదాసు కైలాసనాథుని ఆస్థానకవి. ఆత్మరూపంతో అక్కడ ఉన్నా కీర్తికాయంతో విశ్వమానవ మానసధామంలో చిరంజీవిగా నివసిస్తున్నాడని వివేచించారు రవీంద్రులు. 'ఉండిపోతివి మా మానసలోకమున నీవు చిరకవివై' అని కవికులగురువుశాశ్వతకీర్తిని శ్లాఘిస్తారు 'మానసలోకము'లో.

కాళిదాసు భౌతికంగా జీవించినప్పుడు లోకవృత్తంలో కానవచ్చే విక్షేప విషాదవలయాలు ఆయనను బాధింపలేదా ?- అని ప్రశ్నించుకొని విస్తుపోయాడు విశ్వకవి. ఎన్నికష్టాలపంకాలలో మునిగి ఇన్ని కావ్యకమలాలను సృజించాడో - అని కన్నుల నార్ద్రపరచుకొన్నాడు.

'జీవన మథన విషము నీవే చేసి పానము
పుట్టి పొంగిన అమృతము చేసి పోయితివి దానము'

అని ప్రశంసిస్తున్నప్పుడు కాళిదాసును గరళకంఠునిగా దీపింపచేసే ఊహాచిత్రం రూపు కట్టుతుంది.

కుమార సంభవంలో 8 సర్గలే కాళిదాసు వ్రాశాడనీ, మిగిలిన తొమ్మిది సర్గలూ మరెవరో పూరించి ఉంటారనీ ఒకవాదం ఉంది. దీనికి ఉపబలకంగా ఒక కథాకల్పనం చేశారు రవీంద్రులు. కాళిదాసు కైలాసవాసాన్ని, సాక్షాత్ పార్వతీ పరమేశ్వరులనూ అంతస్సన్నిధానం చేసికొని కావ్యరచనాన్ని సాగించాడనీ, ఎనిమిది సర్గల కావ్యగానం క్రమంగా సాగిందనీ, ఆ చివర జగత్పితరుల శృంగార విలాస క్రీడలను వర్ణించే తరుణంలో పార్వతి వ్రీడాకులయై

విముఖ అయిందనీ, కాళిదా సా ఘట్టంలో కావ్యరచన ఆపి, కుమారోత్పత్తిని వ్యంగార్థ సూచనగా వదిలాడనీ సమర్థించారు. కైలాస ప్రకృతిలో నిలిచిన కావ్య శ్రవణ వ్యగ్రతను సమగ్రంగా చిత్రించటమే కాకుండా, పార్వతి చిత్తావస్థలను క్రమంగా అనుశీలించటం ఇందులోని శిల్పవిశేషం. ఆమెలో పరమేశ్వర ప్రణయ బీజం అంకురించినప్పుడు మొలకనవ్వు నవ్విందనీ, తపశ్చర్యను సాగించిన ఘట్టంలో నిట్టూర్పులు నిగుడించిందనీ, మన్మథదాహఘట్టంలో కన్నీటికి కడవకట్టిందనీ, పరమేశ్వర ప్రణయసిద్ధిని విన్నప్పుడు సిగ్గుల నొలక పోసిందనీ, సమాగమఘట్టాలలో రతి వాచ్యమౌతున్నందున వ్యాకుల పడిందనీ రవీంద్రులు చమత్కరించారు. ఈ కవిత చిన్నదైనా కర్పూరఖండంలా వెలుగొందుతున్నది.

కుమార సంభవకావ్యంలో కామదహన ఘట్టం కరుణరసభరితం. అంగజుడు అనంగుడైన ఆ ఘట్టం రవీంద్రుని చిత్తంలో విచికిత్సను రేకెత్తించింది. సాకార నిరాకార మన్మథ ప్రభావాలను భావనాబలంతో విశ్లేషించి రెండు గీతాలను రవీంద్రులు నిర్మించారు. సాకార మన్మథుని భువనవిజయ విలాసాన్ని అవస్థాభంగిమల్లో చిత్రించి, మానవమనోమందిరాలకు దేవస్పర్శ కల్పించి ఉద్దీప్తం చేయటానికి అతన్ని ఆహ్వానిస్తాడు కవి !

'రమ్ము హఠాత్తుగ, తటిత్ సమముగ
నవ్వుచు చతురముగ మధురముగ
చకిత మొనర్పుము వధువుల హర్షమున
నవీన మొనర్పుము మానవ గృహముల
వివశ మొనర్పుము ధరణిని
దేవపాదసరసస్పర్శచే—'

అన్న పిలుపులో-వధూవరుల నాశ్రయించి చిగురించే నవ్య కామాంకురం అవిచ్ఛిన్నంగా కొనసాగి ఫలోన్ముఖం కావాలన్న విశ్వశ్రేయఃకామన వినిపిస్తుంది.

'పంచశరుని దగ్ధ మొనర్చి ఏమి చేసితివి సన్యాసీ !
విశ్వమయము కావించితి వతనిని వెదజల్లి,'

అని మొదలై ఆవేచరణాలతో ముగిసే రెంకవగేయం విశ్వకవి రచనల్లో విశేష ఖ్యాతిగాంచింది. పంచశరుడు భౌతికరూపం చాలించి భావజరూపం తాల్చిన స్థితికి భస్మరూపం ప్రతీక. స్వాయత్తం చేసికొన్న మన్మథశక్తి మానవ మనశ్శక్తిగా మారినందుకు వ్యక్తిగా రతి విలపిస్తుంది. విశ్వహృదయ వీణా తంత్రులు సాంత్వన గీతాలు పాడి ఆమెను ఓదారుస్తాయి. ఆపై, కోరిక వెంట రతి నడిచింది-పూవువెంట తావి సాగినట్లు. ముక్కంటి కంటిమంట ముజ్జగాలకు పంచింది కామునిపంట! సన్యాసి రక్తిని బూదిచేసి విరక్తిని లోకంలో వెలయించాలని చూస్తాడు; సృష్టి రాగాన్ని రక్షించుకోవాలని యత్నిస్తుంది; కుమారోదయం సృష్టిఫలానికి బీజం. బీజాన్ని చంపే బీభత్సంలోనుండి పుట్టిన నవచైతన్యం మన్మథ ధూళి ప్రసారం! లోకాని కంకితమైన పతి ననుసరించింది రతిచైతన్యం. ఈ భావాన్ని మార్మికతాగర్భమైన అధిక్షేపస్ఫూర్తితో పరమేశ్వరార్పితం చేయటం రవీంద్రుని రచనాశిల్పం !

ఈ సంపుటిలో "ఆకాలము" మొదటిగీతమైనా రచనాకాలాన్ని బట్టి చివరిగీతం. మరోమాటలో చెప్పాలంటే - పఠితలు మొదటా చివరాకూడా చదువుకొనతగినగీతం. 12 తరంగాలలో సాగిన ఈ గీతం కాళిదాసు మేఘదూత ఋతుసంహారాల్లో చిత్రింపబడిన పుష్పపురంధ్రీ విలాసాలను సింహావలోకనం చేసేది. క్రీడాశైలాలలో, లతామంటపాలలో, నదీతీరాలలో - పూలబాసలాడుకుంటూ, దోహదక్రీడలు సలుపుకుంటూ, ప్రణయగీతాలు పాడుకుంటూ అందెల తాళాలు వేసుకుంటూ, కుందశిరీషాలను కూర్చుకుంటూ కుంకుమ పత్రాలను చిత్రించుకుంటూ మసలే మందాలికలు, మంజులికలు, మంజరికలు చలనచిత్ర పాత్రల్లా ఈ గేయంలో కవిమనోయవనికమీద లాస్యం చేస్తారు. గతానికి వర్తమానానికి తారతమ్యం వచ్చేసరికి-నేడు వేషాలు మారినా, భాషలుమారినా, అన్యదేశ్యఫణితుల్లో కూడా నిపుణికలూ చతురికలూ క్రీగంటి చూపులతో కాలశక్తికీ, కాంతాభివ్యక్తికీ ప్రాణాలు పోస్తూనే ఉన్నట్లు ఉల్లేఖించారు రవీంద్రులు. ప్రకృతి కాలశాసనంలో వికృతిని చెందినా అందులోని అందంమాత్రం అంతరించిపోదు. ఆ అందమే కవిదర్శనంలో అజరామరమై నిలిచే అభివ్యక్తి. అదే ఈ 'కాళిదాసు' కావ్య మిచ్చే కళామయ సందేశం !

డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారికి కాళిదాసుమీద ఎంత రక్తియో, రవీంద్రులమీద అంతభక్తి. కాళిదసు కవితలో కదలాడే కావ్యకన్యలు కళా

జీవిత వనజ్యోత్స్నలు. ఆ లతలను తెచ్చి బెంగాలీతోటలో నాటి దోహదక్రియలు చేశారు రవీంద్రులు. వాటి పూలను వాసన చెడకుండా తెచ్చి తెలుగుదారంతో ముడిపెట్టి కౌతుకమాలను కూర్చారు డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు.

కాళిదాస కవితాసుమ వైభవానికి ఈ కృతి భావసౌరభం !

"Thou hast taken me as thy partner of all this wealth. In my heart is the endless play of thy delight. In my life thy will is ever taking shape.

And for this, thou who art the King of kings hast decked thyself in beauty to captivate my heart. And for this thy love loses itself in the love of thy lover, and there art thou seen in the perfect union of two·" (56వ గీతం)

ఈ గీతాంజలి యే నా కృతజ్ఞతాంజలి.



# విశ్వనాథ - కల్పవృక్షం

"అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదాభోగ మస్మాదృశుం
దలఘుస్వాదురసావతార ధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుఁ డయినాఁ డన్నట్టి దా వ్యోమపే
శలచాంద్రీమృదుకీర్తి చెళ్ళపిళవంశస్వామి కున్నట్లుగన్"

తండ్రికి పేరు తెచ్చే కొడుకు కలగటం ఎంత విశేషమో గురువుకు కీర్తి తెచ్చే శిష్యుడు లభించటం అంత అదృష్టం. గురువుకు గౌరవాన్ని తెచ్చే శిష్యుడు లఘువుగా ఉండటానికి వీల్లేదు. లఘువైన శిష్యుడివల్ల గురువుకు కలిగే గౌరవంకూడా లేదు. తిరుపతివేంకటకవులు కవికుల గురువులు. ఆ కవికులంలో వారి గురుపీఠం చలనంలేనిదే అయితే ఆ కవికులంలో గురుకులాన్ని నిలుప గలిగిన శిష్యునివలన వారి గౌరవం ద్విగుణీకృత మౌతుంది. విశ్వనాథ సత్య నారాయణగారు వేంకటశాస్త్రిగారి సంప్రదాయాన్ని సమున్నతంగా పోషించిన విద్వత్కవి. ఆయన సమకాలీనకవికులంలో సమ్రాట్టు. సమ్రాట్టుకు సామర్థ్యంతో పాటు స్వాభిమానం ఉంటుంది; ధీశక్తితోపాటు ధిషణాహంకార ముంటుంది. అది అంతస్సారం లేని ఆడంబరం కాదు; ఆత్మజ్ఞానంతో కూడిన అభిమానం.

విశ్వనాథవారి పేరు స్మరించగానే వెంటనే స్మరణకు వచ్చేది పైపద్యం. అందులో ఆయన గురుభక్తికంటే ఆత్మప్రత్యయం అధికంగా కనపడుతుందని కొందరు విమర్శకు లంటారు. అయినా, ఆపద్యాని కలంకారమంతా అందులోనే ఉందని అందరూ అంగీకరిస్తారు. విమర్శకులకు కూడా వ్యామోహాన్ని కల్పించే విచిత్రమైన శక్తి విశ్వనాథవారిఉక్తిలో ఉంది. నన్నయ్యకు శిష్యు లెవరున్నారో మనకు తెలియదు. తిక్కన్నకు మారన్న ఉన్నాడు. ఆయనవల్ల తిక్కన్నకు గౌరవం వచ్చిందంటే అందరూ అంగీకరింపరు గాని గురువుకు తగ్గశిష్యుడని మాత్రం ఆయన్ను ఆదరిస్తారు. మరి ఆ అంశంలో వేంకటశాస్త్రిగారు అదృష్ట వంతులే. అది అందరూ ఒప్పుకొనే సత్యం.

అయితే విశ్వనాథవారు తననుగురించి అంతవిశేషణాన్ని వేసుకోవటం లోని ఔచిత్యాన్నిగురించి వాదోపవాదా లున్నాయి. ఔచిత్యం ప్రతిపాద్య విషయాన్ని ప్రతిపాదించే విధంలో ఉంటుంది. ఒకవాక్యంలో ప్రధానాంశం (Principal clause) కొద్దిమాటల్లో ఉండి ఉపాంగం (Subordinate clause) దీర్ఘంగా ఉందనుకోండి, ఉపాంగం ఎప్పుడూ ప్రధానాంగానికి గౌణమే. అయినా అది ప్రధానాంశప్రశస్తికి పతాకగా నిలుస్తుంది. ఇది లోకవ్యవహారంలో ఉన్నదే. రాము డల్పుడైతే గురువైన వసిష్ఠునికిగాని, విశ్వామిత్రునికిగాని ఏమి గౌరవం? రావణు డల్పుడైతే తద్విజేత అయిన రామునికేమి గౌరవం? తిక్కనగారు వ్రాసిన నిర్వచనోత్తర రామాయణంలో విస్తృతంగా వర్ణింపబడ్డ రావణపరాక్రమం చివరకు రామార్పితం కావటంలేదా? ధ్వనిమార్గంలో అది ఒకసూక్ష్మరహస్యం. పైపద్యం అవ్యంగ్యగౌరవంతో సాహిత్యగౌరవాన్ని సంపాదించుకొన్నది. 'అలఘుస్వాదురసావతారధిషణాహంకారసంభారదోహల బ్రాహ్మీమయమూర్తి' శిష్యుఁ డయినాఁ డనడం లోనే వేంకటశాస్త్రిగారిగురుమూర్తి హిమవన్నగశృంగంలా నిలిచి ధవళకీర్తిచంద్రికలను ప్రసరింపగలిగింది.

అంతసమాసం అహంకారానికి చిహ్న మంటారా? అధికారికి అహంకారం అలంకారమే. నిజం చెప్పితే నిష్ఠురం అంటే చెప్పలేం కాని - తెలుగువారికి వేంకటేశ్వరుఁ డెంత మహనీయుడో విశ్వనాథు డంత మహితాత్ముఁడు. ఈ అద్వైతసిద్ధి ఉన్న బుద్ధిమంతులకు ఈపద్యంలోని రససిద్ధి కౌచిత్యవిచారచర్చ అడ్డం రాదు.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు శ్శిష్యులపై అమృతవర్షాన్ని కురిపించేవారు; శత్రుపర్వతాలపై పిడుగులపిండు పరిపించేవారు. వారి వ్యక్తిత్వాన్ని సూక్తి మరందంతో వ్యాఖ్యానించారు విశ్వనాథ సత్యనారాయణగారు.

"తన యెద యెల్ల మెత్తన కృతప్రతిపద్యము నంతకంటె మె
త్తన తనశిష్యులన్న నెదదం గల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రుపర్వతశతారము సత్కవి చెళ్లపిళ్ల వేం
కన గురు వంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగునాఁడునన్".

శాస్త్రిగారు శత్రువులపట్ల చూపించే పారుష్యానికి ఉపమానం ఉంది కాని, శిష్యుల పట్ల చూపించే వాత్సల్యానికి సాటి లేదు పైపద్యంలో. 'చెప్పలేని మెత్తన' అని

చెప్పి ఊరుకోవటం శిల్పం. భావుకునికి చెప్పలేనంత ఆలోచనామృతాన్ని అందించే తెలుగుపలుకుబడి. గురుకృపను కూలంకషంగా చవిచూచి, మనకు చవిచూపిన చతురుడు విశ్వనాథ.

"పుడమిని బెక్కు సత్కవులు పుట్టిరి ముట్టిరి సత్కవిత్వపుం
దొడిమలు; చెళ్లపిళ్లకవితోఁ దులతూగెడువారె ? వానలోఁ
దడియనివారు మద్గురువధానమృదూక్తిమరందధారలోఁ
గడుగనివారు మా కెచటఁ గానఁగరా రిలఁ దెల్గునాఁడునన్"

విశ్వనాథవారి గురుప్రశస్తికి పతాకవంటి దీ పద్యం. సత్కవు లెందరో కవిత లల్లినారు కాని, వా రాకవితాప్రసూనంలోని తొడిమను మాత్రమే తాకగల్గినారట! వేంకటశాస్త్రిగారు కవితామరందాన్ని సేవించి అవధానకవితామాధుర్యాన్ని వర్షించారట! వానలో తడియనివాడూ, వారిమరందధారలో మునుగనివాడూ తెలుగుదేశంలో లేడట. తెలుగునాడులో తిరుపతివేంకటకవుల అవధానకవిత్వం సమ్మోహనమంత్రంలా పనిచేసింది. వారిఅవధానాన్ని చూచిన ప్రతియువకుడూ ఆవేశంతో కలాన్నిపట్టాడు. జంటకవిత్వం చెప్పాలని ఉబలాటపడ్డాడు. విశ్వనాథవారూ ఆప్రభావానికి లోగినవారే. జంటకవిత్వాన్ని సాగించినవారే. కొడాలి ఆంజనేయులు వారి జంటకవి. ఆయనతో కలిసి చేసిన కవితావ్యవసాయం కలకాలం సాగకపోయినా కమనీయ స్మృతుల్నిమాత్రం విశ్వనాథకు మిగిల్చిపోయింది.

'తన మృదుజిహ్వపై రవలు దాల్చిన నూఁగునిగారపుం జిగుల్
చను కవితాసతిన్ విడచి సాధుమహాహవశీలుఁ డౌ మహా
త్ముని యసిలేనిసేనఁబడి పోయెడువానిఁ గొడాలి యాంజనే
యుని మును నాకు జంటకవియున్ బ్రియమిత్రము సంస్మరించుచున్"....
'అతఁడె తోడు కల్గినను నచ్చముగాఁ గలకండ లచ్చులుం
బోఁతలు పోసి యుండెదము పోతనగారి విధాన;'

నని కల్పవృక్షంలో కరుణార్ద్రంగా చెప్పుకున్నారు విశ్వనాథ. ఆయనకు మిత్రు డన్నా శిష్యు డన్నా 'ఎడదం గల ప్రేముడి చెప్పలేని మెత్తన.' విశ్వనాథ కవిగా ఎంత గొప్పవాఁడో మనసున్నమనిషిగా అంత మహోన్నతుఁడు.

# 2

ఆధునికాంధ్రసాహిత్యజగత్తులో విశ్వనాథ ఒకవిరాణ్మూర్తి. వచన కవిత్వాన్ని వినా ప్రాచీనాధునికాంధ్రప్రక్రియల్లో ఆయన చేపట్టని ప్రక్రియలేదు, పట్టింది బంగారం చేయని పట్టులేదు. గేయం వ్రాసినా పద్యం రచించినా; ముక్తకం వ్రాసినా మహాకావ్యాన్ని రచించినా విశ్వనాథకృతిలో ఆయనదైన ఒకవ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. వాక్కులో, వాక్యంలో, శబ్దంలో, సమాసంలో, భావంలో, భావనంలో, దర్శనంలో, విమర్శనంలో, భాషణంలో, భూషణంలో ఒక వైలక్షణ్యం వెల్లివిరుస్తుంది. మహాకవిగా మనుగడ సాగించటానికి ఉండవలసిన మొదటిలక్షణం ఈ వ్యక్తిత్వం.

'గోదావరీపావనోదారవాఃపూర
 మఖిలభారతము మా దన్ననాఁడు
తుంగభద్రాసముత్తుంగరావముతోడ
 కవులగానము శ్రుతిఁ గలయునాఁడు
పెన్నానదీసముత్పన్నకైరవదళ
 శ్రేణిలో తెన్గు వాసించునాఁడు
కృష్ణాతరంగనిర్ణిద్రగానముతోడ
 శిల్పమ్ము తొలిపూజ సేయునాఁడు

అక్షరజ్ఞాన మెఱుఁగదో యాంధ్రజాతి ?
విమలకృష్ణానదీ సైకతములయందు
కోకిలపుఁబాట పిచ్చుకగూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమానిశలయందు'.

విశ్వనాథవారిశైలి ఒడ్డులొరసి ప్రవహించే తెలుగుజీవనదిలాంటిది. గోదావరీ ప్రవాహగాంభీర్యాన్ని సంతరించుకొన్న వారివాక్పాకం శ్రీనాథకవిసార్వభౌముని కవితారీతివలె ప్రౌఢిమను పుక్కిలిస్తుంది. సామాన్యంగా విమర్శకులు సంస్కృత సమాసబంధురమైన రచనంలోనే ప్రౌఢిమ ఉంటుందని భావిస్తారు. అది సమంజసం కాదు. ప్రౌఢి కవియొక్క ఉక్తి నాశ్రయించి కావ్యజీవితాన్ని సారవంతం చేస్తుంది. కవిప్రౌఢోక్తి శబ్దాన్నీ అర్థాన్నీ ఆశ్రయించి ఉంటుంది. అది వస్తువునూ, అలంకారాన్నీ, రసాన్నీ వ్యంగ్యసుందరం చేస్తుంది. ధ్వనిమర్మజ్ఞులైన విశ్వనాథవారి ప్రౌఢోక్తి రసజగత్తును వ్యంజింపజేసి సార్థకమౌతుంది. ఆయన రసయోగి. సర్వశబ్దప్రపంచాన్నీ రసోన్ముఖంగా నడిపించటంలో అందెవేసినచేయి.

'కవి ప్రతిభలోన నుండును గావ్యగతశ
తాంశములయందుఁ దొంబదియైనపాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి'

అని ఆయనదృక్పథము. రసాభివ్యక్తిని కల్గించే శబ్దం అంతరమైన భావప్రపం చానికి బాహిరమైన ప్రతీక. చిత్తావస్థ కుచితంగా శబ్దరచనను తీర్చిదిద్దటం శిల్పం. అందులోనుండే సమాసాలూ, నుడికారాలూ, జాతీయాలూ, వాక్యవిన్యాసాలూ చిత్రవిచిత్రంగా లాస్యంచేస్తూ ముందుకు వస్తాయి. వానివిన్యాసంలో, ఆవిష్కరణంలో కవిప్రౌఢి కదనుత్రొక్కుతుంది. ఆప్రౌఢగతిలోనే విశ్వనాథ వ్యక్తిత్వం ప్రత్యక్షమౌతుంది.

పైసీసపద్యంలో ఆంధ్రప్రశస్తి వస్తువు. దానిని తెలుఁగునదుల నాలంబనంగాచేసి విశ్వనాథ వ్యక్తీకరించారు. నదీవైభవాన్ని అవిచ్ఛిన్నధారామధురంగా ఆవిష్కరించటం, కళావైభవాన్ని తెలుగుపలుకుల జిలుగుశిల్పంతో వ్యంజింపఁ జేయటం పద్యరచనలోని శిల్పం. శ్రీనాథు డన్నట్లు 'ప్రౌఢి పరికింప సంస్కృత భాష యండ్రు', 'పలుకునుడికారమున నాంధ్రభాష యండ్రు'. అయినా ఆయనది కర్ణాటభాష. ఆభాష యేమి టన్న ప్రశ్న అలా ఉంచితే—అది ఒకవిలక్షణమైన వాక్పాకం అన్నది సత్యం. అలాగే విశ్వనాథవారిదీ విలక్షణమైన కవితామార్గం. రసవ్యంజకత్వమే దాని లక్ష్యం. ఆంధ్రజాతివైభవ మంటే అణువణువునా పులకిస్తాడు విశ్వనాథ. ప్రాచీనాంధ్రపౌరుషమంతా తనరక్తనాడుల్లో ప్రవహిస్తున్నట్లు పరవశిస్తా డాయన.

'ఇమ్ముగఁ గాకుళమ్ము మొద లీవరకుం గల యాంధ్రపూర్వరా
జ్యమ్ముల పేరు చెప్పిన, హృదంతర మేలొ చలించిపోవు, నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవనిర్ణయ మేని ఎన్నిజ
న్మమ్ములు గాగ నీతనువునన్ బ్రవహించునొ యాంధ్రరక్తముల్'

'ఇది వినిపింతు నంచు మది నెంచెద మిత్రులకున్ గళస్థగా
ద్గదికము, లోచనాంతబహుధాస్రుతభాష్పనదమ్ము, స్పందనా
స్పదహృదయమ్ము, నాపనికిఁ జాలక చేసెదు, నన్ను నింతగా
నెద పదిలించుకొన్న దిది యెక్కడి పూర్వపుజన్మవాసనో!'

వేఁగీక్షేత్రాన్ని కీర్తించేసందర్భంలో వ్రాసిన పీపద్యాలు. వా స్తవజగత్తులోనుంచి వాసనామయమైన ఆంతరజగత్తులోకి ఆలోచనను అంతర్భవింపజేస్తున్న పీపద్యాలు. అంతశ్చేతనమే అక్షరాకృతి తాల్చటం ఈపద్యరచనాశిల్పం. అచ్చమైన అనుభూతికి మచ్చలేని మణిదర్పణా లీపద్యాలు, 'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్' అన్న కాళిదాసుశ్లోకంలోని రసదృష్టి ఈపద్యాల్లో కనిపిస్తుంది. అపూర్వభావనా బంధురమైన రచనతో ఆలోచనామృతాన్ని వర్షించటం కంటె సున్నితమైన హృదయస్పందనాన్ని కలిగించి తన్మయత్వం కల్గించటం కష్టం. రసార్ద్రచిత్తునికిగాని ఇట్టిరచన సాధ్యం కాదు.

తెలుగుదేశాన్నీ, ఋతువుల్నీ, నదుల్నీ, తెలుగుప్రకృతినీ తమిమీర వర్ణించారు విశ్వనాథ. జాతీయకవులలో జాతిరత్నం విశ్వనాథ.

'మాపూర్వాంధ్రధరాధినాయకకథామంజూషికారత్నగా
థాపద్యావళి పేరి హారిసుమనోదామంబు మాధ్వీకభా
షాపృక్తంబు మహాప్రబంధరచనాసౌందర్యపున్ వాసనల్
తీపై క్రమ్మఁగ నాంధ్రసోదరుల కందిత్తున్ గళాంకమ్ముగన్'

అని ఆంధ్రప్రశస్తిని ప్రబోధకవితాశాఖకు ప్రఫుల్లకుసుమపరాగంగా తీర్చిదిద్దారు. ఆంధ్రవిష్ణువు, శాతవాహనుఁడు, గోతమీపుత్రశాతకర్ణి, మాధవవర్మ, ప్రోలరాజు మొదలైన తెలుఁగుఱేడులు; వేంగీక్షేత్రము, ముఖలింగము మొదలైన తెలుఁగు నాడులు; నన్నయభట్టాదులైన ఆంధ్రకవులు; ఆంధ్రప్రశస్తిలో అమరగానానికి పాత్రులైనారు. కాళిదాసులా విశ్వనాథవారు ఋతుసంహారాన్ని రచించినా ఇందులో వర్ణింపబడ్డవి తెలుగుఋతువుల వింతసోయగాలు.

గ్రీష్మకాలంలో విజయవాడప్రాంతంలో ప్రతియేటా పూరిపాకలు పరశురామప్రీతి కావటం పరిపాటిగా వినవచ్చేవార్త. ఆ వాతావరణం ఈసీసపద్యంలో వెలుగునిస్తుంది.

'దణ్ణెమ్ముపైని వస్త్రముకొంగు జారి క్రిందను నంటుకొన్నది దాలిసెగకు;
దొడ్డిలోఁ బొయ్యార్పి, తొలఁగ నెక్కడొ రవ్వమిగిలి, పెన్గాలికి రగిలి యెగిరె
దూలమ్ము నకుఁ బ్రాట వ్రేలనైన పఱుపుగట్టునులక దివ్వె ముట్టుకొనియె
చిదుకులమంట బోసిన దృష్టి తీసి, మిర్మిలఁ బ్రేలి చూరెక్కె మిరపతొడిమ

పురము, పేట, పల్లె పరశురామప్రీతి కాదిహేతువులుగ నాడుకొనిరి
నిందలేకయుండఁ బొందె వో దన్నట్లు యమునివోని గ్రీష్మ నరయలేక'.

తెలుఁగుపల్లెల జీవనాన్నే కాదు తెలుగుపంటల వైభవాన్నికూడ విశ్వనాథ ఋతు ధర్మ విశేషాల్లో విశ్లేషించి వర్ణించారు. మచ్చుకు శరదృతువర్ణనంలోని ఒక పద్యం.

'పొద్దుటింతల వాయువులు తావికై మెల్లి కొలిమేరచేలపైఁ గొసరులాడె
చిఱుచేఁదు వలచెఁ గోసిన జొన్నచేనిలోఁ దాడిమదగ్గర పచ్చిదోసపండు
పండి కోయనిమిరపలు పెండ్లికూతుంఁడ వలె సకుంకుమశోభఁ గులుకులాడె
వడిసెలజా,తప్పనొడుపు నేర్పెను దల్లి చిన్నిపిట్టకు మొక్కజొన్నచేలఁ
జెలఁగెఁదలఁగిల్లిన పొగాకు సెనగతఁపటలును బంతిపూల్ మిరపతోటలకుమధ్యా
శరదృతు సమస్త బ్రహ్మదర్శనము చేసెఁ గూడి మెట్టపొలాల వికుంఠలక్ష్మి.'

హేమంత ర్తువులో మంచుబిందువులు ఉత్ప్రేక్షాలంకార భూషితాలై ఉజ్జ్వల తారకల్లా విశ్వనాథకవితలో వెలుగొంది నిలిచినాయి.

'తట్టలోఁ గూర్చుండఁ బెట్టిన వధువునా గుమ్మడిపూవులోఁ గులికె నొకటి;
ఖండితాపాంగసక్తనవాంబుకణమునా ఘాసాగ్రమునయందుఁ గదలె నొకటి;
తులసిముగ్గున సిడ్డ తొలుకారు దివ్వెనా సాలీనిపటముపై సాగె నొకటి
ఘూర్జరీముఖలంబికొసముత్తియంబునా నాఁదూడనొసటిపై నాడె నొకటి
మధువునాఁ బూవుఁబూవున మసలె నొకటి జగ్గునా నాకునాకున జాఱె నొకటి
మంచుబిందులు నవసుకుమారమూర్తి మంతములు ప్రాతరంత హేమంతవేళ.'

ఉపమానాల నెన్నుకోవటంలో విశ్వనాథవారి ఔచిత్యదృష్టితోపాటు, అపార లోకవ్యుత్పత్తి వ్యక్తమౌతున్నది. వ్యుత్పత్తి భిత్తివంటిది. ప్రతిభ చిత్రలేఖనం వంటిది. పరిపుష్టమైనభిత్తి లేనిదే చిత్రం కలకాలం నిలవదు.

ఋతువర్ణనాల్లో శరత్కాలమూర్తి సాక్షాత్కారం విశ్వనాథ భావుకత కబ్బిన శరచ్చంద్రికాధవళకీర్తి.

'ఱెక్కలు చాఁచి తీరికగాఁగ గాలిలోఁ దేలివోయెడు నంచవోలె వచ్చి
సితవస్త్రకృతగరుత్మతి నృత్తసమభంగ తురికీల నర్తకిసరణి వచ్చి
ఇరుదెసల్ కాంతిచే నొరయ సూర్యున కెదురౌ సితాంబుజలక్ష్మియట్లు వచ్చి
నిమ్నోన్నతములు లేని కులాంగనాచ్ఛ కూలంకషప్రేమకల్పముగ వచ్చి

చందిరుని వోలె నవనీరజాతబంధు కిరణసంస్పర్శచేత వెల్గించుకొంచు
దన తనూసృష్టిసర్వ మందముగ వచ్చె దల్లి కృష్ణాతటిని శరత్కాలమూర్తి.'

కాలచక్రం చేతనాచేతనమైన ప్రకృతిని ప్రభావితం చేసే ప్రవృత్తిని సూక్ష్మేక్షికతో పరిశీలించి ప్రపంచించేతత్త్వం ఋతుకీర్తనంలో కనపడుతుంది. ప్రకృతి పరిణామానికి మానవప్రకృతి ప్రతిస్పందించే ప్రక్రియను ప్రత్యంశ ప్రౌఢంగా చిత్రించిన ప్రాచీనుల్లో రాయలూ, ఆధునికుల్లో విశ్వనాథవారూ అగ్రగణ్యులు.

విశ్వనాథవారి గేయకావ్యాల్లో ప్రస్తిగాంచింది 'కిన్నెరసాని పాటలు.' భద్రాద్రిరాముని త్రోవను కాచి గోదావరీనదీమతల్లి యొడిలో నిలిచిన కిన్నెరసాని వాగు విశ్వనాథవారి కల్పనలో ఉద్విగ్నయైన తెలుగుపడుచులా రూపొందింది. అత్త పెట్టే ఆరళ్లకూ, కట్టుకున్నవాని మెత్తనితనానికీ మధ్య నలిగిపోయిన ఆపడుచుపిల్ల కంటికి కడవకట్టటమే కాకుండా, పతికౌగిలిలో వాగుగా కరిగి జాలువారింది. ప్రణయమూర్తి ప్రవాహమైన ప్రళయాన్ని చూచి కిన్నెరసాని భర్త కుమిలికుమిలి శోకించి కరడుకట్టి శిలయై పోయాడు.

'ఈవు రసాకృతి వగుటను – ఈవైఖరి ప్రవహించితి
నేను శిలాహృదయుండను – పూనుదునే ధునీవైఖరి'

అని వాపోయినాడు. భర్తలో ఘనీభవించిన కరుణం, భార్యలో పరవళ్లుత్రొక్కిన కరుణం ఆకృతికల్పనకు ఆలంబనంగా గ్రహించారు విశ్వనాథవారు.

నదీమతల్లిని నారీమణితో పోల్చటం కవిసమయం. వాగునే మగువగా రూపించటం ఇందులోని శిల్పం.

'బ్రతికి ఉన్నప్పుడూ – అతివ కిన్నెరసాని
యెంత ఒయ్యారియో యెంత నెమ్మదిచానొ
అంత ఒయ్యారమ్ము అడుగడుగు పోయింది
అంత యిల్లాలినెమ్మదితనము చూపింది.'

కిన్నెరనడకలూ, నృత్యమూ, సంగీతమూ, దుఃఖమూ, ప్రవాహపరంగా సాగినా కిన్నెరసాని జలదేవతగా అంతరంగానికి రూపుకడుతుంది. ఆ నదీసుందరి ప్రతి కదలికా విశ్వనాథవారి గేయచ్ఛందంలో హృదయస్పందంగా నినదిస్తుంది.

'కదలగా కదలగా - కాంత కిన్నెరసాని
పదుపుకట్టిన లేళ్ళకదుపులా తోచింది
కదలు తెల్లని పూలనదివోలె కదిలింది
వదలు తెల్లని త్రాచుపడగలా విరిసింది.'

'జలజలా పొంగింది - బిలబిలా నడచింది
పరికిణీ తొక్కాడు పదియేళ్ళకన్నెలా
చిన్నిగంతులు వేయు తెల్లనాబెయ్యలా
పసిపాప సెలవివారిన బోసినవ్వులా'

'జలదేవతలవెంట సాగి కిన్నెరసాని
తెలితారకలవెంట వెలుగులా తోచింది
తలిరుపూవులవెంట తావిలా తోచింది
తెనుగుపాటలవెంట తీపిలా తోచింది'.

విశ్వనాథవారి ఉపమానాలు వర్ణ్యవస్తువుయొక్క ఉన్నరూపాన్ని చెప్పటంతో ఆగక ఊహాప్రపంచాలకు క్రమంగా తీసికొనిపోతవి. మాలోపమలలో విశ్వనాథ మలచిన శిల్పం అది.

ఆవేశంలో నీటిజాలుగా మారి, కొండకోనల్లో జారి, అడవులబడి పరువెత్తినా కిన్నెరసాని మహాపతివ్రత. కిన్నెర తళుకుబెళుకుల్ని చూచి సాగరుడు మోహపడ్డాడు; ఆమెను కౌగిట్లో చేర్చాలని ఉవ్వెత్తుకెరటాలతో ఉప్పొంగిపోయాడు; కులమర్యాదను కాలదన్ని కులకాంతలను చెరపట్టే సామంతుడిలా కామాంధ్యాన్ని ప్రదర్శించాడు. కడలిరాజు నిజరూపం తెలుసుకొని పడతి కిన్నెరసాని పరిపరివిధాల పరితపించింది.

'తన కున్న మరియాద యెంతా-తన కున్న గౌరవం బెంతా
లోకాలు తప్పుత్రోవల పోవునా యేని
సర్ది చెప్పగలట్టి సామంతు డీ రాజు
తానుగా దిగెనా-తప్పుదారులకూ'

'ఓనాథ నిను వీడి వచ్చి - ఓరాజ నిను వీడి వచ్చి
నాయెడ ల్పాయితమ్ము నానాజనులు కోర
యీయేవపుంబ్రదుకు కేల పొందితినిరా
అంచు వగచినదీ-అంచు బురలినదీ.'

పతి నెడబాసిన పడతి సంఘంలో పడే అగచాట్లు వ్యంగ్యంగా ఈయితివృత్తంలో సూచింపబడినవి. గోదావరీమాతవంటి గుణవతులు గోముఖవ్యాఘ్రాలైన కామాంధులనుండి కన్నెపడుచుల్ని కాపాడి కడుపులో పెట్టుకొని రక్షిస్తారన్న సత్యాన్ని కిన్నెరసాని వాగు గోదావరిలో సంగమించేఘట్టంలో కవి ధ్వనింపచేశాడు. నదీ వైభవాన్ని వస్తువుగా తీసికొన్న ఆధునికకృతులు చాలకొద్దిగా మాత్రమే ఉన్నాయి. ఆధునిక సాహిత్యంలో వాటికి 'కిన్నెరసాని' కున్న కీర్తిలేదు. అది తెలుగుదనం తెట్టెకట్టిన తేనెవాక, తెలుగుపాట రక్తికట్టిన దేశివృత్తం. విశ్వనాథ కిన్నెరసానిపాటలు పాడితే తెలుగుదేశం పరవశించిపోయింది. ఇప్పటికీ, ఇంకెప్పటికీ అబాలగోపాలాన్ని అలరించే మధురకవిత ఈ కావ్యం.

విశ్వనాథవారు భావకవిత్వయుగంలో ప్రణయగీతా లాలపించారు. అద్వైతప్రేమ వారి ఆరాధ్యతత్త్వం. ఆ ప్రేమకు ప్రతీకయైన స్త్రీ అనురాగానికీ ఆరాధనకూ ఆలంబనం. అనంతవిశ్వాకృతిగా వ్యాపించిన ప్రకృతి ఆ ప్రయణ మూర్తికి ప్రతిరూపం. ఆ అనంతమూర్తిని హృదయాంతరంలో నిలుపుకొన్న ఆరాధకుఁడు కవి.

'నీ నిజస్వరూపమ్ము ధ్యానింప నెంచి
విశ్వవస్త్వంతరమ్ముల వెదకి వెదకి
కొసకు నా హృదయాంతరకోటరస్థ
మైన సూక్ష్మాకృతిని నిన్ను నే నెఱిఁగితి.
నేను ప్రాపంచికముగ ననేకకార్య
లగ్నహృదయుండఁబోలె నెల్లరకుఁ గానఁ
బడుదునే కాని దేవి ! నాభావ మెపుడు
నిత్యలగ్నంబు నీపాదనీరజముల.'

ఆదేవి ప్రణయార్థంలో భావసుందరి కావచ్చు. పరమార్థంలో పరదేవత కావచ్చు. మధురభావనంలో మార్మికత విశ్వనాథవారి భావగీతికాఖండాల్లోని ఒక ప్రత్యేకత.

విశ్వనాథవారి భావగీతాల్లోనూ, శతకాల్లోనూ ఆత్మనాయకమైన భావ స్రవంతి అంతర్లయగా ప్రవహిస్తుంది. ఆయన ప్రణయజీవితంలో పాలుపంచుకొన్న అర్ధాంగి (మొదటిభార్య) అమరత్వాన్ని పొందినప్పు డాయనసంస్కారవంతమైన అంతరాత్మ ఆ ప్రేమమూర్తిని అమరజ్యోతిగా ఆరాధించింది.

సుందరకాండలోని హనుమత్సందేశం పెక్కు సందేశకావ్యాలకు ప్రేరణ నిచ్చింది.నలదమయంతుల కథలోని హంససందేశం, కాళిదాసుని మేఘ సందేశం లాంటి కథలూ కల్పనలూ కోకొల్లలుగా వచ్చాయి. విశ్వనాథ కల్పవృక్షంలో-యుద్ధకాండంలో రాముడు సీత యొద్దకు హంససందేశం పంపే కల్పన చేశారు. నైషధంలోని హంసకల్పనం వంటిదే ఇది. హంస అక్కడా ఇక్కడా పరమేశ్వరుడే. ఇంద్రజిత్తుచేత మూర్ఛితులైన రామలక్ష్మణులకు గండంతప్పితే అగ్నిప్రవేశం చేస్తానని సీత ప్రతిన చేయటం భావికథావ్యంజకమైనదే కాక దేశీయతా స్వభావ విశిష్టమైన కల్పన. అరణ్య పర్వంలో మాయలేడి రూపంలో మృతిపొందుతూ లక్ష్మణా అనటానికి బదులు కల్పవృక్షంలో 'లక్ష్మణాగ్రజా' అని అరుస్తాడు మారీచుడు. అందులో 'అగ్రజా' అన్నపదం అస్పష్టంగా అంటాడు. భారతంలోని 'అశ్వత్థామోహతః కుంజరః' న్యాయాన్ని నిపుణంగా రామాయణంలో పొందు పరచారు విశ్వనాథవారు. మారీచునికి రామస్మరణ పుణ్యం దక్కింది; మన కొక సూత్న కల్పన దక్కింది. అన్ని కల్పన లొక యెత్తు. ఉపసంహారఖండంలోని ఈ క్రింది కల్పన మొకయెత్తు. అత్రి ఆశ్రమంలో పుష్పకం దిగింది. అత్రిదంపతులను సీతారాములు సేవించినారు—'అంత నందఱుంబోయి విమాన మెక్కిన నది బయలుదేరఁబోవువేళ దూరాన ననసూయాదేవి నడచుచు వచ్చుచుంటఁ జూచి శ్రీరామచంద్రుం డాపిన, నామె నడచివచ్చి శ్రమం పడుచు మెట్లెక్కి రెండు ఫలంబులు సీత చేతిలో నిడి దిగి పోవుచుండ, సీత యా ఫలంబులు రాముని చేతి కిచ్చి యామెను మెట్లుదించి తిరిగిరా విమానంబు సాగి చనఁజొచ్చె". సీతారాముల ప్రణయ ఫలాలైన కుశలవులీ రెండు ఫలాల్లో బీజాలు. విశ్వనాథ ఉత్తరరామాయణ కథార్థన్నంతా ఇందులో ధ్వనింప చేశాడు. అనసూయ పండ్ల నివ్వట మెంత గొప్పకల్పనో, సీత మునిరాచేతులో వాటిని ఉంచటం కూడా అంతే గొప్ప కల్పన. సీతమ్మ రామునికి పండ్లిచ్చి అనసూయను పంపించి తిరిగి వచ్చింది. విశ్వనాథ ఉత్తర రామాయణం కూడా వ్రాసిఉంటే అదీ మంగళాంతమే అయిఉండేదేమో!

వాల్మీకి రామాయణ కథలో అధ్యాత్మ రామాయణ కల్పనలు ప్రవేశించి లోకంలో ప్రచారం పొందియున్నాయి. విశ్వనాథవారు ఔచిత్యాన్నిబట్టి వాటిని కూడా తమ రామాయణంలో పొందుపరచుకొన్నారు. అహల్యను శిలవు గమ్మని శపించే కథార్థాన్ని గ్రహించినా ఆ సన్నివేశనిర్వహణలో విశ్వనాథ వైచిత్రిని

కల్పించాడు. రావణుడు సీతాకరకమలాలను గ్రహించి బలవంతంగా రథంలో ఉంచినా ఆతనిస్పర్శ తగులకుండా విశ్వనాథ చిత్రీకరించాడు.

'దశకంఠు చేతులు ధరణిజా హస్త-జలజాతముల పదిజతలైన గాజు
లందున నొక్క యాయమభద్రపరుష-గాజులు చిట్లి తత్కరములు పెట్లి
నెత్తులు కాఱుచు ధారుణీసుత కెంతో-నొవ్వైన సీతాతనూస్పర్శ దైత్య
కరతలంబునయందుఁగానట్టి స్థితికి-తల్లి సంతోషించెఁ దా మనస్సునను'.

రావణుని యందలి మోక్షేచ్ఛను జీవుని వేదనగా మలచి పోషించాడు విశ్వనాథ.

విశ్వనాథ ఉపాఖ్యానాలను చిత్రించే విధం ఉజ్జ్వలం. ఒక్కొక్క కథ ఒక్కొక్క లఘుకావ్యంగా భాసిస్తుంది. బాలకాండలో విశ్వామిత్రుడు చెప్పే కథలు కథాకథన శిల్పానికి శిరోరత్నాలు. శతానందుడు చెప్పిన విశ్వామిత్రుని కథ ఉపాఖ్యానాలలోకల్లా ఉజ్జ్వల నీలమణి. రామజీవితాన్ని ప్రభావితం చేసింది ఆ మహర్షి కథ. సంసార సారాన్నీ, సాహస వీరాన్నీ, చవిచూచి పరిత్యజించి బ్రహ్మర్షి స్థానాన్ని సాధించిన సాధకు డా మహర్షి. ఆయనలోని శృంగారం, అంతర్వేదన, పరహితార్థబుద్ధి, పరమ పురుషార్థసిద్ధి రాముని జీవితాన్ని తీర్చ దిద్దాయి. సంసారియైన రామునికో మనస్సన్న్యాసం ఆయన మహిమయే. విశ్వనాథ చిన్న పాత్రలను సైతం చికిలిపెట్టి రూపురేఖలు తీర్చిదిద్దాడు. గుహుడు, అగస్త్యభ్రాత, శాంత, శబరి, మంథర, శూర్పణఖ, త్రిజట, అనసూయ, ఇలా ఎన్నో పాత్రలు ఆయన రచనలో పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని సంతరించుకొన్నాయి!

శ్రీరామునిలో పరిహాస శీలాన్ని సార్థకంగా సంతరించారు విశ్వనాథ.

'తా హాస్యాద్భుతశీలి రాముఁడు పృషత్కంబుల్ ప్రయోగించుచో
హాహాకారము లేచు మంధరను రాయన్ డాయఁగా సేయుఁ ద
ద్ధాహాకారము లెంతగా బలియునో హాస్యంబు దా నంతగా
బాహాస్ఫాలనమూర్తి చేయు రఘురాడ్బాలుండు గగ్గోలుగాన్.

కుబ్జపై చూపించిన కోదండ పాండిత్యమే రాముడు కోసలరాజ్యాన్ని వదలి కానలకు వెళ్ళటానికి అంతస్స్పాధనంగా అమరింది కల్పవృక్షంలో. కైక రాముని పరిహాసం మంథరయందు భాసించటం ఆపాత్రకే అబ్బిన అదృష్ట మని భావిస్తుంది.

'ఒక్క సీయందె పరిహాస ముజ్జ్వలించు
రామభద్రుఁ డెంతటి తపోరాశి వంచు
నవ్వు కానట్లు మఱియును నవ్వినట్లె
చంచలించును జేతు లాడించి కైక'.

తిక్కనగారి నవ్వులను విశ్లేషించి తెలుగువారికి చెప్పిన విశ్వనాథ కల్ప వృక్షంలో పాత్రల నవ్వులను సహస్రముఖాలుగా ప్రదర్శించాడు. రసభావ విభావాలను సూక్ష్మాంశాలతో చిత్రీకరించటంలో విశ్వనాథ విశేషప్రజ్ఞను చూపించాడు' మచ్చుకు ఒక్క ఉదాహరణం. ప్రస్థాన ఖండారంభంలో రాజచిహ్న విరహితుడై యున్న రాముణ్ణి చూచి సీత-

'తెరలుచు కొన్ని దిగ్భ్రమయుఁ దీరఁ బకాలున నవ్వి రాఘవా
యురవడి నాయెదన్ మొదటినుండియు నీయనుమాన మట్టులే
జరిగిన దట్టులే జరిగె సంగత పెట్టినయట్టి హేతు తా
స్ఫురణము మాత్రమే నెఱుఁగఁ జూచెద, దాని ననుగ్రహింపవే'.

'అనిన దైన్యపుఁ బొర దానియంత నదియ
యరుగఁ బొట్టబు నువ్వుగింజంత నవ్వి
మఱల మొగమున బిగువు క్రమ్మంగ స్వామి
యేమి యనుమాన మది? యది యెట్లు జరిగె'.

ఇందులో సీత పకాలున నవ్వటంలో ఉన్న అర్థగాంభీర్యం రాముని నువ్వుగింజంత నవ్వులో నున్న బ్రహ్మాండమైన భావం సహృదయులు భావించిన కొద్దీ ఆలోచనామృతాన్ని అందించగలవు.

విశ్వనాథవారి సంభాషణ శిల్పం, వాక్యవిన్యాసవైఖరి, పాత్రల స్వరూప స్వభావాలనే కాక లోకధర్మిని కళాధర్మిని మేళవించుకున్న నాటకీయక కళా నైపుణ్యాన్ని కూడా నిండుగా ప్రదర్శిస్తుంటాయి. రాముడు లక్ష్మణుణ్ణి తెలుగువాడు చిన్నవాణ్ణి పిలిచినట్లు "లచ్చీ!" అని పిలుస్తాడు.

"నీ కొడుకును గైకొని చని
మా కాకలియంచుఁ దిందుమా ? పిచ్చినృపా !
మాకడఁ బ్రశస్త మస్త్ర
వ్యాకృతి కల దద్ది నేర్పెద మింతే".

అనే విశ్వామిత్రుని పలుకుల్లో తెలుగుదనం వెలుగు నింపుకుంటుంది. 'నీవటోయీ యోయి! నెట్టిక సీల! నీవా? శైవధనుసును వంచినావు?' అన్న పరశురాముని మాటల్లో ప్రౌఢుడైన తెలుగు వృద్ధుని వాక్యవిన్యాసం లాస్యం చేస్తుంది.

'ఈసారి కూడ సామీ !
భాసురముగ గుర్తుపట్టబడకుంటిని బో
నీ సుగ్రీవునకు జలము
చేసేతన్ వదలుకొమ్ము చేతః ప్రభువా !"

అన్న సుగ్రీవుని దీనవాక్యాలలోనూ, "నీ వేమిటి రామా ! యీవిమలే తరము కార్యమేమిటి రామా" అన్న వాలి మాటలలోనూ వాక్యాలు హృదయ వేదన వ్యాఖ్యానాలు. ఇక సరససంభాషణ చమత్కారానికి కొక ఉదాహరణం. చూడండి. అహల్యా ఖండంలో రామ గాధేయ వాక్యసల్లాపం-

'నీకై రేవున నౌక సిద్ధముగ నుండెన్ బుణ్యభాగీరథీ
శ్రీకాంతారంబులు లేఁగరళ్ళ గుములై ప్రేయః కథాకృష్టలీ
లాకారమ్ముగ నిన్న వేనెడిని హేలార్ఘ్య ప్రదానక్రియా
స్వీకారమ్మును గాంచవే మునిశిరస్సీమంత ముక్తామణీ'

'అనినన్ నవ్వుచు గాధిసూతి బళిరయ్యా! బాలకాతుత్థ్స ! మా
మునిమూర్ధంబుల నట్టకట్టిన జడల్ ప్రోఁదోచి సీమంతముల్
తనుకన్ బాపటఁ దీర్చి యూపయిని ముక్తారత్నముల్ పెట్టె దీ
వను చే నా తలపైని ముత్యములు నై యాముక్తమయ్యెన్ శిశూ'

సంబుద్ధులను సార్థకంగా వాడటమే కాదు. వాటిమీది సరసోక్తులను కూడా సంతరించారు విశ్వనాథవారు.

కల్పవృక్షంలో తెలుగు నానుడులు, జాతీయాలే కాక తెలుగు వాతావరణం కూడా చిత్రింపబడింది. దానిలో ముత్యాల జల్లువంటి కల్పన సీతారామ వివాహం నాటి చిటపట చినుకులు.

'ప్రతి చైత్రశుద్ధ నవమికి
వితతంబుగఁ దెలుఁగునేల విరిసెడు జల్లుల్

సితముక్తా సదృశంబులు
ప్రతనులు తలఁప్రాలవేళ వచ్చెఁ జిటపటల్.'

తెలుగుదనాన్ని రంగరించటానికి రక్తికట్టించిన రచన యిది. విశ్వనాథ ప్రతిభ అచ్చమైన తెలుగుకవిది!

# 5

"తలలోతు నెఱుఁగని జనుల పూజకుఁ దిర
స్కృతిఁ జూపు మత్సరస్వతి సుభద్ర ;
తనలోతు నెఱిఁగిన జనుల పూజకు నవా
దృతిఁ జూపు మత్సరస్వతి సమార్ద్ర"

విశ్వనాథవారి కవితా శైలిని గురించి పర్యాలోచించటానికి ఈ పద్యం ఒక సూచిక. ఆయన లోతును కనుగొన్నవారు ఆయన కవిత్వాన్ని హర్షిస్తారు. తెలియనివారు నిరాదరిస్తారు. అందరికీ తెలిసేటట్లు కవిత్వం వ్రాస్తే బాగుంటుం దనే వారు కొందరున్నారు. 'కిన్నెరసాని' పాటలు అందరికీ తెలిసేటట్లువ్రాశారు. ఆ తరువాత క్రమంగా ఆయన శైలిని సంస్కృత సమాస జటిలం చేశారు. అందువల్ల ఆయన "పాషాణపాకప్రభువు" అన్నవారూ ఉన్నారు.

"నిష్ఠావర్షదమోఘ మేఘపటలీ నిర్గచ్ఛ దుద్యోతిత
స్వేచ్ఛైరమ్మదమాలికాయుగపదుజ్జృంభన్మహాఘోరంబం
హిష్ఠస్ఫూర్జథుషండఘుర్ఘుర రవాహీనక్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొకరావ మంతట నెసంగెన్ ఛిన్నచాపంబునన్".

వంటి పద్యాలు అర్థం కావటం కష్టమని కొందరంటారు. దీన్ని గురించి ఆలోచించేముందు విశ్వనాథ అభిప్రాయాన్ని తెలుసుకుందాం. "కవితాభావనకల వాడు రసము లెన్ని? తీసికొన్న కథ యెటువంటిది? ఏ కల్పన చేసినచో అ కథకు పొసగును? ఏది లోకోత్తరమైన ఊహ? ఒక విశిష్టమైన భావమును చెప్పుటకు వాక్యమెట్లు చెప్పవలయును? ఏ యలంకారము చెప్పవలయును? ఇట్టి అనంతములైన విషయములయొక్క పర్యాలోచనము చేయును. ఇట్టి బహు విషయములయొక్క పర్యాలోచన స్వరూపము కవిత్వమైనచో కవిత్వ మందఱ కర్థమగుట కష్టము. దానియందు పరిశ్రమ చేసినవారికే అది యర్థ మగును." మహాకావ్యాన్ని రచించేటప్పుడు రచన రసానుగుణంగా ఉండాలేదా?

అనేకాని పరిశ్రమచేయని పలిత కర్థం కావాలని కవి చూడ దని ఈ మాటల వల్ల అర్థమౌతుంది.

అర్థం కావటం శబ్దార్థాలకు సంబంధించింది. అందం భావానికీ శిల్పానికీ సంబంధించింది. ఆవిష్కృత మైన కవితలో అందాన్ని కవి నిక్షేపిస్తాడు. సహృదయు డాస్వాదిస్తాడు. సుమంత్రుడు సీతారామ లక్ష్మణులను అడవిలో దింపి అయోధ్యకు తిరిగి వస్తాడు. దశరథునితో ఇలా అంటాడు-

'ఓ మహారాజ ! నీ యూళ్ళలో, నీళ్ళలోఁ
　　జెఱువులందున నొక్క చేఁప లేదు
భూలోకమఘవ! నీ నేలలోఁ బూలలోఁ
　　దోఁటలందున నొక్క తేటి లేదు
పృథ్వీశ! నీరాజ్యవీథిలో వీథిలోఁ
　　బురమునందున నొక్కపురుగు లేదు
ప్రభు! మీరు చను నసివాళ్ళలో బీళ్ళలోఁ
　　బసిమి మేసెడు నొక్కపశువు లేదు

చిన్నికోడలితోడ రామన్న వదలి
వచ్చుచున్నట్టి నాదు దౌర్భాగ్యముఖము
పరిహరించిరొ ! నాదు సేవకతపొంబె
బృథ్వీపతి! యెంతగాఁ బ్రతారించినావు!'

ఇది రాముడు లేని రాజ్యాన్ని వర్ణించిన పద్యమా? సుమంత్రుని దుఃఖ భావాన్ని దీపింపచేసిన పద్యమా? ఒకటి మరియొక దానికి వ్యంగ్యం. దీన్ని తెలుసుకోవటం కవితా సౌందర్యం తెలియటం. అలాగే ధనుర్భంగంలో ఉన్న రచనా సౌందర్యాన్ని కూడా గ్రహించవచ్చు. సుమంత్రుని ఘట్టంలో ఉన్నది భావప్రధానమైన రచన. అందువల్ల శబ్దం దానికి ఒదిగిపోయి గౌణధర్మాన్ని ప్రదర్శిస్తుంది; ధనుర్భంగ ఘట్టంలో వస్తువే శబ్దం. దాన్ని శబ్దమే ధ్వనింప చేయాలి. అర్థం అక్కడ శబ్దానికి గౌణం, శబ్దార్థోభయ ప్రాధాన్య వివక్ష సన్ని వేశ రసభావార్థాలను బట్టి ఏర్పడుతుంది. అది తెలిస్తే శిల్పం తెలిసినట్లే. కల్పవృక్షం విశ్వనాథ రచనా శిల్పవృక్షం.

"నన్ను నెఱుఁగరో యీ తెల్గునాఁట మీరు
విశ్వనాథ కులాంభోధివిధుని బహువి

చిత్ర చిత్ర ధ్వని బహువిచ్ఛిత్తి మన్మ
హాకృతి ప్రణేత సత్యనారాయణకవి". (త్రిశూలము)

అని చెప్పుకున్న విశ్వనాథ కావ్యాన్ని ధ్వనిసిద్ధాంత మర్మజ్ఞానంతో చదవాలి. అందులోని లోతును గమనించాలి.

విశ్వనాథ పూర్వమహేంద్ర కవుల కవితాగుణాలను తన కవితలో సంగమింపచేసుకొని తనదైన ఒక మార్గాన్ని నిర్మించుకున్నాడు. నన్నయ్య వాల్మీకి లాగా ఋషివంటివాడు. ఆయన ధారామధురమైన రచనలో ఉన్న కథాకథన శిల్పాన్ని గ్రహించాడు విశ్వనాథ. శిల్పపు తెలుగుతోట యైన తిక్కనలోని వాక్యరచనా విన్యాసాలను ఒడిసిపట్టాడు. ఎఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండని చెప్పి తానూ ఆలక్షణాన్ని అలవరచుకొన్నాడు. పోతన భక్తిని మనసులో రంగరించుకొన్నాడు. శ్రీనాథుని రసప్రసిద్ధ ధారాధునిని తన పంటకు కావలసినంత మేరకు కుల్యలుచేసి నింపుకున్నాడు. కృష్ణరాయని సమాసరచన ద్వారా ఊహను సంగ్రహ రచనలో సాధించే కళ నేర్చుకున్నాడు. పెద్దన్నలోని వస్తుధ్వని, రామకృష్ణునిలోని పదగుంఫనం ఇలా-రామాయణ కవితలో అన్నింటినీ పొందుపరచాడు. అంతేకాదు 'ఒకడు నాచన సోమన్న' గా 'ఒకడు విశ్వనాథ' అనిపించుకున్నాడు.

విశ్వనాథ రచనకు ఓజస్సు తేజస్సు, ప్రసాదం ప్రకృతి, మాధుర్యం మహిమ. ఆయన భావాన్ని ఆవిష్కరించేటప్పుడు ప్రసాదాన్ని ప్రసరిస్తూ భావస్వభావాన్ని బట్టి మాధుర్యోజస్సులను మిశ్రితంచేస్తాడు. భావనను రేకెత్తిస్తున్నప్పుడు ఓజస్సును స్వీకరించి దానిబలాన్ని గుణాన్నిబట్టి ప్రసాదమాధుర్యాలను మిశ్రితం చేస్తాడు. అంతఃకరణ ప్రవృత్తిని చిత్రించేటప్పుడు మాధుర్యాన్ని ఆలంబనంగా చేసుకొని మిగిలిన గుణాలను సమయోచితంగా మిశ్రితం చేసుకుంటాడు. ధనుష్ఖండంలోని మేనకా విశ్వామిత్ర ఘట్టంలో-

'పనియేమో దేవతలది
వనితా ! కూలికినిగాని వచ్చినయట్ల
య్యునను నెడఁదలోఁతు లిచ్చిన
నిను నేల శపించవలయునే మధుమూర్తీ !'

అన్నది ప్రసాదగుణమైతే- 'వసంతనవశోభ వచ్చె నప్సరసపోలె' నని వర్ణించిన సీసం ఓజస్సు ప్రధానంగా నడుస్తుంది; 'కోరి ప్రత్యక్షమన్మథగురువవైతి,

కోరక పరోక్షవై రాగ్య గురువవై తి'వను పద్యంలో మాధుర్యం మణితంచేస్తుంది.

విశ్వనాథ రచనలో ఉన్న మరియొక విశేషం ఆయన పదసంవిధాన విధానం. ఆయన ధారామాధుర్యాన్ని మౌలికంగా అభిలషించడు. ధార ఆవేశానికి చిహ్నం. వాక్యవిచ్ఛిత్తిని బహుళంగా స్వీకరిస్తాడాయన. అది ఆలోచనకు చిహ్నం. విశ్వనాథకు ఆవేశం లేదని కాదు. అది ఆలోచనపొరల్లోపడి వేగం తగ్గి విశ్లేషణాత్మకంగా వెలువడుతుంది. ఆలోచన అతఃప్రవృత్తిని, ఆవేశం మనఃప్రవృత్తిని వ్యక్తంచేస్తుంటాయి. ఒక్కొక్కసారి ఈరెండూ సమభాగాలుగా ప్రసరించే తావులు కనపడతాయి వీటన్నింటికీ మించి విశ్వనాథకు తన వ్యక్తిత్వంమీద అభిమానం ఉంది. అది తాను చేసే శిల్పాన్ని తెలిసి చేయటంవల్ల ఏర్పడిన స్థైర్యం కవి వ్యక్తిత్వం, ఆలోచన, ఆవేశం ఈ మూడింటిలో శ్రోతకు ముందు కావలసింది ఆవేశం, ఆతరువాత, ఆలోచన, ఆవెనుక కవి. విశ్వనాథ తాను తన ఆలోచనతో ముందు ప్రత్యక్షమై పఠితను తనతో తీసికొనిపోతుంటాడు. తిక్కనామలు ఆలోచనను ముందు త్రోసి, తాము వెనుక ఉండేవారు నన్నయాదులు ఆవేశాన్ని ముందుంచి తమనూ, తమ ఆలోచనలనూ రచనలో లీనం చేసేవారు. నాచన సోమాదులు విశ్వనాథవలె తమనూ తమ ఆలోచననూ ముందుంచేవారు. నాచనసోమునికీ విశ్వనాథకూ ఉన్న భేద మేమిటంటే నాచన సోమునికన్న విశ్వనాథలో ఆలోచనాంశ అధికం. నిలువెల్ల భావనగా భాసించే విశ్వనాథ రచనలో, కథలో అడుగడుగునా ఆయన ముద్రకూడా మనల్ని మోహపరుస్తుంటుంది. అదీ ఆయన ప్రత్యేకత.

'ఆం నన్నయ్యకు లేదు తిక్కనకు లే దాభోగ మస్మాదృశుం
డంఘుస్వాదు రసావతార ధిషణాహంకార సంభారదో
హలబ్రాహ్మీమయమూర్తి శిష్యు డయినాఁ డన్నట్టి దా వ్యోమపే
శల చాంద్రీ మృదుకీర్తి చెళ్ళపిళ వంశస్వామి కున్నట్లుగన్.'

ఈ పద్యం విశ్వనాథ కవితాస్వభావాన్ని పట్టి యిస్తుంది. పద్యంలో భావం చాల ఉదాత్తమయింది. చెప్పేతీరు ఉత్కంఠావహమైంది. భావంలో పరవశిస్తున్న పఠితకు విశ్వనాథ మాత్రం మరుపుకురాడు. రామాయణంలో కూడా ఈతత్త్వం మరోరూపంగా ప్రత్యక్షమౌతుంది. రామునిలో నారాయణతేజం ఉంది. రాముని కాతేజం నివురుగప్పిన నిప్పులా స్ఫురిస్తుంటుంది ఋషులూ, భక్తులూ ఆ నివురును తొలగదోస్తూ జ్యోతిని చూస్తుంటారు. పఠితకు రామునితో తాదాత్మ్యం

చెందితే ఒక విధంగానూ, భక్తులతో తాదాత్మ్యం చెందితే ఒకవిధంగానూ రస స్ఫూర్తి కలుగుతున్నట్లుగా అనిపిస్తుంది. ఒకటి ధర్మవీరం, మరొకటి భక్తి భావం. మధ్య విశ్వనాథవారి జీవునివేదన ఆ రెండింటికీ వారధిగా రామాయణ రచనలో సాక్షాత్కరిస్తుంది.

'అమ్మా దేహ మనన్ విచిత్ర మగు దుఃఖారామ మన్పించు దే
హ మ్మన్నంతన జీవి పొందనగు బాధాసహ్యతల్ చెప్పశ
క్యమ్మా? యొక్కొక జీవి యొక్కొక విధంబై పొందు దుఃఖమ్ము రా
జ్యమ్మో! రాణియొ కాననంబొ ఋషిభార్యారత్నమో చెప్పగన్.'

రాముడు కౌసల్యతో అన్నమాటలివి. విశ్వనాథ కల్పించిన మాటలివి. జీవితాన్ని నిండుగా జీవిస్తూ అందులోని జీవచైతన్యాన్ని, సంస్కారసారాన్ని, తాత్త్విక తాత్పర్యాన్ని దర్శించిన బ్రాహ్మీమయమూర్తి విశ్వనాథ. రామాయణకావ్యాన్ని ఆత్మాన్వేషణకోసం వ్రాసిన విశ్వనాథ - పఠితలకూ ఆ లోతులను చూపిస్తాడు. రామునిలోని అన్వేషణ విశ్వనాథ. భక్తులలోని అన్వేషణ విశ్వనాథ. రామునిది ఆత్మాన్వేషణ, భక్తులది పరమాత్మాన్వేషణ. విశ్వనాథది పరమార్థాన్వేషణ. అది కావ్యంలో రసఫలాన్నిచ్చింది; సందేశంలో సాయుజ్యమార్గాన్ని కాంతాసమ్మితంగా బోధించింది. రసలోకంలో రాముడు వీరుడు; జ్ఞానలోకంలో రాముడు దేవుడు. రామకథా కల్పవృక్షాన్ని పెంచింది విశ్వనాథ ఆది ఏ కోరిక కోరితే ఆ కోరిక ఇస్తుంది.

'సద్యోనిర్గతమైన సర్వకవితా సంభారమున్ నీకు నై
వేద్యం బిచ్చితి రామచంద్ర! ప్రభువా! విశ్వాసముం బూనవే
యాద్యంబై చను జీవలక్షణము సంహారంబు గావింపవే
హృద్యంబై చను నీదు తేజమును సారంపంగదే గుండియన్.'

విశ్వనాథ జీవలక్షణం కల్పవృక్ష సృష్టికి బ్రహ్మత్వాన్ని కల్పించింది. ఆయన కోరుకున్న జీవలక్షణ సంహారం ఆయనకు శాశ్వత బ్రహ్మసిద్ధిని కల్పించింది. విశ్వనాథకృతి యుగయుగాల సంస్కృతికి పతాక; ఈ యుగానికి ప్రతీక! ఆయన రామాయణ కల్పవృక్షానికి వచ్చిన జ్ఞానపీఠ పురస్కారం ఈతరం గుర్తించిన ఒక పెద్ద విలువ !

—0—

* ఈ వ్యాసం 'యువభారతి' వారి రామాయణసుధాలహరిలో ప్రచురితం.

# విమర్శక చక్రవర్తి విశ్వనాథ

## శిల్పమార్గ ప్రవర్తకుడు :

"Criticism, as I understood it, is the endeavour to discriminate between experiences and to evaluate them" అని ఐ. ఎ. రిచర్డ్స్ అన్నాడు. కావ్యానుభూతుల వివేచనం, వాని అనుశీలనం సాహిత్య విమర్శస్వభావం. అనుభూతి అనేపదం విస్తృతార్థంలో వాడబడింది ఒక కావ్యాన్ని చదువుతున్నప్పుడు సహృదయుడు పొందే అనుభవం పరంపరా రూపంగా ఉండవచ్చు, లేదా కావ్యం మొత్తం చదివినతరువాత అది యిచ్చే పరమార్థరూపమైన ఒక అనుభవమూ కావచ్చు. రెండు విధాల అనుభూతులూ ఉండవచ్చు. వాటిని గుర్తించటం, అనుశీలించటం, తారతమ్యాన్ని వివేచించటం, తాత్పర్యాన్ని సంపదించటం విమర్శలక్షణ మౌతుంది. అనుభూతి సాహిత్యాని కున్న విలువ. అనుభూతిని అధ్యయనంచేయటం విలువలకు విలువకట్టటం. విలువలకు విలువకట్టే విద్య శిల్పం. కవి కావ్యంలో సృజనాత్మకచైతన్యంతో విలువలను కల్పించి శిల్పిస్తాడు. విమర్శకుడు వివేచనంతో విలువలను వివేచించి శిల్పాన్ని అనుశీలిస్తాడు. అందువలనే రిచర్డ్స్ "To set up as a critic is to set up as a judge of values" అని అన్నాడు. విశ్వనాథ ఎంతటి కవియో అంతటి విమర్శకుడు. 'కవి సమ్రాట్' గా ఒకవైపు 'విమర్శక చక్రవర్తి' గా మరోవైపు గుర్తింపబడినాడు. ఆయనకు విలువలకు విలువలను కల్పించే కవితాశిల్పం తెలుసు. ఆంధ్ర సాహిత్యవిమర్శప్రస్థానంలో విశ్వనాథ వారిది శిల్పమార్గం. దానికి ఆయన మార్గదర్శి. మహర్షి.

## నియో - క్లాసిక్ వాది :

ఆమధ్య ఒకకవిమిత్రుడు నన్నొకప్రశ్న వేశాడు. విశ్వనాథకు కవిగా, నవలాకర్తగా సాహిత్యలోకంలో ప్రత్యేకస్థానాన్ని పేర్కొనవచ్చును గాని సాహిత్యవిమర్శకుడుగా ఆయన కున్న ప్రతిపత్తి ఏమిటి?- అని. నిజమే. అటు వంటిప్రశ్న వేసినందుకు నాకేమీ ఆశ్చర్యం కలుగలేదు. ఎందుకంటే- తెలు

గులో కవిత్వాన్ని పట్టించుకొనినంతగా సాహితీవేత్తలు విమర్శను పట్టించుకోరు. కవిత్వ ప్రయోగాల్లో వచ్చిన మార్పులను దృష్టిలో పెట్టుకొని యుగవిభాగాలను ఏర్పరచుకొని సాహిత్యచరిత్రను అధ్యయనం చేయటయే ఆంధ్రుల కు అలవాటై పోయింది కాని, ఆధునిక యుగంలో వెలువడిన, వెలువడుతున్న వివిధప్రక్రియలో అటువంటిప్రయోగాలూ పరిణామాలూ, ప్రమాణాలూ ఏర్పడుతున్నట్లూ వాటిని కూడా గమనించి యుగవిభాగం చేసి వివేచించవచ్చు నని పరిశీలించే ప్రవృత్తి ప్రచారంలోకి రాలేదు. అందువల్ల సాహిత్యవిమర్శ ఒకసాహిత్య ప్రక్రియ అనీ, అందులోనూ శతాబ్దాలతరబడి ప్రయోగాలు సాగా యనీ సాహితీ వేత్తలు సంభావించటంలేదు. దానితో సాహితీవిమర్శకుల వ్యక్తిత్వాలుగానీ, వారి ప్రస్థానా ప్రవృత్తులుగానీ విశ్లేషింపబడలేదు. తత్ఫలితంగా విశ్వనాథ విమర్శకుడా ? అన్న ప్రశ్న మిగిలిపోయింది. ఆప్రశ్న నిజానికి విశ్వనాథను గూర్చినప్రశ్నయే కాదు — ఏఆంధ్రసాహిత్యవిమర్శకుణ్ణిగూర్చియైనా వేయ వచ్చు. సరియైన సమాధానం చెప్పే సాహిత్యవిమర్శ ప్రస్థానపరిశీలనం తెలుగులో లేదన్నసత్యం దానివల్ల బయటపడుతుంది. ఆలోటును తీర్చుకొనే పాటు పడవలసిన అవసరం నే డెంతైనా ఉంది.

వివేచింపవలసివస్తే విశ్వనాథను పాశ్చాత్య పరిభాషలో నియో-క్లాసిక్ వాదిగా పరిగణింపవచ్చు నని విమర్శకులు కొందరు పేర్కొంటున్నారు. ఈనిరూపణం ప్రధానంగా ఆయన కవిత్వవ్యక్తిత్వానికి సంబంధించింది. అయినాఆమాట కాదనలేని సత్యం. అదే ఆయన గొప్పతనమన్నది కూడా మరువరానిసత్యం. ఇక్కడ గమనింపవలసిన అంశం ఒకటి ఉన్నది. విశ్వనాథ నవ్యసాహిత్య ప్రక్రియల నన్నిటినీ చేపట్టి నిర్వహించినవాడే; అందులో మేటి అనిపించుకొన్నవాడే. ప్రాచీనసాహిత్యమర్యాదలన్నీ అవలోడనం చేసిన మనీషి ఆయన. సంప్రదాయం నవ్యప్రయోగానికి ఎంతశక్తి నిస్తుందో ప్రపంచించి చూపించిన ప్రజ్ఞావంతు డాయన. పద్యంలోగానీ, గేయంలోగానీ, వచనంలోగానీ తనవైన క్రొత్తపోకడలు పోగల ప్రయోగశీలి ఆయన. నడిచేబాటను ఘంటాపథం చేయగల నేర్పరి ఆయన. ఆయన కంతశక్తి నిచ్చింది ఆయన సృజనాత్మకప్రతిభ వెనుకనున్న మహావిమర్శకపరిజ్ఞానం. కావ్యానుభూతిలో ఉన్న మానసిక, బౌద్ధిక, ఆధ్యాత్మికప్రవృత్తుల లోతును సాహిత్యసౌందర్యదర్శనంతో సంభావించి, సమకాలీనసాహిత్యంలో వాటివిలువలను నిక్షేపించాలన్న నిష్ఠ ఆయన వ్యక్తిత్వానికి సాత్త్వికచైతన్యం. ముక్తకంనుండి మహాకావ్యందాకా ఉన్న

సాహితీప్రక్రియల శక్తియుక్తులూ, వాటివలన పఠిత కందే కావ్యానుభూతుల తారతమ్యాలూ తెలిసి ప్రయోగించే ప్రాగల్భ్యం ఆయనలోని సాహిత్యవిమర్శకుడే ఆయనకవిత్వవ్యక్తిత్వానికి అందించాడు. ప్రాచ్యపాశ్చాత్యసిద్ధాంతాల పరిశీలనంతోపాటు, పాశ్చాత్యదర్శనంకంటె ప్రాచ్యదర్శనంలో ఉన్న ప్రగాఢ మానవజీవితగత్యానుశీలనాన్ని ఆయన సాహిత్యదృక్పథంలో సంపదించుకొన్నాడు. ఆయన భావకవిత్వాన్ని పరామర్శించాడు, అభ్యుదయప్రవృత్తిని అనుశీలించాడు. మహాకావ్యశీలాన్ని వ్యాఖ్యానించాడు. ప్రతిప్రక్రియయొక్క ప్రాథమికరూపాన్నీ, పరిణతరూపాన్నీ, పరిపూర్ణరూపాన్నీ దర్శించగల భావుకుడాయన. అందువల్ల ప్రతిప్రక్రియలోనూ ఆయన విలాసరూపాన్నీ చూపించగలడు, విరాడ్రూపాన్నీ ప్రదర్శింపగలడు. ఆయన కాశక్తి సాహిత్యవిమర్శతత్త్వదర్శనంవల్లనే ఏర్పడిం దనటంలో సంశయం లేదు. "Literary criticism in the most widely accepted sense is Judgement of books, reviewing and finally the definition to taste, of the tradition, of what is classic" అన్న రెనె వెలక్ (Rene Wellek) మాట లిక్కడ గమనింపదగినవి. కావ్యానుశీలనం చేయటమే కాదు సాహిత్యవిమర్శధ్యేయం, కావ్యాస్వాదానికి అనువైన అభిరుచిని నిర్దేశించాలి; దాని సంప్రదాయాన్ని నిరూపించాలి. అంతేకాదు ఆ ప్రక్రియలో ఆదర్శరూపాన్ని లేదా సమగ్రరూపాన్ని (దాన్నే క్లాసిక్ అంటాం) సందర్శింపజేయాలి. విశ్వనాథ సాహిత్యవిమర్శకుడుగా ఈ లక్ష్యాలను సాధించే విమర్శ వెలయించాడు. ప్రతిప్రామాణికప్రక్రియలోనూ పరమప్రమాణమైనది క్లాసిక్ అనబడుతుంది. అది దాని ప్రామాణికరూపం లేదా సమగ్రరూపం లేదా ఆదర్శరూపం. దానినిగూర్చిన దర్శనం ఉన్నవిమర్శకుడు దాన్ని ప్రమాణంగా భావించి సాహిత్యపువిలువలను నిర్దేశిస్తాడు. ఇలా నిరూపించేప్రస్థానాన్నే విశ్వనాథ శిల్పమార్గ మన్నాడు ఈ దృష్టితో చూస్తే సమకాలీనసాహిత్యలోకంలో ప్రక్రియాసమగ్రరూపసంభావనస్పృహను సంతరించిన విశ్వనాథ సాహిత్యవిమర్శకులలో నియో - క్లాసిక్వాద ప్రస్తారం సాగించినవాడన్నా సత్యదూరం కాదు.

మెచ్చదగిన మూడు మార్గాలు :

ఒక సాహిత్యవిమర్శకుని స్థానాన్ని నిర్దేశించటంలో పరిగణింపవలసిన ప్రధానాంశం - ఆయన ఏకావ్యాలమీద విమర్శ సాగించా డనే దానికంటె

అవిమర్శ నేపద్ధతిలో ప్రస్తరించాడన్న వివేచనం.ప్రవృత్తినీ, ప్రవర్తననూబట్టి విమర్శను విశ్లేషణం చేయటం విజ్ఞలోకం పాటిస్తున్న విధానం. ఆంగ్లసాహిత్య విమర్శను ప్రవృత్తి ననుసరించి జార్జి వాట్సన్ మూడు విధాలుగా సంభావించటం ప్రసిద్ధం. అవి- 1. Legislative Criticism 2. Theoretical Criticism 3. Descriptive Criticism. ఈ విభాగాన్ని మన తెలుగు సాహిత్య విమర్శకు కూడా అనువర్తింప చేసికోవచ్చు. దేశీయమైన పేర్లుకూడా పెట్టుకోవచ్చు. అలా అయినప్పుడు ఆ మూడు విధాలనూ 1. కావ్యలక్షణం 2. కావ్యమీమాంస 3. కావ్యానుశీలనం అని పిలవద్దాం.

కావ్యలక్షణం ప్రధానంగా లక్షణగ్రంథ రచనకు సంబంధించినది. ఇది పఠితలకంటె కవులనే ఉద్దేశించి రచించే సాహిత్యప్రమాణప్రవచనం. ఇది అనువర్తిత విమర్శ (Applied Criticism) కు ఆదర్శసూత్రాల నందించగలదే కాని, అనుశీలనప్రవృత్తిని ప్రపంచింపదు. కావ్య మీమాంస లక్షణగ్రంథా లందించే శాశ్వతప్రమాణాలకంటె ప్రక్రియ కనువైన సాపేక్ష ప్రమాణాలను కావ్యతత్త్వసమాలోచనంలో సృష్టించుకొనే స్వాతంత్ర్యాన్ని భజిస్తుంది. ఈ రెండింటికంటె ఆధునికమైనదీ, ఆదరణీయ మైనదీ కావ్యానుశీలనం. ఇందులో కావ్యార్థాల సంవిధానశిల్పపు ఔచిత్యవిచారం, కావ్యాంగాల సార్థక్యవివేచనం, కావ్యతత్త్వసౌందర్యాల సందర్శనం, కావ్యార్థాల సమన్వయం అనే అంశాలు ప్రధానపాత్ర నిర్వహిస్తాయి. జార్జి వాట్సన్ మాటల్లో— "Descriptive Criticism is always about some perticular text whether of the critic's own or of another, and the critic, instead of laying down general rules or theorising in general terms, analyses the work in hand, traces the influences that have given rise to it, and then discusses it critically item by item." కావ్యం కవికర్తృకమైన సౌందర్య సృష్టి. సహృదయుడు దాని భోక్త. విమర్శకుడు కావ్యకళాసౌందర్య తత్త్వానుశీలియైన వక్త. కావ్యానందం విమర్శకు డందించే అనుశీలనంవల్ల అర్థవంతమై ఆలోచనామృత మౌతుంది. ఈ స్వభావాన్ని ముద్రించుకొని ప్రవర్తిల్లేదే ఆధునిక సాహిత్యవిమర్శ.

తెలుగులో కావ్యానుశీలనాన్ని కమనీయంగా అవిష్కరించి ఆధునిక సాహిత్య విమర్శకు వినూత్నమార్గాన్ని అందించినవారు డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు వారి కవిత్వ తత్త్వవిచారం ఈ ప్రస్థానానికి నిర్దిష్టమైన బాటలు

వేసింది. విశ్వనాథ సత్యనారాయణగారే ఈ విషయాన్ని గుర్తించారు. "ఈ రోజులలో కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వవిచారవ వ్రాసి విమర్శనపథాల్లో గొప్పదృక్పథం కలిగించి నవ్యసాహిత్యానికి కొత్తబోదెలు తవ్వారు" అని వారు పేర్కొనటం గమనింపదగిన అంశం. విశ్వనాథలో ఉన్న విశేష మేమిటంటే ఆయన క్రొత్తను గుర్తిస్తాడు. కాని, దాన్ని గుడ్డిగా అనుకరించడు. దాన్ని పరిశీలిస్తాడు పరిష్కరిస్తాడు, పరిపూర్ణతను భావిస్తాడు, ప్రయోగంగా ప్రస్తరిస్తాడు. దానితో ప్రత్యేకతను సాధించుకొంటాడు. కట్టమంచివారి కావ్యానుశీలనం విశ్వనాథ సాహిత్యవిమర్శకు ప్రవృత్తిని ప్రసాదించినా, ఆయనప్రస్తారం ఒక విశిష్టవ్యక్తిత్వంతో ముందుకు సాగింది.

**ఉద్యమాల ఉన్మీలనం :**

ఈ అంశాన్ని ఇదమిత్థంగా నిరూపించే ముందు సాహిత్యవిమర్శ ప్రవర్తనాన్నిబట్టి వివేచింపదగిన విమర్శోద్యమాల స్వరూపస్వభావాలను వింగడింపవలసివస్తుంది. దీనికి కొంత చారిత్రకపరిణామవాస్తవ పరిశీలనం అవసరం.

తెలుగులో అనువర్తిత సాహిత్య విమర్శకు వీరేశలింగం పంతులుగారి యుగంలో నే పునాదులు వేయటం జరిగింది. నన్నయనుండీ వీరేశలింగం పంతులుగారిదాకా ఆంధ్రసాహిత్యవిమర్శ లేదని కాదు. వెలుగులోనికి రాలేదు కాలగర్భంలో కలిసిపోయింది. అయితే విమర్శకు కావలసిన వివేకబీజాలు కావ్యనిక్షిప్తం చేసిపెట్టారు ప్రాచీనాంధ్రకవులు. నన్నయాదులు తమకృతులలో ఏలాక్షణికవేత్తనూ స్మరింపలేదు. అట్లని వారికి కావ్యలక్షణంమీద ప్రమాణబుద్ధి లేదని చెప్పలేము. సాహిత్యజగత్తులో ఆయాకాలాలలో ఆయానూత్నకావ్య రచనా ప్రయోగాలు చేస్తూ వచ్చిన ప్రాచీనకవులు తమప్రయోగాలను అనుశీలించటానికి అనువైన సాపేక్షప్రమాణసూత్రాలను అవతారికలలో పొందుపరుస్తూ వచ్చారు. అంటే, మొదటినుంచీ తెలుగుకవులకు కావ్యలక్షణవిమర్శకంటే, కావ్యమీమాంసయే మనసుకు నచ్చిన మార్గ మన్నమాట ! ఈ కావ్యమీమాంసాప్రవృత్తియే మన ప్రాచీనకవులు మన కిచ్చిన సాహిత్య విమర్శకదృక్పథం.

ఈ కావ్యమీమాంసా ప్రస్థానంలో కవిత్రయయుగం విమర్శకు సంబంధించినంతవరకు సూత్రయుగంగా పేర్కొనవచ్చు. నన్నయాదుల కృతులలోని అవతారికలలో కానవచ్చే సాపేక్షప్రమాణాలప్రసక్తియే యీయుగంలో చెప్పుకో

దగిన విమర్శ. కావ్య ప్రబంధయుగాలలో కావ్య ప్రయోగాలలో కవులు సాపేక్ష సూత్రాలతోపాటు వాటికి వృత్తులవంటి సాహిత్యప్రవృత్తులను ప్రస్తావించటం కనపడుతుంది. కవులు స్వయంగానో, పాత్రలముఖంగానో ఈ వృత్తులను కావ్యస్థంచేశారు. అందువల్ల కావ్య ప్రబంధయుగకాలం సాహిత్యవిమర్శచరిత్రలో వృత్తియుగ మని చెప్పవచ్చు.

కావ్యప్రబంధయుగాలలోనే తెలుగులో లక్షణగ్రంథరచనం సాగింది. ఆంధ్రలక్షణగ్రంథాలలో వినూత్నసాహిత్యసిద్ధాంతాలు ప్రతిపాదించేవి అసలు లేవనే చెప్పాలి. అనువాదాలు బహుళం. తెలుగులో వెలసిన నూత్నప్రయోగాల లక్షణ వివేకం చేసే ప్రవృత్తి వాటిలో మృగ్యం. తెలుగుకవుల సాపేక్షప్రమాణాల విచారం అందులో మందుకైనా కానరాదు. దేశిప్రక్రియలో కొన్నింటి స్వరూప స్వభావాలు నిర్దేశించటానికి ఎడనెడ ప్రయత్నం జరిగినా అనువర్తితవిమర్శ కది అన్వయాల నందించలేదు. అందువల్ల కావ్యలక్షణానికి సంబంధించినంత వరకు తెలుగులో సంస్కృతలక్షణగ్రంథాలే శరణ్యాలైపోయాయి. ఆంధ్రలక్షణ గ్రంథాలప్రభావం తెలుగు విమర్శమీద గగనకుసుమమైపోయింది. ఆంధ్రకవుల ప్రయోగవైవిధ్యంలో ప్రపంచింపబడిన ప్రత్యేకత ప్రదర్శితం కాకుండా మిగిలి పోయింది. ప్రయోగాల ప్రవృత్తిని తెలిసికొనే ప్రాథమికసూత్రపరిజ్ఞానం ప్రాచీనకవులు మన కందించినా వాటిని ప్రస్తరించుకొనే సాహిత్యవిమర్శ అవత రించకపోవటంచేత వీరేశలింగంపంతులుగారికి ముందున్నయుగం అంధకార యుగమని పేర్కొనటం జరుగుతోంది.

సాహిత్యవిమర్శచరిత్రలో వీరేశలింగంపంతులుగారియుగాన్ని వ్యాఖ్యా యుగ మనీ, వివరణ యుగ మనీ పిలువవచ్చును. ముద్రణాయంత్రసౌకర్యం వచ్చిన తరువాత సాహిత్యపత్రికలు వెలువడటం, గ్రంథ ప్రచురణం సాగటం ఈ యుగ చైతన్యానికి మూలశక్తులుగా నిలిచాయి. మెకంజీ, బ్రౌన్ వంటి పాశ్చాత్యపండితుల పరిశ్రమలు ఈయుగానికి దోహదాన్నికల్పించాయి. జూలూరి అప్పయ్య, గరిమెళ్ళవెంకయ్య, పైడిపాటి వెంకటనరుసు, ములుపాక బుచ్చయ్య శాస్త్రి, కావలిసోదరులు, మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి, రావిపాటి గురుమూర్తి వంటివారు కావ్యవ్యాఖ్యలకు అక్షరరూపాలను కల్పించారు.

నవ్యసాహిత్యయుగోదయంలో రూపొందిన కొన్ని విమర్శోద్యమాలను గమనిస్తే ఆధునిక సాహిత్యవిమర్శయుగానికి ఎలా బలమైన ప్రాతిపదికలు

పడ్డాయో అవగత మౌతుంది. ఏ సాహిత్యవిమర్శకైనా భూమికగా నిలిచేది పరిష్కృతకావ్యపాఠం. దాన్ని సిద్ధంచేసే విమర్శవిధానాన్ని ఇంగ్లీషులో Textual Criticism అంటారు. తెలుగులో దీన్ని పాఠపరిష్కారవిమర్శ అనవచ్చు. దీనికి రూపం దిద్దిన మనీషి బ్రౌన్. ఆ తరువాత ఆంధ్రపండితు లెందరో ఆ మార్గాన్ని ఘంటాపథం చేశారు. దీనికి విశేషకంగా నిలిచేది కవుల చరిత్ర నిర్మాణం. దానికి వీరేశలింగంగారు ప్రాణప్రతిష్ఠ చేశారు. జయంతి రామయ్య పంతులు వంటివారు ఆ బాటలో నడిచారు. కవి జీవితానికీ, కావ్యరచనకూ ఉన్న సంబంధాన్ని పరిశీలించేది కవిసాహిత్య వ్యక్తిత్వవిమర్శ (Biographical Criticism). ఇందులో కవియొక్క భౌతిక, మానసిక, తాత్త్విక జీవిత విశేషాలను విశ్లేషించి, అవి కావ్యరచన కెలా దోహదాలై నిలిచాయో పరిశీలించే ప్రవృత్తి ప్రధానంగా ఉంటుంది. మానవల్లివంటి పండితు లీపద్ధతికి నారు పోసి నీరు పోశారు. దీనికి ఆనటబానటగా నిలిచేది చారిత్రకవిమర్శ (Historical method of Criticism). కవికాల నిర్ణయాలు, గ్రంథపౌర్వాపర్యచర్చలు, కవి జన్మస్థల చర్చలు, పూర్వకవుల ప్రభావపరిశీలనాలు, అనంతరకవుల అనుసరణ వివేచనాలూ మొదలైనవి యీశాఖలో పండే ఫలాలు. దీనికి అనుబంధంగా సాగేది తులనాత్మకవిమర్శ (Comparative Criticism). ఒక్కొక్క ప్రక్రియలో వెలువడుతున్న కావ్యాల సాహిత్యప్రమాణాలను నిరూపించటానికి ఈ విమర్శ నికషోపలంలా పనికివస్తుంది. దీనికి సమాంతరంగా సాగేది లాక్షణిక విమర్శ (Judicial Criticism). లక్షణగ్రంథాల్లో నిర్దేశింపబడిన ప్రమాణాలకు అనుగుణంగా కావ్యార్థాలను లక్ష్యలక్షణసమన్వయమార్గంలో విమర్శించే పద్ధతి యిది. వేదం వేంకటరాయశాస్త్రిగారివంటి పండితవిమర్శకు లీమార్గాన్ని పోషించారు దీనివెంట ఖండన మండనలు, శబ్దార్థసాధుత్వచర్చలూ, తర్కమీమాంసలూ, అలంకారచర్చలూ, మొదలైనవి బయలుదేరి, సాహిత్యవిమర్శను సిద్ధాంత రాద్ధాంతరంగంగా మార్చివేశాయి. ఇవన్నీ కందుకూరి వీరేశలింగం యుగంలో సాహిత్యవిమర్శ చేసిన సాముగరిడీలు. అయినా యీయుగ చైతన్యం సాహిత్యవిమర్శ కిచ్చిన వరాలు ఐదు. 1. పరిశోధన ప్రవృత్తి 2. చారిత్రకస్పృహ 3. సాహిత్యచరిత్ర నిర్మాణప్రయత్నం. 4. లాక్షణిక విమర్శ దృక్పథం 5. తులనాత్మకవిమర్శవివేకం. ఇవి సాహిత్యవిమర్శకు చేవను కల్పింపగలవే కాని జీవితాన్ని ప్రసాదించలేవు. విమర్శకు జీవితాన్ని ప్రసాదించింది కట్టమంచిరామలింగారెడ్డిగారు.

సజీవ సాహిత్య విమర్శ :

"Literary Criticism is an art about art" అన్నాడు వాల్టర్ పేటర్ ఈఅనుభూతిని సాహితీజగత్తుకు అందించిన ఆధునికసాహిత్యవిమర్శకుడు డా॥ కట్టమంచి. ఈయన సాహిత్యవిమర్శలోని అనుశీలనలక్షణాన్ని అభివ్యక్తీకరించాడు. అది ఆనాటికి క్రొత్తప్రయోగం. కాబట్టి, కట్టమంచివారు కావ్యానుశీలన యుగాన్ని (Age of evaluative Criticism) ప్రవర్తింపచేశా రనవచ్చును.

కట్టమంచివారి కవిత్వతత్త్వవిచారం విమర్శలోకాని కొక కనువిప్పును కలిగించింది. అంతకుపూర్వం కావ్యాన్ని విశ్లేషించే విధానం ప్రచారంలో ఉండగా, వారాగ్రంథంద్వారా కావ్యానికి విలువకట్టే విధానం విమర్శలో ప్రవేశపెట్టారు; చారిత్రకస్పృహకంటె సాహిత్యమీమాంసాస్పృహను విమర్శ కెక్కువ నేర్పారు; పాశ్చాత్యప్రయోగాలను ప్రాచీనాంధ్ర కావ్యానుశీలనంలో ప్రయోగించి విమర్శప్రస్తారాన్ని సాగించారు. ఈ అభినవదర్శనంలో సజీవవిమర్శ అవిర్భవించింది. కావ్యంలో ఆత్మభూతమైన కవితాతత్త్వం కేంద్రంగా కావ్యనిర్మాణాన్ని వివేచించాలన్న వివేకం కట్టమంచివారు తెలుగు విమర్శకు నేర్పారు. అనుశాసనంకంటె అనుశీలనం ఆధునికవిమర్శకు అనువైనపద్ధతి యని ఆయన ప్రయోగం స్పష్టంచేసింది.

కట్టమంచివారు తెలుగుకు సృజనాత్మక విమర్శను చవిచూపించారు. తెలుగులో కావ్యలక్షణాన్ని ఆలోచించే అలవాటు చేశారు. ఆయన ఎంతటి ఆంగ్లభాషాపండితుడో అంతటి ఆంధ్రభాషాభిమాని. తెలుగులో మాట్లాడితే పొల్లుకైనా ఇంగ్లీషుపదం దొర్లేది కాదు. ఆయన విమర్శకూడా ఆ లక్షణాన్ని అలవరచుకొన్నది. తన విమర్శకు ప్రమాణాలన్నీ చాలవరకు ఆంగ్లసాహిత్యంలో నుండి తెచ్చుకొన్నవే. కానీ, అవి ఎరువుతెచ్చుకొన్నట్లుండవు. విజాతీయాలుగా తోచవు. వారు కావ్యానుశీలనంలో ప్రమాణాలుగా ఉపయోగించే భావనాశక్తి (Imagination), వస్త్వైక్యం (Unity of Plot) మొదలైనవి విదేశీయాలైనా విశ్వజనీనాలుగా వారి విమర్శలో భాసించాయి. పాశ్చాత్యప్రమాణాలను వివరింపవలసివచ్చినప్పుడు ఆయనరచనలో లక్షణవాక్యాలు దొర్లుతాయి. కాని, అవి అనువాదాలుగా అనిపించవు; లక్షణంకోసమే చెప్పినట్లుండవు. అనుశీలనంలో ఉపకరించే వివేకవీచికల్లా భాసిస్తాయి. అందువల్ల విమర్శకు శాస్త్ర

రూపంకంటె కళారూపం అధికంగా అలవడింది. కళాగౌరవాన్ని పొందిన విమర్శయే సజీవసాహిత్యవిమర్శ.

**అనుశీలనంలో ఆత్మాశ్రయధోరణి :**

అనుశీలనం (Evaluative Csiticism) లో ఆత్మాశ్రయధోరణిని సంవదించటం కట్టమంచివారి ప్రత్యేకత. ఒకమహాకవిరచనను ఒకవిమర్శకుడు చదివినప్పుడు అతనిపై ఆ కావ్యం వేసే ప్రభావాన్నీ. అతనిలో కలిగించే అనుస్పందనను ఆశ్రయించుకొని అతడు చేసే కావ్యానుశీలనాన్ని ఇంగ్లీషులో Impressionistic Criticism అంటారు. తెలుగులో దీన్ని 'అభిరుచి విమర్శ' అనవచ్చు ననుకొంటున్నాను ఆంగ్లంలో ఈ విమర్శశాఖకు ప్రవర్తకుడైన వాల్టర్ పేటర్ దాని స్వరూపస్వభావాలను వివేచిస్తూ విమర్శకుని కావ్యానుశీలనంలో నిర్దుష్టమైన సాహిత్యసౌందర్యసిద్ధాంతా లున్నా లేకపోయినా, అతనిదైన ఒకప్రత్యేకదృక్పథం ఒక మనస్తత్వం కొట్టవచ్చినట్లు కనపడుతుండాలనీ, అయితే మౌలికంగా అతడు సౌందర్యసందర్శనంలో తన్మయుడయ్యే సాత్త్వికసహృదయుడై ఉండాలనీ పేర్కొన్నాడు. ఈ శాఖలో కవి యెంతటివాడో విమర్శకుడూ అంతటివాడు కావచ్చు. ఇరువురికి వారివారి దృక్పథాలు ఉండవచ్చు. కవియొక్క అభిరుచి విమర్శకుని అభిరుచితో సంవదింపకపోతే యీ విమర్శలో కవి విమర్శకు గురికావచ్చు. విమర్శకుని దృక్పథమే యిందులో పరమప్రమాణం. అందువల్ల అనుశీలనంలో ఆత్మాశ్రయధోరణి ప్రసరించి అభిరుచి విమర్శ రూపుదిద్దుకోవచ్చును. కట్టమంచివారిపట్ల అచ్చంగా జరిగింది ఇదే.

కట్టమంచివారిది పాశ్చాత్యదృక్పథం. ఆయన ప్రధానంగా పరిశీలించింది పాశ్చాత్యదృక్పథం లేని ప్రాచీనాంధ్రసాహిత్యం. అయితే, ప్రాచ్యపాశ్చాత్య కావ్యలక్షణాలలోకూడా విశ్వజనీనాలైనవి కొన్ని ఉంటాయి. ప్రక్రియలనుబట్టి సాపేక్షప్రమాణాలు కొన్ని మారవచ్చు. పురాణాన్నీ, ఇతిహాసాన్నీ, కావ్యాన్నీ, ప్రబంధాన్నీ, భావకవిత్వాన్నీ - అన్నింటినీ ఒకేదృక్పథంతో విమర్శించలేము. కట్టమంచి తనదైన సాహిత్య సంస్కారంతో ప్రాచీనకావ్యాలను, ప్రబంధాలను, అనుశీలించి విలువలుకట్టే ప్రయత్నంచేశాడు. ఆయనకు ప్రమాణాలు పట్టినంతగా ప్రక్రియలు పట్టలేదు. పాశ్చాత్యకావ్యలక్షణప్రమాణంతో ప్రాచీనాంధ్ర కృతులను ప్రక్రియావివక్షలేకుండా అనుశీలించి, గుణదోషవిచారం చేశాడాయన. అందువల్ల కవిత్వతత్త్వ విచారం కావ్యానుశీలనంలో అంతర్దృష్టిని ప్రవేశపెట్టినా, ప్రక్రియల ప్రత్యేకప్రతిపత్తిని వివేచింపలేక కావ్యతత్త్వానుశీలనంలో

విచక్షణను కోల్పోయింది. అభిరుచివిమర్శప్రసర్శవలన కలిగిన ప్రభావమే యిది. అభిరుచివిమర్శ ఆత్మాశ్రయధోరణితో సంవదించటంచేత వినేవారికి వింతరుచులను కలిగిస్తుంది. కాని, విశ్వజనీనతను సర్వత్రా సాధింపలేదు.

అనటోల్ ఫ్రాన్స్ (Anatole France) ఈ అభిరుచివిమర్శను "మహాకావ్యాలమధ్య మానవాత్మచేసే మహాసాహసప్రస్థానం" (The adventures of a soul among master - pieces) గా అభివర్ణించాడు. కట్టమంచివారు చేసింది కూడా ఇదే.

శిల్పానుశీలనయుగం :

పాశ్చాత్య విమర్శోద్యమాలలో- అభిరుచివిమర్శలో నున్న ఆత్మాశ్రయధోరణులవలన కలిగే అనర్థాలను తొలగించటానికి ఐ. ఏ. రిచర్డ్స్ మొ॥ ఆంగ్ల విశ్వవిద్యాలయాచార్యులు ప్రసరించిన విమర్శపద్ధతి Practical Criticism. ఇందులో కావ్యానుశీలనం వస్త్వాశ్రయరీతి (Objective method) ని అనుసరించి వర్తిస్తుంది. అందువలన విశ్వజనీనతను భజిస్తుంది. Cox and Dysen మాటల్లో "It (Practical Criticism) is an opening up of the poem or what it can really be for us: aunique and fascinating experience, carefully wrought by its maker, and fully available only to those with the patience, as well as the sensibility, to recreate. It makes our pleasure more articulate and therefore more meaningful. Emotion is enriched and extended by the exercise of thought." విశ్వనాథ సాహిత్యవిమర్శ యీలక్ష్యంతో సాగింది. కట్టమంచివారి ఆత్మాశ్రయధోరణికి అడ్డుకట్ట వేసింది; వస్త్వాశ్రయపద్ధతి ననుసరించి విశ్వజనీనతకోసం శిల్పమార్గాన్ని ప్రసరించింది. ఆంగ్లంలోని Practical Criticism ధోరణిని ఆంధ్రంలో శిల్పానుశీలనంగా విశ్వనాథ మలచి తన యుగాన్ని తాను సృష్టించుకొన్నాడు. ఆధునిక సాహిత్యవిమర్శలో విశ్వనాథది సాహిత్యశిల్పప్రస్థానం.

విశ్వనాథ - విశ్వజనీనత :

విశ్వనాథ ప్రసరించిన సాహిత్యశిల్పానుశీలనప్రస్థానానికి ఉన్న ప్రత్యేకత ఏమిటి ? - ముందు శిల్పం అంటే ఏమిటని తెలుసుకోవాలి. డా॥ పాటిబండ మాధవశర్మగారి మాటల్లో- "శీలధాతునిష్పన్నము లైన శీలము, శైలి, శిల్పము తరతమభావమున నేకార్థకములే, అనంతజన్మాభ్యాస సంస్కారము శీలము.

శీలమే స్వార్థంబున శైలియగును. ఇహజన్మాభ్యాససంస్కారము శిల్పము మహర్షులయందు శీ మైనది. మహాకవులయందు శిల్ప మగుచున్నది. అప్రయత్న ఫలసిద్ధి శీలమూలకము, సప్రయత్నఫలసిద్ధి శిల్పమూలకము. "లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే; ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోను ధావతి" అని భవభూతి మహాకవి చెప్పినట్లు ఆద్యులైన మహర్షులకు శీలవశమున వాక్కు నంటి యర్థము పరుగెత్తును, లౌకికసాధువులైన మహాకవులకు శిల్పవశమున నర్థమునకు అనుకూలముగ వాక్కు వర్తించును" కాబట్టి కవిచేత సప్రయత్నంగా కావ్యంలో శిల్పీకరించబడిన కావ్యార్థాలను వివేచించి, కావ్యపరమార్థవ్యంజకాలుగా అవి ఎలా సంపదింపబడినాయో నిరూపించే సంయమన సాహిత్యవ్యవసాయం ఈసాహిత్యశిల్పసమీక్ష. "కావ్యము శిల్పముతో కూడినది. శిల్పశక్తి తగ్గని యేకావ్యమైనఁ బరిగ్రాహ్యమే యగును. పాశ్చాత్య మహాకావ్యములు శిల్పభూము లగుటచేతనే యచ్చటి మతసంప్రదాయాది విషయములు మనవి కాకపోయినను వానిని బరిగ్రహించుచున్నాము. రచయితల కాశిల్పదృష్టి తగ్గనిచో కావ్యము కావ్య మగును. శిల్ప మక్షరమునొద్దనుండి కావ్యమహార్థాంత మనుస్యూత మైన విషయము. ప్రపంచ మెంత యనంతమైనదో, ఎంత వివిధమైనదో కవితావిద్య యంత యనంతమైనది; యంత వివిధమైన" దని విశ్వనాథ తన శిల్పదృష్టిని పేర్కొన్నారు.

ప్రాచ్యప్రాశ్చాత్యసిద్ధాంతాల కూడలిభూమి, సమన్వయక్షేత్రం విశ్వనాథవారి శిల్పప్రస్థానం. ప్రాచ్యలాక్షణికుల రసాలంకారధ్వనిసంప్రదాయాలను, పాశ్చాత్యులకథానిర్మాణపాత్రపోషణాది పద్ధతులను కావ్యమహార్థ వ్యంజకాలుగా రచనాంగాలను సమన్వయించేపట్ల విశ్వనాథ నిపుణంగా శిల్పప్రస్థానంలో సార్థకంగా సంవదించి చెప్పారు. అధునాతనాంధ్రసాహిత్యవిమర్శకక్షేత్రంలో కావ్యశిల్పసమీక్ష ప్రాణభూతంగా ప్రవర్తిల్లుతున్నది. దానికి కారణం విశ్వనాథ శిల్పప్రస్థానం సాహిత్యదర్శనంలో సాధించిన విశ్వజనీనతయే.

విశ్వనాథశిల్పదృష్టి ఆయన చేపట్టిన సర్వసాహిత్యప్రక్రియలలోనూ సారభూతంగా ప్రత్యక్షమౌతుంది. రసభావవిమర్శనమే ఆయనకావ్యకళాశిల్పం. విశ్వనాథ కావ్యకళకూ, విమర్శనకళకూ ఒకప్రధానభేదాన్ని గమనింపవచ్చును. కవితలలో, నవలలో కానవచ్చే వారి ఆత్మాశ్రయధోరణి విమర్శలో కానరాదు. వారి కావ్యశిల్పసమీక్ష కవిహృదయానుశీలనం చేస్తుంది; కావ్యపరమార్థాన్ని వివేస్తుంది. విమర్శలో విశ్వనాథ సహృదయవ్యాఖ్యాత. ప్రమాణబద్ధమైన అనుచి

శీలనం పఠితను రమింపచేస్తుంది. విశ్వనాథ కావ్యానుశీలనం విశ్వజనీనతను సంపదించుకోవటంచేత పఠితను విమర్శకునిలాగానే ఆలోచింపచేస్తూ కావ్యానం దాన్ని ఆలోచనామృతంగా అనుభవింపజేస్తుంది. కావ్యాత్మలో లయించిన విశ్వ నాథసాత్త్వికప్రవృత్తి సహృదయచిత్తవృత్తిలా జాలువారుతుంది. కట్టమంచి వారికంటె విశ్వనాథ సాధించిన విశ్వజనీనత యిది.

కట్టమంచివారినుండి విశ్వనాథ గ్రహించిన ఉత్తమవిమర్శ లక్షణం తెలుగులో కావ్యలక్షణాన్ని, కావ్యానుశీలనవిధానాన్ని ఆలోచింపచేసే ప్రవృత్తి. వీరిద్దరూ సాహితీసంస్కారాన్ని పండించుకున్న వ్యుత్పన్నులు. విమర్శ చేసేటప్పుడు పూర్వలాక్షణికుల వచనాలను, ప్రమాణాలనూ ఏకరువుపెట్టి కావ్యార్థాలను సమన్వయించే లాక్షణికవిమర్శమార్గం వీ రనుసరింపలేదు. విశ్లేషణ ప్రవృత్తి ఉన్నా విమర్శకు సృజనాత్మకశక్తిని వీరిద్దరూ సంపాదించిపెట్టారు. ఇది ఏకొద్దిమందికో అలవడ్డ దొడ్డగుణం.

ఐక్యత - ఏకవాక్యత :

కావ్యానుశీలనానికి సమన్వయం, విలువకట్టటం అనేవి రెండు పాదాలు. వాటితోనే అది ముందుకు సాగుతుంది. కట్టమంచి అభిరుచి విమర్శపద్ధతి విమర్శ గతియొక్క స్వేచ్ఛను అవరోధిస్తుందేది, మచ్చుకు ఒక ఉదాహరణ చాలు. వస్తువులో ఐక్యత ఉండాలని కట్టమంచివారి దృక్పథం. అది కళాపూర్ణోదయానికి వర్తించినంతగా మనుచరిత్రకు సరిపోదు. అందువల్ల మనుచరిత్ర కథాశిల్పం లేనికావ్యం అనిపించవచ్చు. అలాగే అముక్తమాల్యద అతుకులబొంత కావచ్చు. విశ్వనాథ ఈ దృక్పథాన్నికాదంటాడు. ప్రతిప్రక్రియనూ, ప్రతిరచననూ కవి యేర్పరచుకొన్న సాపేక్షప్రమాణాలతో సమీక్షించటం శిల్ప మంటాడు. "ఏ భాషలో నైనను ప్రధానముగా సంస్కృతాంధ్ర భాషలయందు సర్వకావ్యముల నొకేదృష్టితో చూడరాదు. కవిత్రయమువారి రచనను చూచినట్లు ప్రబంధ కవుల రచన చూడరాదు" అని విశ్వనాథ హెచ్చరిస్తాడు. ఒకానొకకవి రచనను ఒకానొకవిధముగా చదువవలె ననెడి దృక్పథాన్ని ఆయన ప్రసారంచేశాడు. ప్రబంధకథకు ఐక్యతకంటె ఏకవాక్యత ముఖ్యమని ఆయన ప్రతిపాదించాడు. ఇలా పూర్వవిమర్శకుల్లోని మంచిని గ్రహిస్తూనే లోపాలను సవరించి. ఆంధ్ర సాహిత్యంలో వెలసిన వివిధప్రక్రియలను అనుశీలించేటప్పుడు అనుసరించవలసిన విమర్శకసూత్రాలను వివేచిస్తూ విమర్శసాగించాడు విశ్వనాథ. ఈదృక్పథం

అత్యంతాధునికవిమర్శకపద్ధతులలో విశ్వవ్యాప్తంగా సమాదరణీయం కావటం వారి విశ్వజనీనవిమరకు తార్కాణంగా నిలుస్తోంది.

విమర్శన ముకదర్శనం :

సాహిత్యవిమర్శకు సౌందర్యం, తత్త్వం అనేవి రెండుకళ్లు. ఈనేత్రద్వయంతో అనుశీలనం చేస్తున్నప్పుడు సమీక్షకు నిలిచేవి సౌందర్యతత్వత్తం, తత్త్వసౌందర్యం. ఈరెండూ కావ్యపరమార్థంలో అద్వైతంగా భాసించి ఏకవాక్యతను భజిస్తాయి. విశ్వనాథ శిల్పప్రస్థానంలో ఈదర్శనం భాసిస్తుంది. "విమర్శనంలో దర్శనం అంతర్భవిస్తుంది. ఇది తాత్త్వికసత్యం కూడా. విమర్శనం పెద్దవృత్తమైతే దర్శనం దాని కడుపులోని చిన్నవృత్తం. విమర్శకుడు దాన్ని మరింత పెద్దదిచేసి చూపుతాడు. అదియే కవియొక్క విరాట్స్వరూపదర్శనం. దానికి పాఠకుడు సంసిద్ధుడై ఉండాలి. అంటే 'అధికారం' సంపాదించి ఉండాలి. పండితార్థమేమంటే విమర్శనంకూడా దర్శనమే." దర్శనం ఉత్తమ విమర్శ లక్షణం; వివేచనం మధ్యమవిమర్శ లక్షణం; విశ్లేషణం సామాన్యవిమర్శ లక్షణం. గమ్యం తెలిసి చేసిన ప్రస్థానం విశ్వనాథవిమర్శవిధానం.

ప్రయోగాలు - ప్రస్తారాలూ :

విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన విమర్శగ్రంథాలు ప్రధానంగా ఇవి— 1. నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి 2. అల్లసానివాని అల్లిక జిగిబిగి 3. ఒకడు నాచనసోమన్న 4. కావ్యపరీమళము, 5. సాహిత్యసురభి 6. విశ్వనాథ సాహిత్యోపన్యాసములు 7 శాకుంతలముయొక్క అభిజ్ఞానత 8 కావ్యానందము 9. కల్పవృక్ష రహస్యములు 10. నారాముడు 11. What is Ramayana to me? ఇవికాక ఎన్నో వ్యాసాలూ, పీఠికలూ, ఉపన్యాసాలూ ఉన్నాయి. ఒకవిమర్శకుడుగా సాహిత్యక్షేత్రంలో తనస్థానాన్ని సంపాదించుకోవటానికి పైరచనలు చాలు.

వీరి విమర్శగ్రంథాలలో శిల్పానుశీలనానికి అన్నీ ఉదాహరణములైనా ప్రతిరచనకు ఒక ప్రత్యేకత కనుపడుతుంది. తెలుగులోని మహాకవులు రచించిన గ్రంథాలలో ప్రతిదానికీ ఒక ప్రత్యేకత ఉన్న దన్న స్పృహ విశ్వనాథ విమర్శ వలన ఏర్పడుతుంది. నన్నయ కవితాగుణాలకు పట్టిన వైజయంతిక వారి నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి. ఇతిహాసకథాశిల్పం, కావ్యకథా

శిల్పం, ఉపాఖ్యానశిల్పం - అనేక కథార్థాల నాశ్రయించి ఎలా వైవిధ్యంతో భాసిస్తాయో ఈ గ్రంథం చదివితే తేటపడుతుంది. సంవిధానం, పాత్రపోషణం, భావికథార్థధ్వని, ప్రసన్నకథార్థప్రక్రియ మొదలైన సూక్ష్మశిల్ప విశేషాలేకాక శైలికి, పదప్రయోగశక్తికి, వాక్యరచనా విచ్ఛిత్తికి ఎలా వ్యాఖ్యానం చేయాలో స్పష్టమౌతుంది. వీటినిమించి వస్తుధ్వని రసధ్వనిలో పర్యవసించే వైఖరి సరళ సుందరముగా ఈ గ్రంథంలో అభివ్యక్తీకరింపబడినది. కథాకథనశిల్పరహస్యా లను విశ్వనాథ వివరిస్తున్నప్పుడు ఆనందవర్ధనునినుండి ఆంగ్లవిమర్శకులదాకా కావ్యశిల్పానుశీలనం పాటించే ప్రక్రియలు పరమధ్యేయంగా, సరళసుందరంగా సంవదింపబడటం విశేషం. ఆదికవి నన్నయ కవితాగుణాన్ని ఆధునిక వివేచ నంతో వ్యక్తీకరించిన శిల్పప్రస్తారం ఈ గ్రంథం.

'అల్లసానివాని అల్లికజిగిబిగి' అన్నది ప్రసిద్ధికెక్కిన ఒక లక్షణసూక్తి. దాన్ని సార్థకంగా సమన్వయించిన ప్రతిభ విశ్వనాథదే అని చెప్పాలి. ప్రబంధ కథకు ఏకవాక్యత ముఖ్యమని చెప్పే వివేచనం భారతీయులసంప్రదాయసారం. ఆకథ కిచ్చిన సమన్వయం ప్రతీకాత్మక విమర్శకు (Symbolic Criticism) మచ్చుతునక. సాహిత్యసిద్ధాంతాలను కథలో ప్రతీకాత్మకంగా ప్రపంచించే ఆంధ్రకవితాపితామహుని కావ్యశిల్పాన్ని విశ్వనాథవారు శిఖరప్రాయంగా చిత్రిం చారు. జీవశాస్త్రసంబంధి సమన్వయం పింగళివారు సాధిస్తే జీవసంస్కార పరి ణామ సిద్ధాంతాలమీద ఆధారపడిన తాత్త్విక వ్యాఖ్యానంచేసి విశ్వనాథ తనవ్యక్తి త్వాన్ని ప్రదర్శించారు.

నాచనసోముడు విశ్వనాథవారి అభిమానకవులో ఒకడు. అతని ప్రత్యే కత సంవిధానచక్రవర్తిత్వంగా ఎలా భాసిస్తుందో వారు నాచనసోము డొక్కడన్న గ్రంథంలో నిరూపించారు. విష్ణుపారమ్యాన్ని వ్యంజింపజేసే కథాకదంబాన్ని ఎన్నుకోవటంలోనూ, వాటి నిర్వహణంలోనూ, జ్యోతిషాదిశాస్త్రమహార్థాలను ప్రతీకాత్మప్రవృత్తితో ప్రతీయమానం చేయటంలోనూ, శైలీవైశిష్ట్యంలోనూ నాచనసోముని కవితాశక్తిని విశ్వనాథవారిందులో వ్యక్తీకరించారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొదలైనవారు నాచనసోముని కవితారీతికి ఉత్తమతాంబూ లాన్ని యిచ్చారు. విశ్వనాథ ఆ కావ్యాన్ని పరమవ్యంగ్యమైన పరమార్థప్రతి పాదనదృష్టితో సమీక్షించి నాచనసోముని ప్రత్యేకస్థానాన్ని ప్రతిపాదించారు ప్రతీకాత్మకవిమర్శ కీ గ్రంథం మరో మణిదర్పణం.

నన్నయ నాచన సోములనుగూర్చి మరికొన్ని వ్యాసాలుకూడా వ్రాశారు. అవి ఈ గ్రంథతాత్పర్యాలకు ఆమ్రేడితాలు.

కావ్యపరీమళం ప్రాచీనకావ్యసమీక్షలైన వ్యాసాలసంపుటి. మనుచరిత్ర, పాండురంగమాహాత్మ్యం, పారిజాతాపహరణం, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, కాశీఖండం, భీమఖండం, హరవిలాసం, భీమేశ్వరపురాణం, శ్రీకాళహస్తి మాహాత్మ్యం, ఉత్తరహరివంశం, విజయవిలాసం- అనే కృతులమీది విమర్శన మిందులో ఉంది. ఆయాగ్రంథాలలోని ప్రసిద్ధపద్యాల నెన్నుకొని వాని శిల సౌందర్యాన్ని సంవర్ణించటం ఈగ్రంథనిర్మాణస్వభావం వ్యాఖ్యలకు శిల్పాను శీలన మనే అభినవావతారాన్ని విశ్వనాథవా రిందులో ప్రపంచించినారు. కావ్య విమర్శతోపాటు కావ్యాంగవిమర్శ ఎలా ఉండాలో నిర్దేశించే ప్రయోగమిది. ఆంగ్లంలోని Practical Criticism లో కావ్యాంగవిమర్శ ప్రధానాంశం. దానికి శిల్పమార్గం చూపించారు తెలుగులో.

కావ్యానుశీలనం చేస్తూ కళామయంగా కావ్యలక్షణాలను రవ్వల్లా కురి పించే ప్రజ్ఞ యీప్రక్రియలో ప్రకాశిస్తుంది. కావ్యశిల్పాస్వాదన కనువైన మధు బిందువు లీ పద్యశిల్పవ్యాఖ్యలు. భారత భాగవతాలలోని ప్రసిద్ధ పద్యాల కిలాగే ప్రపంచించిన పద్యవ్యాఖ్యలతో 'సాహిత్యసురభి' కూర్పబడింది. వృత్తిరీత్యా ఉపాధ్యాయుడై, ప్రవృత్తిరీత్యా మహాకవియైన విశ్వనాథ ప్రాచీనకవుల కావ్యాల లోని రహస్యాలను విప్పిచెప్పే రసవ్యాఖ్యాప్రవృత్తి ఈ సంకలన సంపుటాల్లో సమృద్ధిగా ఉంది.

విశ్వనాథ రసయోగి. రససిద్ధాంతానికి రమణీయ నాటకాకృతి కల్పించిన కాళిదాసు శిల్పమర్మాలను వెలికితీసే విమర్శనం 'శాకుంతలముయొక్క అభిజ్ఞా నత'. నామసార్థక్యంనుండి అంతఃకరణచైతన్యం వరకూ సాగిన రసతత్త్వాను శీలనం ఇందులో గమనింపదగింది. శాపవిస్మృతివలన దుష్యంతుడు పొందే వేదనలో, జన్మాంతరవాసనాబలంతో జీవుడు పొందే వేదనయొక్క వైచిత్రిని అభినవగుప్తుని సిద్ధాంతా న్ననుసరించి ప్రస్తరించి, రసనిష్పత్తి సూత్రానికి శిల్పవ్యాఖ్యానం చేసి చూపించారు. ఇందులో నాటకరచనాశిల్పంలోని ధ్వనిని నిరూపిస్తున్నప్పుడు సౌందర్యతత్త్వం, రసభావతత్త్వాన్ని వ్యాఖ్యానిస్తున్నప్పుడు తత్త్వసౌందర్యం వీరి విమర్శలో ప్రసరిస్తుంది. తత్త్వగంభీరమైన ఈ విమర్శ శిల్పమార్గానికి శిఖరప్రాయం.

విశ్వనాథవారి 'కావ్యానందం' వర్ణనాత్మక లక్షణగ్రంథం. ఆనందత్రయం ఆభాస అనీ, అబద్ధ మనీ భావించే భౌతికవాదుల సాహిత్యదృక్పథాలు ప్రబలుతున్న ఆధునికజగత్తుకు అలంకారశాస్త్రమర్యాదలను సౌందర్యశాస్త్రసమాలోచనంగా సమర్పించిన ప్రస్తార మీగ్రంథం. ఇది వారిప్రణాళికలో మొదటిసంపుటం. మరోమూడుసంపుటాలు పూర్తికాకుండానే విధి వారిని మనకు దూరంచేసింది. సూత్రలక్షణగ్రంథాలకంటె విలక్షణంగా, వివిధాంశాలపై ఆలోచనధారగా సాగిన ఈప్రక్రియ వర్ణనాత్మకలక్షణగ్రంథం అనటం న్యాయం.

విశ్వనాథ రసానుశీలనప్రవృత్తికి ప్రత్యక్షసాక్ష్యంగా నిలిచేవి వారి సాహిత్యోపన్యాసాలు.' ఇందులో మొదటివ్యాసం 'కాళిదాస భవభూతులు.' ఇది తులనాత్మకవిమర్శ. విమర్శకులెందరో భవభూతి ఉత్తరరామచరిత్ర వ్రాసి కాళిదాసును మించాడని భావించటం పరిపాటి. విశ్వనాథవారు మాలతీమాధవప్రకరణంతోనే ఆపని సాధించాడని నిరూపించటం ఇందులోని విశేషం. ఉభయకవుల రచనాశిల్పరహస్యాలకు ఈ వ్యాసం భద్రపేటిక. ఇటువంటి తులనాత్మక పరిశీలనమే మహాభారత రామాయణకథాస్వభావాల నాశ్రయించి మరోవ్యాసంలో చేశారు. విశ్వనాథవారు 'శాంత కరుణరసాల' ను గురించి వ్రాసినవ్యాసం భావుకుడైనవాడు రసతత్త్వవిచారం చేస్తే ఎలా ఉంటుందో దానికి ప్రమాణప్రాయంగా కనపడుతుంది. శాకుంతలం శాంతరసప్రధాన మనీ, ఉత్తరరామచరితం కరుణరసప్రధాన మనీ ఇందులో తేల్చారు. రసవిమర్శ ఎంతో గంభీరమైంది. విశ్వనాథ దాని లోఅంచులు చూచే ప్రజ్ఞ కలవాడు. కానీ, కొన్నిచోట్ల అనుభూతి ఒకత్రోవా, ఆలోచన మరోత్రోవా సాగినప్పుడు రసనిర్ణయం మనస్సుకు నచ్చకపోయినా మేధకు మేతవేయవచ్చునన్న సత్యాన్ని విశ్వనాథవారివ్యాసాల్లో ప్రదర్శించా రని అనిపిస్తుంది. వా రెత్తుకొనే విషయాలన్నీ మహావిషయాలే. కొంతదూరం ఆలోచనతో మనలను తీసికొనివెళ్ళి 'ఇదిమహావిషయ' మని వదలివేస్తా రొక్కొక్కసారి. అయినా, ఆమార్గాలను స్పృశించే మనీమలే తక్కువ. కొంతదూరమైనా ప్రస్థానం చేసిన, చేయించిన గౌరవం విశ్వనాథకు దక్కక మానదు.

విశ్వనాథ వ్రాసిన వ్యాసాలన్నింటిని గురించీ ఈచిన్నివ్యాసంలో సమీక్షించటం సాధ్యం కాదు. కాని, ఒక్క మాటమాత్రం నిస్సంశయంగా చెప్ప

వచ్చు. విశ్వనాథవిమర్శలో ఏదో ఒక క్రొత్తవెలుగు లేని రచనమాత్రం ఉండదు. ప్రతివ్యాసం ఒకదర్శనం, ఒక ప్రస్థానం.

రామాయణకల్పవృక్షంలోని శిల్పవిశేషాలూ, వ్యంగ్యాలైన మహార్థాలూ, రామకర్తృత్వాన్ని ఆయన దర్శించిన తీరుతెన్నులూ, తీర్చిదిద్దిన కావ్యార్థకల్పనలూ, రామాయణతత్త్వదర్శన విశేషాలూ వివరించేవి కల్పవృక్ష రహస్యములు, నా రాముడు, What is Ramayana to me. రామకథ నాశ్రయించుకొని భారతీయ కావ్యతత్త్వవివేచనం ఎన్ని ఎత్తుల కెక్కిందో, ఎన్ని ప్రస్థానాలు చేసిందో వాటి కన్నింటికి సంగమతీర్థంలా సారవివేకంగా నిర్మించిన మహాకావ్యం రామాయణకల్పవృక్షం. ఒకసంస్కృతి సజీవంగా నిలిచిన శిల్పాభిరామం. విశ్వనాథసాహితీవ్యక్తిత్వానికి పైమూడు రచనలు ముకురప్రాయాలు. కొండను మనం ఈ అద్దాల్లో చూడవచ్చు.

## విమర్శక చక్రవర్తి :

విశ్వనాథ శిల్పానుశీలనం ప్రతిభాశిఖి వంటిది. దానికి శిఖలెన్నో లెక్కపెట్టటం కష్టం. కాని, తెలుగు సాహిత్యవిమర్శ ప్రస్థానంలో తన యుగాన్ని కట్టమంచి తరువాత నిర్మించుకొన్న మహామనీషి ఆయన. ప్రతికవికి ఒక ప్రత్యేకప్రతిపత్తి ఉన్నదని ప్రతిపాదించిన ప్రతిభాపక్షపాతి ఆయన. ఒక్కొక్క ప్రయోగానికిఒక్కొక్క అనుశీలన మార్గం ఉన్నదని వివేచించిన వివేకమూర్తి ఆయన. తా నెంత ధిషణాహంకారి అయినా కావ్యానుశీలంలో తాను శిల్పారాధకుడుగా మారి ప్రాచ్యపాశ్చాత్య ప్రమాణాలకు సమన్వయాత్మకమైన సార్థక ప్రయోగాన్ని అనుశీలనంలో ఉన్మీలింపజేసిన ప్రౌఢ ప్రయోగకుశలు డాయన. శిల్పానుశీలన ప్రక్రియకు ప్రతీకాత్మక విమర్శను, తులనాత్మకవృత్తినీ, మానసిక స్వభావవిమర్శను, రసవ్యాఖ్యా ప్రవృత్తిని, వర్ణనాత్మక లక్షణగ్రంథ నిర్మాణ కౌశలాన్నీ అలవరచి, చేపట్టిన ప్రక్రియకు పరిణతరూపాన్ని కల్పించి తన వ్యక్తిత్వాన్ని విమర్శకలోకంలో హిమవన్నగ సదృశంగా స్థాపించుకొన్న 'విమర్శక చక్రవర్తి' విశ్వనాథ.

విశ్వనాథ ప్రాచీనసాహిత్యాన్నే ప్రధానంగా అనుశీలించాడు. అట్లని సమకాలీనసాహిత్యాన్ని వదలిపెట్టలేదు. భావకవిత్వయుగంలో వెలసిన ఆధునిక

కృతులకు పీఠికలు వ్రాశాడు, అభ్యుదయకవిత్వ స్వభావాలను సమీక్షించి తన దృక్పథాన్ని స్పష్టంచేశాడు. ఆయన మెప్పు పొందటం ఒకగొప్ప అని భావిచారు సమకాలీనులు. ఆయన తిట్టినా ఒక గౌరవమనుకొన్నవారూ ఉన్నారు అధునికసాహిత్యవిమర్శ ప్రక్రియల్లోని మార్క్సిస్ట్ విమర్శ, సాంఘికవిమర్శ మొదలైనవి ఆయన చేయలేదు. అది ఆయనకు లోపం కాదు. శిల్పప్రస్థానం ఆయనది. అందులో శిఖర మాయన- ఒక శిఖరం మరో శిఖరానికి శిరస్సువంచకుండా ఉండటమే శిల్పాలలో కెల్లా శిల్పం!



# రాయప్రోలువారి మాధురీ దర్శనం

మహాకవిగా ఒకరిని గుర్తించటానికి మూడు ప్రమాణాలు ముఖ్యం: ఒకటి-ప్రక్రియ; రెండు: మార్గం; మూడు: దర్శనం. ఈమూడూ క్రమంగా స్థితికీ, గతికీ, మతికీ సంబంధించినవి. వీటిని సాహిత్యానికి అన్వయిస్తే- ప్రక్రియ ఆకృతికి సంబంధించినది; మార్గం రచనావిధానాన్ని ఆశ్రయించింది; దర్శనం వినూత్నదృక్పథాన్ని నిర్దేశించేది. సామాన్యంగా సాహిత్యరంగంలో మొదటి రెండు ప్రమాణాలకు అందే సత్కవు లెందరో కనపడతారు. క్రొత్తప్రక్రియను నూత్నమార్గంలో వెలార్చినా వారికి స్వీయదర్శనం ఉండదన్నమాట. మార్క్సిస్టు కవితను తీసుకుందాం. ఆ మార్గంలో రచనచేస్తూ ఒకకవి ఎంత ప్రక్రియావైవిధ్యాన్ని సాధించినా దర్శనంమాత్రం మార్క్సుదే అవుతుంది. అందువల్ల మార్క్సిస్టుకవి ఒకదర్శనానికి కవితాధర్మాన్ని నిలిపినవాడే అవుతాడు. అయినా, ఆతడు తనవిశిష్టరచనాశక్తితో భావికవికులానికి మార్గదర్శకుడై తేకవితాజగత్తులో మహాకవిగానే మన్నింపబడుతున్నాడు. ఇటువంటప్పుడు ఒకకవి ప్రక్రియలోనూ, మార్గంలోనూ నవ్యతను సాధిస్తూ తనదైన ఒకదర్శనాన్నికూడా సాహితీజగత్తుకందిస్తే, ఆదర్శానికి లక్ష్యాలుగా తనరచనలను రూపిస్తే, అతన్ని మహాకవుల్లో మహాకవి అనకతప్పదు. రాయప్రోలు సుబ్బారావుగారు పైనచెప్పిన మూడు ప్రమాణాలనూ పరిపూర్ణంగా సాధించిన మహాకవులు. అందువల్లనే నవ్యకవిత్వయుగంలో వారికి సమున్నతమైన ఆచార్యస్థానం ఏర్పడింది.

దర్శనం ఆలోచనానేత్రాలతో దర్శించిన అనుభవసత్యం. సత్యం ఎంత భౌతికమో అంత బౌద్ధికం. అనుభవంకూడా అంతే ఈఅనుభవాన్ని అవస్థనుబట్టి లౌకిక మనీ, అలౌకిక మనీ, ఆధ్యాత్మిక మనీ మూడువిధాలుగా విశ్లేషించవచ్చు. విభావాలనుబట్టి ఈవివేచనం ప్రాచుర్యంలో ఉంది వీటిలో అలౌకికానుభూతియే సాహిత్యక్షేత్రానికి సంబంధించింది. దానికి లౌకికానుభవం ప్రేరకం కావచ్చు. లౌకికం ఎప్పుడూ జీవితసంబంధి. జీవితానుభవం కళామయమైనప్పుడు ప్రాతిభాసికమై సహృదయులకు అలౌకికానుభూతి నందిస్తుంది.

మొదటిఅనుభవంలో లేని విశ్వజనీనత, ఆనందచిత్కళ రెండోదాంట్లో ఉంది. దీనినే సాహిత్యమీమాంసకులు రసానుభవం అంటారు.

దర్శనం తత్త్వసందర్శనం. సంశ్లిష్టాలైన అవస్థల్లోనూ, వ్యవస్థల్లోనూ అన్వయసూత్రంగా అంతర్లీనమైయున్న తత్త్వాన్ని వివేచనామధురంగా ఆవిష్కరించటం దర్శనం. దాన్ని ప్రయోగానుకూలంగా ప్రమాణీకరించటం సిద్ధాంతం. ప్రమాణసమ్యక్పరిశీలనం ఆలోకనం. దీనినే వివేచన మనీ, మీమాంస అనీ, విమర్శన మనీ ఎన్నో పేర్లతో పిలుచవచ్చు. ఆలోకనానికి అనువైన రమ్యరచనాభివ్యక్తి రచన, రచనా వైఖరికి రూపవైభవాన్ని సంతరించేది ప్రక్రియ. ఇవన్నీ రాయప్రోలు సాహితిలో అభినవంగా అవతరించాయి.

రాయప్రోలు దర్శనం మాధురీదర్శనం.
ఆయన సిద్ధాంతం అమలినశృంగారసిద్ధాంతం.
ఆయన ఆలోకనం రమ్యాలోకం.
ఆయనరచన అభినవకవితాపాకం.
ఆయినప్రక్రియ ఖండకావ్యప్రక్రియ.

రాయప్రోలువారి మాధురీదర్శనాన్ని అవగాహనం చేసికోవాలంటే అన్వేషణను సర్వాంగీణంగా నవదరించుకొన్న రమ్యాలోకాన్ని ముందుగా చదవాలి. ఆతరువాత వారి సిద్ధాంతానికి వృత్తిరూపంగా వెలసిన రూపనవనీతాన్ని మధించాలి. ఆతరువాత వారి కావ్యతత్త్వదర్శనంగా- మాకందాల్లాటి కందపద్యాలలో హృద్యంగా వెలసిన మాధురీదర్శనాన్ని మననం చేసికోవాలి. ఆపైన-లలిత, తృణకంకణం, అనుమతి, కష్టకమల, స్నేహలత, స్వప్నకుమారం మొదలైన కావ్యాలు చదివితే రాయప్రోలువారి సాహితీప్రస్థానం ఎలా క్రమవికాసాన్ని చెంది పరిణతిని సాధించిందో సహృదయలోకానికి ప్రసన్నమౌతుంది. ఒకమహాకవిని అధ్యయనం చేయటానికి ఒకక్రమంకూడా అవసరం।

## ఆధ్యాత్మిక దర్శనం: సాహితీ దర్శనం

రాయప్రోలువారు శృంగారరసతత్త్వాన్ని అభినవంగా దర్శించారు. ఇది విశుద్ధ సాహితీదర్శనం. ఈఅంశాన్ని ఆయన మొదట స్పష్టంచేశారు. లోకంలో ఆధ్యాత్మికదర్శనమనీ, సాహిత్యదర్శనమనీ రెండువిధా లున్నాయని పేర్కొని, ఆధ్యాత్మికదృష్టితో సాహితీతత్త్వాన్ని వివేచించే విధానాన్ని వేరుచేశారు. ఆధ్యా

త్మికదర్శనం చేసేవారు వేదాంతులు. వారు బుద్ధివాదులు. సాహితీదర్శనం చేసేవారు సహృదయులు. వారు హృదయవాదులు. శృంగారానికి స్థాయి అయిన రతిని సంభోగవిషయఇచ్ఛావిశేషంగా భావించటం సర్వదర్శనాల్లోనూ సామాన్యమైపోయింది. వేదాంతులు విరక్తులు కావటంచేత రతిస్థాయి యైన శృంగారాన్ని విషయోపభోగప్రధానంగా భావించి, తద్రసప్రధానాలైన కావ్యాలను గర్హించి 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అని శాసించారు. కాని, సాహిత్యోపాసకులుమాత్రం ఆనందవర్ధనాచార్యులవలె–

'శృంగార ఏవ మధురః పరఃప్రహ్లాదనో రసః
తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి'

అని సంభావించారు. రాయప్రోలువారుకూడ 'శృంగార ఏవ రసనా ద్రస మామనామః' అని విశ్వసించినవారే. కాని, వారు దాని కిచ్చే అన్వయం వేరు.

'రసములకు నెల్ల శృంగారరసము తల్లి
అనిరి పూర్వులు సంభోగ మవధిగాగ,
అక్షరానందసిద్ధి లక్ష్యముగ నెంచు
నవ్యులకు నది అప్రధానంబ యయ్యె' (రమ్యాలోకమ్- పుట 14)

'సంభోగవిషయ ఇచ్ఛావిశేషో రతిః'- వంటి లాక్షణికవాక్యాలు రతితత్త్వాన్ని తెలిసి చెప్పినవి కావని రాయప్రోలువారి అభిప్రాయం.

సంభోగేచ్ఛ సర్వజంతుసామాన్యం. దీన్ని కామమని వ్యపదేశించవచ్చు. కామం తనూసంగభోగావధిగా వర్తిస్తే అది పాశవికావస్థను దాటలేదని స్పష్టం. లోకంలోని నరనారీప్రవృత్తిలో కూడా ఇట్టి పాశవికకామం జంతులక్షణంగా ఉంది. కాని, మానవులు జంతువులకంటె వివేకవంతులు. వారు తమమనోవికారాలనూ, అంతఃకరణప్రవృత్తులనూ, వివేచించుకోగలరు. అలా వివేచింపగలిగినప్పుడు వారికామం రతి అవుతుంది. తనూసంగరూపమైన రతి మానవహృదయంలో భావమథనాన్ని కలిగించి, అంతఃకరణప్రవృత్తిని ఉన్మీలింపచేస్తుంది. జంతువు తనూధర్మంగా భావించే కామాన్ని, మానవుడు హృదయధర్మంగా భావించి రతిగా సంభావిస్తాడు. అప్పుడు రతిని నియతితో యోగిస్తాడు. ఆనియతి జీవనధర్మం. 'ప్రజాతంతుం మా వ్యవత్సేత్సీః' అన్న వేదసూక్తి ఆజీవన ధర్మమర్మం. సంతతికోసం స్త్రీపురుషులు దాంపత్యాన్ని భజిస్తారన్నది నరనారీ

లోకాన్ని పాలించే ధర్మసూత్రం. ఈసూత్రాన్ని విస్మరిస్తే నాగరకలోకం పతన మౌతుంది. ఇట్టిపతనావస్థకు బీజం- రతి అంటే సంభోగావధిగా భావించే ఇచ్ఛావిశేష మనుకోవటంలోనే ఉందని రాయప్రోలువారి నిష్కర్ష. దాంపత్యధర్మ విశిష్టమైన రతి ప్రజాతంతు కార్యసాధనలక్షితమై ఉదాత్త మౌతుంది; మానుష మౌతుంది."దాంపత్యగ్రహణంలో అవ్యక్తంగా ఒకమహాక్రతువు జరుగుతున్నదిం. పురుషుడు శిష్టాకైంకర్య మైన బ్రహ్మచర్యమును పరిత్యాగం చేస్తున్నాడు; స్త్రీ కూడా పితృగోత్రంతోపాటు తన అక్షయకన్యాసౌభాగ్యమును విసర్జిస్తున్నదిక ఉభయత్యాగభాగధేయమే దాంపత్యం. అది అపత్యరూపాదికంగా స్వాత్మావలోనకు సాధక మౌతుంది"- అంటారు రాయప్రోలువారు రూపనవనీతనంలో. దాంపత్యధర్మం త్రివర్గలక్షితమైంది. ఆలక్ష్యంతో సాగినప్పుడే పశుప్రవృత్తియైన కామం మానుషంగా మార్దవీకరింపబడి రతిభావస్థాయి నందుకోవటానికి అర్హమౌతుంది.

దంపతులమధ్య రతి సంభోగావధిగా పర్యవసిస్తే విరతి చెంది వికలమౌతుంది. అది సంచారి కావచ్చుగాని స్థాయి కాలేదు. అయితే, తత్కాల వయోవస్థల ననుసరించి, విషయోపభోగస్పృహగా భావించి, ఇంద్రియ మదనోద్వేగోపశాంతులను కలిగించవచ్చు. కాని నరనారీజనులు ఆ రతిభావ ప్రవృత్తిలోని మౌలికధర్మాన్ని సమాలోచించి, మనోనేత్రంతో అన్వేషించి, అనుశీలించాలి. పురుషుడు స్త్రీని గ్రహిస్తున్నాడు స్త్రీ పురుషుణ్ణి వరిస్తున్నది. వీరిరువురినడుమ రతి పెనవేసికొని ఉంది, తనూసంగం భౌతికఫలంగా పరిణమిస్తున్నది.కాని, వారిరువురి అంతఃకరణప్రేరితమైన ధర్మచైతన్యం సంతానఫలాన్ని సముపలక్షిస్తున్నది. అంటే- తన ప్రతిబింబాన్ని స్త్రీయందు సంతతిగా దర్శించాలన్న అవ్యక్తకామన పురుషునిలో జీవచైతన్యంలా రతియందు రాణించి ఆతని అంతఃకరణానికి ఒకమధురానుభూతిని అందిస్తున్నది. స్త్రీ కూడా పతివలనపొందే సంతతిని వాత్సల్యంతో లాలించాలన్న జీవచైతన్యస్పృహతో రతిని భజిస్తున్నది. దాంపత్యరతి సంతానఫలంతో కృతార్థ మౌతున్నది. సతికి పతి సుతుడై స్తన్యాన్ని త్రావి స్వాత్మానందసంధాయకు డౌతున్నాడు. పతికి సతి అతని ప్రతిబింబానికి మాతయై అవ్యక్తవాత్సల్యరుచులను అందిస్తున్నది. సంతానవంతులైన దంపతులకు రతి ఒకవాత్సల్యఫలసిద్ధికి కారణ మైన కాయికసవనానికి తోడ్పడిన హవిస్సులా భాసిస్తున్నది. ఆ సవనంలో సతీపతులు భాగస్వాములు.

నెచ్చెలులు. ఈ తత్త్వాన్ని సంభావించిన రాయప్రోలువారు ప్రేయసీప్రియుల ప్రణయానికి అభినవవ్యాఖ్యాన మిచ్చారు.— మచ్చుకు :

'ప్రియు కటాక్షించు సఖి యరవిందసదృశ
లోచనముల ఘూర్ణిలు కామవీచికలను
అణగి పెనవడు నార్ద్రిపుత్రార్థరక్తి
కొమ్మ కళుకులు ప్రసవమై కుదిరినట్లు'  (రమ్యాలోకమ్ ౩౭ పు.)

అంటే- దంపతిధర్మంలో హృదయవాదులు సంభావింపవలసింది సంభోగ పర్యంతమైన రతిని కాదు. సంతానఫలరూపంగా తమరతి పర్యవసించాలన్న మానుషమైన వారి అంతఃకరణభావచైతన్యాన్ని. అప్పు డది ఇంద్రియావరణాతీతమైన సత్త్వచైతన్యభావంగా పరిఢవిల్లుతుంది. నవ్యులు సంభోగావధి కాని రతిని అక్షరానందసిద్ధిగా భావిస్తారనటంలోని రాయప్రోలువారి తాత్పర్య మది. దీన్ని మానుషమైన రతిగా పేర్కొన్నారు వారు. దానినే ప్రేమగా సంకేతించారు. అదే వత్సలంగా రూపొందితే సుమానుష మౌతుందని దర్శించారు.

ఈ పరిణామాన్ని స్త్రీపురుషుల అనుభవమే ప్రమాణంగా ప్రపంచించి చూపించారు కూడా. "అపత్యగంధిదళనంతో ఆడుదానికి పాణిగ్రహణవ్రతం ఫలిస్తున్నది. తోడ్తో ఆమె చైతన్యమే పరివర్తన పొందును. అతీంద్రియ మైన ఒక అమృతస్పృహ చిగిరించును. తాను వరించి, పరిచరించిన ప్రాణేశ్వర స్వరూపమే ప్రచ్ఛన్నంగా శిశురూపమై భాసించు భాగ్యమును గుర్తించును. ఇంతేకాదు శారీరకంగా కలిగే పరిణామంకూడా మహత్తర మైనదే. బహుమాస కఠోరభారధారణ తరువాత కాని, ఆ తరువాత కాని, ప్రసవవేదనావిద్ధ మైతేనే కాని తనుకాండలో స్తన్యసముత్పత్తి కావటంలేదు. అచేతనప్రాయ మైన సోమలత రసీభవించటానికి ఎంతో మంత్రతంత్రక్రియాకల్పము విధాయక మైంది. ఇక సచేతనమైన శరీరబంధంనుండి స్తన్యస్రవణం కావటానికి ఎంతటి ఉల్లోల కల్లోలము జరుగునో ఊహింపవచ్చును. ఈలాగా బరువు మోసి, జీవధారాపూర్వకమైన స్తన్యదానం చేసే సుకృతి ఏకైకంగా నారీజనమునకే లభించింది. తమ అంతఃకరణావరణమును వివేచించి తెలిసికోవాలి కాంతాలోకం" (రూపనవనీతమ్, పుట 87, 88).

"గాఢమై కవ్వపురాపిడి తగిలితేనేకాని పొంగిన పెరుగు నురుగులు తేరి నవనీతసిద్ధి కాదు. అలాగే విషయముల త్రొక్కిళ్లకూడా హతాహతదుష్కషణ ధారతో ధౌతము లయినప్పుడే చేతనమునకు ప్రసవఫలితం అందుతుంది. ఆమీద స్తన్యపానసముద్దీపనంవల్ల కలిగే తాదాత్మ్యసుఖం సువాసినులకే అనుభవైక వేద్యం. శిశువశనపులకితమై పల్లవించే అనంగభావానుభూతి బ్రహ్మానందమేనని- మాధురీవాదులమతం. సాధ్వీజనము ఈ మహామాధురీదర్శనమును తత్పరులై లక్షింపవలసి యున్నది" (రూపనవనీతమ్-పుట 88, 89).

'నరనారీసంబంధము
పరిభావింపుము దిశావిభాగము వరుసన్
ధర- జననీ భగినీ సహ
చరీ కుమారీ క్రమము నిజంబగుట బుధా!' (మాధురీదర్శనమ్ పు.13)

'కులశుభాంగివయోధీరకుసుమమందు
మోహమధువునె గవేషించె మున్ను సుకవి;
సాత్త్విక ప్రేమకోశపేశలము లయిన
వత్సలామృతరుచులను వలచె నేడు' (రమ్యాలోకమ్. పు. 32)

'తీవెమీద సుతారంపుతీవి నిలిచి
పగలబడి నవ్వు పువ్వుపై కెగయు అళిని
ప్రియుడు ప్రియురాలినట్లు చేర్చె నొక సుకవి
బిడ్డ తల్లినిభాతి కల్పె మరొకండు.' (రమ్యాలోకమ్ పు. 28)

ఆ మరొకండు మరెవరో కాదు. రాయప్రోలువారే.

రాయప్రోలువారి దృక్పథంలో స్త్రీపుంసయోగరూపమైన జీవనప్రస్థానం స్తన్యదానంనుండి స్తన్యదానందాకా సాగిందని గమనించాలి స్తన్యపానాన్ని చేసే శిశువు దంపతిప్రణయమధువు. శిశుదశ అవ్యక్తకామం. కౌమారీదశ స్నేహపూర్ణం. బాల్యదశలో స్త్రీపురుషులు మాతృస్తన్యపానమాధుర్యాన్ని భౌతికంగా వీడినా మానసికంగా భావనామయం చేసికొంటారు. స్వీయవయో వస్థలో నున్నవారితో స్నేహరుచులను పంచుకొంటారు, యౌవనదశలో వారికి విషయప్రేరితమైన తనూసంగేచ్ఛ పొటమరిస్తుంది. దాన్ని సంస్కారశీలంతో

మానుషీ ప్రేమగా మార్దవీకరించుకోవాలి. త్రివర్గసాధనానికి శరీరం సాధనంగా సంభావించి పాణిగ్రహణ ధర్మాన్ని పరిగ్రహించాలి. త్రివర్గం ధర్మశాసితం. జంతు సహజమైన కామం బహిరింద్రియవ్యాపారాన్ని ఆలంబనంగా చేసికొని ప్రవర్తిల్లిన తరుణంలో వివేకులైన స్త్రీపురుషులు ఆకామం సంతానార్థమనీ, అది ధర్మనిష్ఠమనీ ప్రబోధించే అంతఃకరణప్రవృత్తిని ప్రధానంగా హృదయ చేతనంలో స్థాయిగా పోషించుకోవాలి. వయోధర్మంగా జరిపే కాయికవ్యాపారం భావనామయంగా పరిణమించి, వారిహృదయాల్లో భావలతికలా ఉపజీవిస్తూ సంతానఫలోన్ముఖంగా పరిణతిని సాధిస్తుంది. అప్పుడు తనూసంగంకంటె తద్ధర్మభావభావనం నిత్యమనిపిస్తుంది. స్త్రీ స్తన్యదానమహాదశను పొందటం దానిధ్యేయం. ఆమహాదశ స్త్రీపురుషజీవితాల్లో ఒక పెద్దమలుపు. వనితయందు వలపు- చిలికిన పెరుగుపై తేలే వెన్నలా-విచిత్రపరిణామాన్ని పొంది వత్సలాస్నిగ్ధమౌతుంది. స్త్రీగతమైనవాంఛకు సాఫల్యం సాకారంగా లభించటంచేత పురుషుడు వత్సలాశ్రితమైన మాతృభావనంలో తన్మయుడై ఇంద్రియావరణాతీతమైన ప్రేమభావాన్ని ప్రేయసిలో దర్శింపగలుగుతాడు. స్త్రీపురుషులు వైవాహికధర్మాన్ని చేపట్టటం- తామిదివరకు అనుభవించి, ఆ తరువాత ఆలోచనామృతంగా ఆస్వాదిస్తున్న మాతృస్తన్యపానమాధుర్యానుభవాన్ని ప్రతిబింబరూపంలో మరలా పొందటానికే. ఇదే పాణిగ్రహణవ్రతంలో ప్రతీయమానమయ్యే పరమవ్యంగ్యమైన మానవసమాజచిరంతనచిన్మయాకాంక్ష। అదే వారి అంతఃకరణాలు ఆస్వాదించాలని అర్రులుసాచే మధురానుభూతి ఇది హృదయసంయోగంవల్ల సిద్ధించే రసస్థితికాని తనూయోగంచేత సాధించే సిద్ధి కాదు. సంతానం కలిగేది దేహాలకే కదా!- అనే శంక అల్పమైనది. అలాగైతే జంతువులకు కూడా సంతానం కలుగుతున్నది. జంతువులకు శారీరకస్పృహతోపాటు, హాదయస్పృహ ఉన్నా, దాన్ని సంభావించి సంస్కారసమున్మేషం చేసికొనే శక్తిలేదు. మానవుల కాశక్తి నైజం మానవులు దేహంతో అనుభవింపగలరు; ఆ అనుభవాన్ని హృదయంతో అనుశీలించి ఆనందింపగలరు, అభివ్యక్తీకరింపగలరు. జీవితానికది యొక అభ్యుదయపథంగా మలచుకొనగలరు. దానిని విశ్వశ్రేయంగా విస్తరింపజేయగలరు. తనువు నాశ్రయించిన భావం అశాశ్వతం; తను విచ్చిన అనుభవాన్ని భావనామయం చేసికొని హృదయకోశంలో విశుద్ధంగా స్థాయిగా పరిపుష్టం చేసికొన్న భావం శాశ్వతం.

'తనురక్తము లయి అంత
స్సున రాగిలి లేచుచు పడుచున్ మేళనమున్
గొను చేతోద్రవరతులు; అ
తనుమథనముల తెలిలి అమృతము లగును బుధా!' (పు. 19)

అనే మాధురీదర్శనసూక్తిలోని తాత్పర్య మిదే.

జీవితంలో అనుభవించే ఈఅమృతమధురానుభూతిని అలౌకికమైనసాహిత్య జగత్తులో వ్యంగ్యసుందరంగా వ్యక్తీకరిస్తే అది రసానుభూతికి రమ్యమార్గ మౌతుంది. జీవితాన్ని ప్రణయపథంగానూ, సాహిత్యాన్ని ప్రణవపథంగానూ అన్వయిస్తూ రాయప్రోలువారు ఆ రెండింటి భేదాన్ని రూపనవనీతంలో ఇలా వివేచించారు.- "తేనే త్రాగి, దానిలోని తీపిని అనుభవించే ప్రసాదనం ప్రణయ సరణి. ఈ కలాపములో ఇంద్రియానుభోగం తప్పదు. గీతి నాలించి తన్మాధుర్యము ననుభవించడం ప్రణవపథము. ఈఉపాసనలో అంతరనుశీలనంమాత్రమే సంగతం." (పు 103).

రాయప్రోలువారు రమ్యాలోకంలో ప్రపంచించిన దిదే తత్త్వం.రమ్యాలోక మనే సమాసానికి రమ్యమైన ఆలోక మనీ, రమ్యమునుగూర్చిన ఆలోక మనీ, రమ్యముకొఱకైన ఆలోక మనీ విగ్రహం చెప్పుకోవచ్చు రమ్య మనగా రమింప తగినదని వ్యుత్పత్త్యర్థం. జీవితంలో రమింపతగింది ఏది? సాహిత్యంలో రమింపదగింది ఏది? రాయప్రోలువారిమాటల్లో అది — 'సాత్త్వికప్రేమకోశ పేశలము లయిన వత్సలామృతరుచులు'. (రమ్యాలోకమ్ పు. 87). ఆలోక మంటే కంటితో చూచే వట్టిచూపుకాదు, హృదయంతో రమింపగల చూపు. వత్సలామృతరుచిని ఆస్వాదింపగలిగితే రమ్యమైన ఆలోక మౌతుంది. కవి తన కావ్యంలో ఆ రుచిని వినిర్మింపగలిగే ప్రయత్నం చేస్తే రమ్యమునుగూర్చిన ఆలోక మవుతుంది. సాహిత్యంలో ఆరుచినిగురించి అన్వేషించి అందుకొని ఆస్వాదించే సహృదయుని ప్రయత్నం రమ్యము కొఱకైన ఆలోక మవుతుంది. లోకులు-కవులు-సహృదయులు చేసే రమ్యాలోకాన్ని ఆ సమాసవిగ్రహంలో సంభావింప వచ్చు. రాయప్రోలువారిదర్శనం జీవితాదర్శంలో ప్రతిబింబించిన సాహిత్యానికి సంబంధించింది కాబట్టి కవికీ సహృదయులకూ ఉభయతారక మోతుంది.

రమ్యాలోకం లోకంలో దంపతిప్రణయంలో దీపించే వాత్సల్యామృతమే అయితే అది విశ్వనారీనజనజీవితసామాన్యం కాజాలదు. రాయప్రోలువారి ప్రస్థానం విశ్వోన్ముఖంగా సాగింది రమ్యాలోకం తరువాత. లోకంలో నరనారీ జను లందరి నడుమ దాంపత్యసంబంధం మాత్రమే లేదు. తండ్రీకూతుళ్లూ, తల్లీ కొడుకులూ, సోదరీసోదరులూ,- ఇలా వావివరసలు వారిమధ్య ఉన్నాయి. కాని, వారందరి నడుమ తనూసంగప్రసంగం లేదు. పరస్పర ప్రేమభావం ఉంది. ఇది విశ్వజనీనంగా భావించే స్నేహప్రవృత్తి. సంతానసుఖానుభూతి నొందిన దంపతుల ప్రణయంకూడా, ఆ తరువాత గుణానురాగరూపంగా విస్తరిల్లి స్నేహభావంగా పరిణమిస్తుం దని రాయప్రోలువారి దర్శనం.

## శృంగారరసస్థాయి స్నేహం

ఇక్కడ ఒక అనుమానం కలుగవచ్చు. సంతానవంతులైన దంపతుల నడుమ స్నేహభావ మేమిటని, అది జీవత్ప్రవృత్తికి విరుద్ధంకాదా అని. దానికి రాయప్రోలువారి సమాధాన మిది- "నూనె త్రావిన వత్తిమీద ఘృతం పోసినా గ్రహింపదు. స్తన్యపానం విడిచిన శిశువు తిరిగీ మాతృవక్షంకోసము పరుగెత్తుట లేదు. వదలిన కుసుమానికై భోగికులం ఆరాటపడుతున్నదా ? నిజ మేమంటే- భుక్తరుచులతో పరితృప్తతుష్టు లయిన ప్రాజ్ఞులను ప్రాతతీపులు తిరిగీ లాగలేవు. పునరాస్వాదనం ఒకవిధంగా ఉచ్ఛిష్టభోగమే కదా! అంతే కాదు. కాండంనుండి కవటాకు మొలచినతరువాత దానితరుణసౌభాగ్యమంతా మొలకమీదనే ముఖీకృత మౌతుంది. ఇంకా, శుచిమంతమైన మిధునాంతర్మధనంలో చిత్సుఖోదయం అవుతుంది. అది అమలినమైన స్మృతిలో అనుజ్జ్వలదీపనంలా భాసిస్తుంది. ఆ భావము నిలుపుకొనేవారు ఏతత్పునరావృత్తిని పర్యుషితంగా పరిత్యజిస్తారు. కాగా, జీవితఖేలనం తనూత్సంగమును విడిచి భావాంబరములో విస్తరిస్తుంది. ఈ వినయ విషయవిరహదశలో గార్హస్థ్యచరితార్థుడైన పురుషుడు సమస్తసతీకులమందును మాతృమహత్కళను ఉపలక్షింపగలుగుతున్నాడు. అట్లాగే, స్తనంధయాసంగ తన్మయురాలైన స్త్రీయును యావన్నరజాతమును వత్సాకృత్స్నంగా ప్రేమింప కలుగుతున్నది". (రూ. న. పు. 48)

'ప్రాణుల కెల్ల ను సర్వాం
గీణ మయి విలసిలు రతి; అకిల్బిష నుయి క

ల్యాణపరమవర్చస్కధు
రీణ మ్మగు స్థాయి, నది వరించు టెటు బుధా!'
'తరుగక, విరుగక, చెఱగక
చిరకాలస్నేహమై రశీతోష్ణపరం
పరలన్ చెదరక, నిర్జర
పరిణతి గొను రతియు మిధునబంధమున బుధా।' (మా. ద. పు. 17)

'అది విశ్వతోముఖప్రియ
మృదుమధురాలోకపారమితస్వాత్త్వికమై
పొదలును నిత్యసుమంగళ
సదమలసాంగత్యలగ్నసాధనగ బుధా;' (మా. ద పు. 13)

ఈ విధంగా దంపతులమధ్య చిరస్థాయిగా నిలిచే స్నేహం చిరస్థాయిగా వర్తిస్తుంది. దీన్ని లాక్షణికపరిభాషలో 'రతి' అనే అంటారు; తదనుభూతిని 'శృంగార' మనే అంటారు. కాని నిజమైన అర్థం ఇదే అయినా, రతి- శృంగారం- అనగానే సంభోగవిషయేచ్ఛ, తదనుభవ విశేషం అనే అర్థంలోనే లోకంలో విపరీతంగా వ్యాపించి ఉండటంతో—దాని నిజార్థస్ఫూర్తి ఆధునికులకు అవగతం కావటానికి రాయప్రోలువారు దానికి అమలినశృంగార మని పేరుపెట్టారు. అమలినమైన రతి అంటే ప్రేమ- లేదా- స్నేహం అని వారిభావం. తనూత్సంగ సంగతమై- రతి స్నేహధౌతం కావడంతో అమలినంగా భాసిస్తుందని వారి దర్శనం!

బుద్ధిజీవి యైన మానవునికి అది సిద్ధమైన సాధన! ప్రకృతిసిద్ధమైన సాధననుండి పతనమైన మానవప్రవృత్తి రతిని కామకృతిగా భావించి జీవిత మాధుర్యాన్ని కోల్పోయిందని రాయప్రోలువారి వేదన! ఆ వేదనలోనుండి సత్య సందర్శనంకోసం చేసిన సాధనయే వారిదర్శనసారం. వారి సిద్ధాంతంప్రకారం అమలినశృంగారమే రతిస్థాయి యైన నిజమైన శృంగారం. ఇప్పుడు కావ్యజగత్తులో పరిగణింపబడుతున్న శృంగారస్థాయి- రతిగా భ్రమింపబడుతున్న కామం. ఈ విపర్యయాన్ని గుర్తింపజేసి, సవరింపజేసేదే రాయప్రోలువారి అమలిన శృంగారసిద్ధాంతం!

ఇలా లోకంలో రతిభావం విపరీతం కావటానికి ముఖ్యకారణం పురుషుల వర్తనమేనని రాయప్రోలువారి అభిప్రాయం. పురుషులు స్త్రీలలో మాతృమహ

త్కళను ఉపలక్షించే హృదయయోగాన్ని సాధించలేక- వారిని తమ విలాస భోగవస్తువులుగా భావించి, కామకేళికి పాత్రాలుగా మార్చి, పతన మొనర్చి రతి పావిత్ర్యాన్ని కలుషితంచేయటం యుగయుగాలుగా కనపడుతున్నది. ఈవిశృంఖల విహారంవల్ల స్త్రీలోకం సంక్షుభితం కావటం సహజమైపోయింది. ఇటువంటి ఉదంతాలు పురాణాల్లోకూడా కనపడుతున్నాయి. అహల్యాసంక్రందుల ఉదంతం, అనసూయాత్రిమూర్తులవృత్తాంతం, ఋషిపత్నులకథలు- ఇలా ఎన్నోఉన్నాయి. అహల్య సంక్రందనునికి శీలదానం చేసింది. దానికిఅహల్యా జారత్వం కారణం కాదంటారు రాయప్రోలువారు. ఆమెలో సర్వవనితాసామాన్యంగా సన్నద్ధమై ఉన్న సప్తసమిధానురూపమైన గుణసంపద కారణ మంటా రాయన. 'ధృతిః క్షమా దయా శౌచం కారుణ్యం వాగనిష్ఠురా. మిత్రాణాం చానభిద్రోహః సప్తైతాః సమిధః శ్రియః' అని వ్యాసమహర్షి నిర్దేశించాడు. "అహల్య పూర్ణ దాక్షిణ్య మూర్తి. చింతామణి కామధేనువులకు నాథుడైనవాడు ఇంద్రుడు. విశేషించి యజ్ఞ యాగాదులలో పురుహూతుడు, అప్సరఃకులానికి అధిపతి అట్టివానికి కామ లాలస తీరింది కాదు. అతనిచేతము అహల్యాముఖలక్ష్మీబద్ధమై విహ్వలించింది. దానితో దేవేంద్రుడు అకించనుడై, అకృపణుడై, యాచ్నాదీనుడై. దాక్షిణ్య గురుకుల్య అయిన అహల్యను కామభిక్ష పెట్టుమని అర్థించెను. ఆ మహాపతివ్రతకు అతి దుస్తరమైన దుస్సంధి తరుణం. అటు దాక్షిణ్యంతో కరిగిపోతుంది; ఇటు శీలభంగమునకు తపిస్తుంది. తుదకు తన స్త్రీచైతన్యస్వభావమే గెలిచింది. తనజీవ క్షీరములను ధారవోసి అమరేంద్రుని బ్రతికించి తాను పాషాణమైపోయింది" అటువంటప్పుడు- స్త్రీధర్మాన్ని పరీక్షచేసిన పురుహూతునికి కారుణ్యభావంతో శీలదానం చేసిన అహల్యను లోకం, ధర్మశాస్త్రం కళంకితగా భావించినా, ఆమెలోని దాక్షిణ్యాంశమాత్రం అంటులేని అగ్నివంటిదని రాయప్రోలువారి తీర్పు.

## దంపతి ధర్మంలో స్నేహభావం

అహల్యకంటె అనసూయ పరిణతసత్వ. పురుషుడు స్త్రీని అంతఃకరణ ప్రవృత్తియందు భావింపవలసిన విధాన్ని మాతృమహిమారూపంగా ప్రదర్శించి ప్రబోధించింది నరలోకానికి. పురుషునికామతృష్ణను దాక్షిణ్యభావంతో సహించి అనువును శిలగా శిక్షించుకొన్న ఉద్విగ్న స్నేహమూర్తి అహల్య. శిశుదశలో తనాసక్తంగా పల్లవించే అప్రబుద్ధయోగసిద్ధి నిలుపుకుంటే శ్రీశుకాదుల్లోలాగా జీవితాంతం నిలుస్తుందని త్రిమూర్తులను శిశువులుగా మార్చి లోకానికి బోధించిన

దాక్షిణాత్యమాత్రృమహత్కాళి అనసూయ. సహజపూర్ణమైన ఆ మాతృ భావాన్ని పురుషజీవితం స్థాయిగా నిలుపుకుంటే దంపతి ధర్మంలో విమల ప్రణయఫలంతో పాటు, ఆపైన విశ్వజనీనమైన స్నేహభావం కూడా జీవనసారంగా రస్యమాన మౌతుంది.

నారీధర్మ విపత్తులలో బలమైన మరికొన్ని సమస్యలు రాయప్రోలువారి దర్శనంలో పరామర్శింపబడినవి. బాల్యంలో బాలబాలికలు కామకళంకితం కాని అచ్ఛమైన స్నేహంతో చెలిమిని పెంచుకుంటారు. యౌవనదశలో వారు ప్రవేశించి నప్పుడు అది తనూసంగేచ్ఛగా పరిణమించే ప్రమాదం వాటిల్లితే ఉత్పన్నమయ్యే సమస్యలు విచిత్రంగా వుంటాయి. ఆ యువతీ యువకులు ఒకరికొరకు మరొకరు తపించి, బంధుజనాన్ని కూడా పరిత్యజించి, వర్ణబంధాలను తెంచుకొని, వివాహ మాడితే—వారి ప్రణయం దాంపత్యధర్మాన్ని ఆశ్రయించి ప్రసరించే అవకాశం కలుగుతుంది. ఈ సమస్య కిటువంటి పరిష్కారాన్ని భావించి రాయప్రోలు 'లలిత' కావ్యాన్ని వ్రాశారు. ఒక్కొక్కసారి యువకునిలో తనూసంగేచ్ఛ ప్రకోపించి స్త్రీని తద్వికారంతో కాంక్షిస్తే, యువతి శుచియైనస్నేహాన్ని కలుషితం చేసుకోవటం ఇష్టంలేక అంతర్వేదనకు గురికావచ్చు. కష్టకమలలో, స్వప్నకుమారంలో ఈ సమస్యను రాయప్రోలువారు చిత్రించారు. కష్టకమల ప్రాణత్యాగం చేసుకోగా, స్వప్నసుందరి యువకునికి ప్రబోధం చేసి అతని ప్రవర్తనలో మార్పును కలిగి స్తుంది. మరో సమస్య—యువతికి తన స్నేహితునితో కాక మరొకరితో వివాహ మౌతుంది. ఆమె భర్తతో కూడి దంపతిధర్మాన్ని నిర్వహిస్తూంటుంది. కాని, తన పూర్వ స్నేహితునిపట్ల స్వచ్ఛమైన స్నేహభావాన్నే ప్రసరిస్తుంది. కాని, అతడు మాత్రం ఆమెను సతిగా పొందని బ్రతుకు నిరర్థక మని నిర్వేదపడతాడు. అత డామెను కాంక్షిస్తుంటాడు. ఆమె అతణ్ణి పొందలేదు. అప్పుడు సమస్య జటిల మౌతుంది. దానికి మార్గ మొకటే ఉంది. వారిరువురు తమ హృదయాల్లో తనూ సంగేచ్ఛతో తపించే కామనను స్నేహభావంతో ధౌతం చేసుకొని, అనాసక్తమైన ప్రేమను పెంచుకోవాలి, విశ్వజనీనమైన స్నేహభావంగా దాన్ని సుమానుషం చేసికోవాలి. ఈ తత్త్వమే రాయప్రోలు వారి తృణకంకణంలో ప్రతిపాదింపబడింది. మరొకసమస్య— స్నేహితుడు యాచ్ఞాదీనుడై వివాహితయైన స్నేహితురాలిని శీలభిక్ష కోరితే, దాక్షిణ్యప్రేమ ధాతువుచే ఆర్ద్రయైన యువతి అతనికి శీల దానం చేస్తే ఉత్పన్నమయ్యే ధర్మమీమాంస. దీన్ని శిష్టస్మృతితో సమీక్షిస్తే నేర మౌతుంది. దీన్ని ప్రేమధర్మంగా పరిశీలించాలి. అటువంటి ధర్మశాస్త్రాలు

లేవు. రాయప్రోలువారు ఈ సమస్యను హృదయధర్మంతో పరిశీలించు మంటారు. ఇటువంటి సమస్యలు పరిణచిత్తపరిపాకం లేని వ్యక్తులమధ్య ఏర్పడుతాయి. అయితే, వారు చేసింది మలినకార్య మని వారికే స్ఫురింపచేయాలి. మానసిక పరివర్తనం ద్వారా వారిలో స్నేహదీపం వెలిగింపజేయాలి. రూపనవనీతంలోని వకుళమాల వృత్తాంతం ఈ సమస్యకు చక్కని ఉదాహరణం. ఆమె అహల్యకు చెల్లె లనిపిస్తుంది. పై ఉదంతాల న్నిటిలోనూ పురుషుల విపరీతవర్తనంవల్లనే సమస్య లుత్పన్నమయ్యాయి. వారు సుశిక్షితులైతే నారీజనానికి ఏవిషమసమస్యలు ఉత్పన్నం కావు. స్నేహభావం నరనారీలోకంలో ఋజుమార్గంలో వర్తిల్లగలుగు తుందని రాయప్రోలువారి వివేచనం.

'కడిగిన మృగమదపాత్రిక
విడువని పరిమళముపగిది, విధినియమమునన్
విడిబడియును వారల పెం
పుడు మైత్రీప్రేమబంధములు తెగ వవురా !'

అని తృణకంకణంలో రాయప్రోలువారు రమణీయోపమానంతో తమదర్శన వివేచ నాన్ని వివరించారు.

రాయప్రోలువారి మాధురీదర్శనానికి వారి లలితోపాసనం తాత్త్విక ప్రేర ణాన్ని అందించిం దని భావించటానికి వీలుంది. శక్త్యుపాసనంలో ప్రధానంగా మూడుమార్గా లున్నాయి. అసురమర్దని యైన ఉగ్రశక్త్యుపాసనం, చక్రరూపిణి యైన యోగశక్త్యుపాసనం, మాతృరూపిణియైన మాధురీశక్త్యుపాసనం. అంత శ్శత్రుమర్దనం చేసే శమదమాలను ఉగ్రవ్రతనిష్ఠతో సాధించేమార్గం మొదటిది. షట్చక్రాశ్రితమైన కుండలినీయోగసిద్ధికి సంబంధించింది రెండోమార్గం. జగత్సృష్టి స్థితిలయాత్మకమైన సంసారచక్రంలోని పరమార్థంగా విశ్వప్రేమరూపమైన అఖండ ఆత్మానందస్వరూపసాక్షాత్కృతిని సంరక్షించే సాత్త్విక యోగసిద్ధికి సంబంధిం చింది మూడోమార్గం. లలితోపాసనం మూడోపద్ధతికి సంబంధించింది. మాతృ మూర్తిభావనంలోని మాధుర్యమే ఆత్మానందకరంగా భావించి అనుభవించే సాంఖ్య యోగ సంబంధియైన సత్త్వమార్గ మిది. రాయప్రోలు ఆ మార్గంలోని మాధురీ దర్శనాన్ని జీవన ప్రస్థానంలోనూ సాహితీ ప్రస్థానంలోనూ స్థాపించి అభినవంగా వ్యాఖ్యానించారు. ఇది వైరాగ్యపథం కాదు. విశ్వరాగోదయ మాతృభూమియైన శృంగారరసపథం! ఇందు స్త్రీ కేంద్రం. దానితో స్త్రీమూర్తి మాతృపదంలో

ఉపాస్యతత్త్వంగా ఉన్మీలించింది. ప్రకృతిలో మాతృతత్త్వం పరిమళించింది. సాహితిలో రమ్యాలోకం రూపొందింది. శబ్దార్థవృత్తుల్లో ప్రతీయమాన మయ్యే వ్యంజన, స్నేహశక్తిగా సాక్షాత్కరించింది. కాంతాసమ్మితమైన కావ్యపరమార్థం మాధురీ దర్శనంగా భావింపబడింది. చిరస్నేహ ప్రవృత్తి ఆత్మచిత్కళయైన ప్రేమభావంతో ఉపజీవించి రతిగా జీవనియతినీ, కావ్యజీవితాన్ని లాలించి స్థాయిగా చర్వ్యమాణమై రసానందసంసిద్ధిని ప్రసాదిస్తున్నది. ఇదియే రాయప్రోలువారి దర్శనంలో లలితోపాసనతత్త్వం ఉన్మీలించిన విధం.

### మాధురీదర్శనం – సప్తపర్ణి

రాయప్రోలువారి మాధురీదర్శనం సాహితీ జగత్తుకు కలిగించిన నూత్న చైతన్యాన్ని సప్తపర్ణిగా సంభావింపవచ్చు. దాని పర్ణవిన్యాసం ఇది.

1. ప్రకృతిమీది రక్తి.
2. అంతఃకరణ ప్రవృత్తిపై ఆసక్తి.
3. రచనంలో రమ్యమైన రమణీయార్థాభివ్యక్తి.
4. శబ్దార్థబంధాలలో గమ్యమైన వ్యంజనావృత్తి.
5. స్థాయిగా స్నేహప్రవృత్తి.
6. రసంగా ఆత్మచిచ్చైతన్య ప్రేమశక్తి.
7. అనుభూతిగా మాధురీదర్శనభుక్తి.

**శతావధాని** కళా ప్రపూర్ణ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి అంకితమైన[1] మాధురీ దర్శనంలో పదకొండు దళా లున్నాయి. ప్రథమదళంలో హాలగుణాఢ్యులనుంచి ప్రారంభమై నన్నయాదికవుల మధుర గ్రథన ప్రసాద గుణవివర్ధకమై విసర్గ శృంగార రసోపాసనం శబ్దబ్రహ్మాండంలో సౌందర్యావరణంలోని ఆనందాన్ని సాధించే సాధనంగా సాగిందని రాయప్రోలువారు పేర్కొన్నారు. మానవుడు జ్ఞానభక్తి కర్మసాధనం చేయడానికి శరీరం ఉత్తమసాధన మనీ, "యమనియమ విధినిషేధ క్రమాశాసిత మయిన ధర్మకల్పముకంటె వాఙ్మయ తపశ్చరణరీతి మధురమనీ, తరుణవృత్తంతో ప్రియసాధనం అనపాయమైన మధురమార్గమనీ

1. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి 'ప్రభుత్వాస్థాన మహాకవి' బిరుద ప్రదాన మహాసభలో శ్రీరాయప్రోలువారు మాధురీదర్శన గ్రంథాన్ని అంకితంచేస్తూ నవ్యకవుల పక్షాన-

రెండో దళంలో వివరించారు. పరిణామసుభగమైన ప్రకృతిసౌందర్యంలో నిత్య సుందరలలితాలంబన మైన లావణ్యకళాభినయరూపమే కావ్యకళగా మూడో దళంలో పేర్కొన్నారు.

'వాగర్థవిశ్వముఖమున
భోగింపఁగ నగు, ననంతభూతంబులలో
రాగిలు ప్రణయమధుహవి
ర్భాగము; సహృదయజనానుభావ్య మిదె బుధా!'

అని సహృదయులు కావ్యంలో రమింపదగిన ప్రణయమధువును నిర్దేశించారు నాలుగోదళంలో. పరుషసరళవిభావజన్యమైన అనుభావాదులను మార్దవీకరించి మనస్సును 'విశ్వతోముఖప్రియమృదుమధురాలోకపారమితసాత్త్వికమై పొదలునట్లు పరిపక్వీకరించుకొనే సాధనను ప్రస్తావించారు అయిదోదళంలో. జగచ్చైతన్యంలో ప్రతీయమానమయ్యే మైత్రీప్రవృత్తిని శబ్దార్థాలలోని వ్యంజనావృత్తిద్వారా అనుశీలించి దృశ్యశ్రవ్యకావ్యకళావాహికల నాశ్రయించి ఆమోదించాలని ఆరవదళంలో వివేచించారు. శైశవంలోని అవికృతరతిని అంతఃకరణాల్లో మథించి, సుమానుషీకరించుకొని మిథునభుక్తిలో స్నేహఘాతం చేసికొని, నరనారీసంబంధాన్ని సంభావించి, అమలిన శృంగారస్థితిని విశ్వజనీనంగా సాధించాలని వివేచించారు సప్తమదళంలో. కళామార్గాన్నీ, జీవితపథాన్నీ వివేచిస్తూ ఆరెండింటిలో స్థాయిభావం ఎలా ఆస్వాదనీయ మౌతుందో స్పష్టం చేశారీ క్రిందివిధంగా అష్టమదళంలో

1. కళామార్గంలో స్థాయియైన రతి—

'సురుచిర శబ్దములన్ సుం
దర రూపంబులను ప్రాణి తనియుటయె కళా

---

'భువనశివేతర భంజక
నవనీత పదార్థ రంజనన్ నిండిన దీ
కువలయ సుందరభాండ, మ
నవద్యము, కళాప్రపూర్ణ నై వేద్యము కాన్'

అనే పద్యాన్ని రజతఫలకంమీద చెక్కి శాస్త్రిగారికి సమర్పించారు. కాటూరి, విశ్వనాథ మొదలైన కవులు రాయప్రోలు కవితను ఆ సభలో ప్రశంసించారని ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు చెప్పారు.

పరమరహస్యం! బిదె రతి
నిరీక్షిత మగు రసోపనిషదంశ బుధా!'

2. జీవితపథంలో స్థాయియైన రతి—

'రతి చిత్పదార్థ; మది పు
ష్పితమయి, స్త్రీపుంసయోగ చిరశిక్షాస్నే
హితమై సుమానుషఫల
క్రతు కల్యాణంబున కగు రమ్యముగ బుధా!'

నవమదళంలో రాయప్రోలువారు కావ్యరసతత్త్వాన్ని వివేచించారు. కావ్యంలో రమింపదగింది రచనం, రచనంలోని రుచిమద్బంధం రసరూపబ్రహ్మకు సముద్దీపకం. రమణీయార్థతరంగితమైన కమనీయ కావ్యంలో పూవులలో మకరందం లాగా రసం లాస్యంచేస్తుంది. కవితకు రసం ప్రాణం.

'కవితకు రస మసువులు, తత్
కవనము భావప్రపుల్ల కమనీయముగా
నవనవలాడెడి నుడువుల
నవరింత్రు కవులు సుహృత్ప్రసన్నగతి బుధా!'

'భావము సాహిత్యకళా
జీవము, తత్కామనీయసిక్త స్థాయీ
భావము రసోదయోషః
శ్రీవాల్లభ్య మగును కవికృతియందు బుధా!'

జగమంతయు సౌందర్యస్థగితమనియు, శివమయమనియు తత్ప్రసాధనరేఖాని గరణ రచనవ్యంజన మానందమనియు, అది శాంతిదాయకమనియు దశమ దళంలో పేర్కొన్నారు. అల్లసానివారన్నట్లు 'అరచాటగు ఆంధ్రవధూటీకుచముల' వలె కవిత ఉండాలని చెపుతూ, అగూఢతను గురించి ఇలా వ్యాఖ్యానించారు.

'గూఢము హృదయంగమగతి
గూఢత మీమాంసకంతకును మూలమగున్
గూఢము రసోదయస్థితి
గూఢత తొలఁగున్ జుగుప్స కోల్కొనదొ బుధా!'

రాయప్రోలువారు జీవుల అంతఃకరణభాండంలో ఉగ్గ్న చిరస్నేహభావదుగ్ధాలను

సుమానుషీకరించి, పెరుగుగా పొంగించి, వాటిని చిలికి మాధురీనవనీతాన్ని నవ్య సాహిత్యదర్శనంలా వెలువరించి అభినవకవితకు ఉపాయనంగా అందించారు.

'కలవు రసరామణీయకములు కృతులను
మాధురీ సౌరభమ్ములు మధువునబలె
రసము లంతఃకరణయోగరంజనములు
రామణీయక మాకర్షరచనసరణి' (రమ్యాలోకమ్. పు. 13)

మధువులో తీపీ సువాసనా ఉన్నట్లు కావ్యంలో రసమూ, రామణీయకమూ ఉంటాయనీ, అంతఃకరణయోగంవల్ల రసాన్నీ, ఆకర్షణీయరచనంవల్ల రామణీయకాన్నీ సహృదయు లాస్వాదిస్తారనీ రాయప్రోలువారు రమ్యాలోకంలో బీజప్రాయంగా చెప్పిన సిద్ధాంతాన్నే మాధురీ దర్శనంలో సాహిత్యపరంగా అన్వయించి చెప్పారు. రాయప్రోలువారి సాహిత్యదర్శనంలో విభావవిస్ఫూర్తిని వెలార్చేది శబ్దం. శబ్దబంధంలో భాసించే సహభావం జీవులమధ్య రాణించే స్నేహరక్తి. శబ్దశక్తివల్లనే అర్థం ప్రతీయమానమౌతుంది. అర్థం ప్రఫుల్లమైన భావజీవితానికి అనుభావ విన్యాసాన్ని వెలారుస్తుంది. అది సహృదయ అంతఃకరణంలో చర్వ్యమాణమై సాత్త్వికస్థితిని పొందుతుంది. లలితపరుషభావ సంఘర్షణానికి తట్టుకొని మధురస్నేహాద్వైతస్థితి నందించే స్థాయి ధ్వనిరూపంగా భావనామయమై అనుభవస్థితి కంది స్థాయిత్వాన్ని భజిస్తుంది. అందువల్ల సహృదయుడు రచనలోని రామణీయకత్వాన్ని రమ్యాలోకంలో గ్రహించి, అంతఃకరణవృత్తుల్లో జరిగే మథనంలోనుంచి రూపనవనీతాన్ని సాధించి, తచ్చర్వణాన్ని ఆత్మచిత్కళయైన రతితో సాధించటమే రాయప్రోలు చెప్పే శృంగారరస ప్రస్థానం! ఇది లోకంలో నరనారీజనం రతిని చిరస్నేహంగా సుమానుషీకరించి భావించి, అనుభవించే మాధుర్యంవంటిదని వారి నిర్దేశం.

జీవితంలో శృంగారం ఎంత సాధనావృత్తికి సంబంధించి వుంటుందో కావ్యంలో శృంగారంకూడా అంత ఆరాధనా ప్రవృత్తి నాశ్రయించి ఉంటుంది. శబ్దబంధరూపమైన సాహిత్యంలో అస్వాదనీయమైన కళాస్థానం ఏమంటే-మృదు పదముద్రితమైన వాక్కుకూ, ఇష్టవ్యంజనానురంజనమైన అర్థానికీ మధ్య నిత్య నవ్యమైన రాగభావం. ఆభావం శృంగారం. ఆశబ్దార్థబంధంలోని వ్యంజనం సౌందర్యం. వివక్షితా వివక్షిత ధ్వనిమూలమైన సౌందర్యం ఆస్వాదస్థితి నందినపుడు రసంగా పర్యవసిస్తుంది. రసచర్వణస్థితి మాధుర్యం. అది అద్వైతస్థితి వంటిది. అప్పుడు

రసరామణీయకాలకు రస్యమానమైన ద్రవస్థితి యేర్పడి, నీరక్షీర న్యాయంగా ఐక్యత ఘటిల్లి, సహృదయ హృదయానికి మధురానుభూతి కలుగుతుంది. ఇదే రాయప్రోలువారి రమ్యాలోకం సాధించిన మాధురీ దర్శనరూప నవనీతం!

'కానరాదు సౌందర్య శృంగారములకు
భేద మధిక మారాధన వృత్తియందు
గుణము శృంగార మగును; తద్గుణ శరణ్య
మమృత సౌందర్య మగును నవ్యార్చకులకు,'

(రమ్యాలోకమ్. పు-15)*

*ఈవ్యాసం వంశీ ఆర్ట్స్ థియేటర్స్, హైదరాబాదువారు 1980లో ప్రకటించిన 'రాయప్రోలువారి సాహిత్య సౌందర్యదర్శన' మనే వ్యాస సంపుటిలో ప్రచురితం.

# ఆంధ్ర పురాణము

'శ్రీమదాంధ్ర వసుంధరాసీమ నొలసి
దక్షవాటీ మహాస్థాన దైవతమ్ము-
కాళనాధేశ్వరుండు- శ్రీశైలవిభుఁడు-
తెలుఁగువారల నాశీర్వదింతు రెపుడు'[1]

ఒక జాతి చరిత్ర వ్రాయటం ఆ జాతి సాధించిన వికాసాన్ని వ్యక్తీకరింప చేయటం, గతంలోని సజీవసంప్రదాయం మార్పు చెందే వర్తమానానికీ, రూపు కట్టే భవిష్యత్తుకూ ప్రమాణసూత్రంగా పరిఢవిల్లుతుంది. 'Let a country loose its freedom and not loose its history for the consciousness of the past greatness will encourage a nation to win back its freedom'[2] అని మహాత్మాగాంధీ గత చరిత్ర ప్రాశస్త్యాన్ని ప్రశంసించటం గమనింపదగింది. చరిత్ర కొన్ని వాస్తవ సంఘటనల ప్రామాణిక సంకలనం మాత్రమే కాదు. చరిత్రకారుడు చరిత్రలో దర్శించిన మానవేతిహాస మనోజ్ఞ వికాసస్ఫూర్తి. చరిత్రలోని సన్నివేశాలన్నీ మానవాళికి ఆదర్శప్రాయంగా ఉంటాయని చెప్పలేము కాని, మానవుడు పొందిన పతనోత్థానాల సమీక్షవలన చరిత్ర జాతి గమనింపదగిన, గ్రహింపదగిన నీతిపాఠం మాత్రం కాగలదు. అందువలన చరిత్రకారుడు గతంలోకి చొచ్చుకొని పోతాడు, వాస్తవాలను సేకరిస్తాడు; వానిలోని ఏకవాక్యతనో, వైవిధ్యాన్నో, క్రమవికాస విశేషాన్నో, యుగచైతన్యధారనో, దర్శించి, చరిత్ర నొక క్రమంగా రచిస్తాడు. Carl L. Beeker మాటల్లో - "He (Historian) works in the past, he explores the past in order to find out what men did and thought in the past. His business is to discover and set forth the 'facts' of history."[3] అలా రచింపబడిన చరిత్ర గతాన్ని విలువ కట్టటానికీ, వర్తమానాన్ని దిద్ది తీర్చుకోవటానికీ, భవిష్యత్తుకు పునాదులు వేసికోవటానికీ తోడ్పడుతుందని రాన్కే పేర్కొన్నాడు - "History has had

assigned to it the task of Judging the past, of instructing the present for the benefit of the ages to come."[4]

చరిత్ర రచనలో ప్రధానంగా మూడు విధాలు పాటింపబడుతుంటాయి. 1. వాస్తవ సన్నివేశాలను సత్య దృక్పథంతో కూర్పుచేయటం. 2. చరిత్రగతిలో అంతర్లీనంగా భాసించే మానవస్వభావాన్ని వికాసదశావిస్ఫూర్తితో వివరించి చెప్పే పద్ధతిని ప్రదర్శించటం. 3. చరిత్రగతిలో కనపడే సన్నివేశాల వెనుక తాత్త్వికంగా గోచరించే మానవాంతః పరిణామాన్ని వ్యక్తీకరింప చేయటం. మొదటిది చరిత్ర నిర్మాణ మనిపించుకుంటుంది; రెండవది చరిత్రస్వభావ చిత్రణ మనిపించుకొంటుంది; మూడవది చరిత్ర తత్త్వ సందర్శన మనిపించుకొంటుంది. అయితే, ఈ మూడు పద్ధతుల్లో మొదటిది నేటి చరిత్ర రచనకు ప్రధాన లక్షణ మని సామాన్యంగా భావింపబడటం, రెండవది సాంస్కృతిక, సాంఘిక చరిత్రల రచనలకు తోడుపడే రచనా విధాన మని తలంపబడటం, మూడవది మానవుడు తాత్త్వికంగా సాధించిన ప్రగతిని చిత్రించే రచనకు ఉపాదేయమని గ్రహింపబడటం జరుగుతోంది. అయినా, ఆ మూడూ కలిసి త్రివేణీ సంగమంగా చరిత్ర రచనలో రాణించినప్పుడు చరిత్ర సమగ్రమౌతుందని విజ్ఞులచేత వివేచింపబడుతున్నది. "History must be defined as a reasoned account of man's evolution on earth; it is nothing less than this. The story of man's evolution on earth is essentially the growth of human spirit"[5] - అన్న సర్ ఎల్. బి. నామియర్ మాటలు ఇక్కడ గమనింపతగినవి.

ప్రాచీన నాగరక జాతుల్లో జాతిచరిత్రను భద్రపరచుకోవటం ఎంత ముఖ్యమో, జాతినాగరకతను, సంస్కృతిని, జీవనవిధానాన్నీ, తత్త్వచింతననూ పరిరక్షించుకోవటం కూడా అంత ముఖ్యమనే భావం ప్రబలంగా ఉండేది. అందు వలన, చరిత్ర గ్రంథాలూ, చారిత్రక కావ్యాలూ సమాన గౌరవాన్ని పొందుతూ ఉండేవి. ఈ రెండు రకాల రచనల్లో కావ్యరూపం దాల్చిన రచనలకు ఒక విశిష్ట స్థానం ఉండేది. గ్రీకు, బాబిలోనియన్ సంస్కృతులను, భారతీయ సంస్కృతులను తరతరాల వరకు రక్షిస్తూ వస్తున్నవి అటువంటి గ్రంథాలే. భారతీయ సాహిత్యాలలో వెలసిన పురాణవాఙ్మయం మానవజాతి వికాసాన్ని తాత్త్వికంగా చిత్రించటానికి యత్నించింది. అందువలన వాస్తవ చరిత్ర వాస్తవ దృక్పథంతో

నిర్మించిన రచనలు మనకు లభింపకుండా పోయాయి. పాశ్చాత్య చరిత్రరచనా ప్రక్రియ మన కందుబాటులోకి వచ్చేంతవరకు సాక్ష్యాధారాల నాధారంగా చేసికొని రచించే పద్ధతి మనకు లేకుండా పోయింది. ఈ దృక్పథంతో చూస్తే భారతీ యేతిహాసాలు కాని, పురాణాలు కాని చరిత్రగ్రంథా లని చెప్పలేక పోతున్నాము. కాని, అవి భారతీయ జీవన విధానవిస్తృతిని దర్శన పరిణామాన్ని, ధార్మిక చింతననూ మన కందించే మహనీయ సాహిత్య ప్రక్రియలని మాత్రం నిస్సంశ యంగా చెప్పగలుగుతున్నాం. ఇటువంటి ప్రక్రియ లన్నింటిలోనూ భారతీయులు పురాణాలకు అగ్రతాంబూల మిస్తారు.

"అభి : పరిమళిత యశః
ప్రభవిష్ణులు సుకవిజన సభాజన లీలా
రసటీకాస్థానులు ప్రా
క్ప్రభువుల చారిత్ర మిటు పురాణింపబడెన్"[6]

అని శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ప్రాచీనాంధ్ర ప్రభువుల చరిత్రను పురాణంగా తెలుగులో రచించారు. దానికి 'ఆంధ్రపురాణము' అని పేరుంచారు. చరిత్ర ఈ కృతిలో పురాణింపబడిందని పేర్కొన్నారు. చరిత్రను పురాణించట మంటే ఏమిటనే ప్రశ్న ఇక్కడ మొదట ఉత్పన్నమౌతుంది. ప్రాచీనాంధ్ర ప్రభువుల చరిత్ర రచిస్తే ఇతిహాసం అనవచ్చు. కల్హణుడు కాశ్మీరరాజ చరిత్రను ఇతిహాసంగా నిర్మించాడు. ఆంధ్ర పురాణాన్ని ఆంధ్రేతి హాస మంటే బాగుండును కదా ! అనిపించవచ్చు కాని, ఆధునిక యుగంలో ఇతిహాస, చరిత్ర శబ్దాలు వచన రచనలో వెలువడిన చరిత్ర అనే అర్థాన్ని అందిస్తాయి. మధునాపంతులవారు ఆంధ్రరాజుల చరిత్రలోని రసవత్తర ఘట్టాలను కావ్యస్ఫూర్తితో వినిర్మించాలని భావించారు. దానికి పురాణమని పేరు పెట్టారు. 'ఆంధ్ర పురాణము - సమగ్ర పరిశీలనము' అనే అంశంపై పరిశోధన వ్యాసం వ్రాసిన శ్రీ బి. నాగిరెడ్డిగారు మధునాపంతులవారితో ముఖాముఖి గోష్ఠి సలిపి. ఆ అంశాలను తమ గ్రంథానికి అనుబంధంగా సంతరించి విలువైన విషయాలను అక్షరబద్ధం చేశారు. అందులో ఒకటి రెండు ప్రశ్నలకు ఆ కవి యిచ్చిన సమాధానాలు ఈ విషయాన్ని వివరిస్తున్నాయి. వాటిని ఇక్కడ పొందుపరచటం సమంజసంగా ఉంటుంది. నాగిరెడ్డి -"మీరు ఇతిహాసం వ్రాసి, పురాణమని ఎందుకు పేరు పెట్టారు?" శాస్త్రిగారు - "ఆంధ్రజాతి ప్రాచీనమైన

దగుట ఒక కారణము. పంచలక్షణములలో వంశానుచరిత ముండును. పాల్కురికి సోమనాథుడు బసవని చరిత్రను 'పురాణ' మనుట, కన్నడమున కావ్యశబ్దమునకు పర్యాయ వాచిగా 'పురాణ' శబ్దము వాడుటకూడ దీనికి కారణమైనది."

నాగిరెడ్డి- "కావ్యమున కొన్ని అద్భుతాంశములు చోటు చేసికొనుటపై మీ అభిప్రాయ మేమి?"

శాస్త్రిగారు - "ఉపాసకులకు భగవదంశగ ఏదో వెలుగురేఖ తోచును. వారి యుపాసన అట్టిది కావున సహజమే. ఇట్టి అద్భుతాంశములు చోటు చేసి కొనుటవలన కూడ ఈ కావ్యమునకు 'పురాణ' నామ మన్వర్థమగుచున్నది."7

ఇందులో బలమైన కారణంగా కనబడుతున్నది - కన్నడ సాహిత్యంతో 'పురాణ' శబ్దం కావ్యవాచికా వాడబడుతుండటం చేత 'ఆంధ్ర పురాణ' మంటే ఆంధ్రప్రభువుల చరిత్రను చిత్రించే కావ్యమని శాస్త్రిగారు పేర్కొనటం. అయినా వారే కావ్యంకంటె విలక్షంగా ఉండే పురాణలక్షణాలు అ గ్రంథాని కున్నాయని పరోక్షంగా అంగీకరిస్తున్నారు. బసవేశ్వరచరిత్రను పాల్కురికి సోమనాథుడు 'బసవ పురాణ' మని పిలిచాడు కాబట్టి ఆంధ్రరాజుల చరిత్ర 'పురాణ' మని పిలువబడటం సమంజసమని శాస్త్రిగారు భావించారు. అయితే బసవ పురాణం కన్నడంలో వెలసిన జైనపురాణాల కుండే పంచకల్యాణ లక్షణాలకు ప్రతిగా ఉండే పంచలక్షణాలను తనలో సంవదించుకొని వెలసింది. అంటే వీరశైవ పురాణమైన బసవపురాణం ప్రచ్ఛన్నంగా జైనపురాణలక్షణాలను పాటించిం దన్నమాట. ఆంధ్రపురాణం బసవనిచరిత్రం లాగా మతప్రవక్త జీవితం కాదు; ఏకైక మహాపురుషుని చరిత్రను పంచలక్షణవిశిష్టంగా వినిర్మించిన వస్తువు గలది కాదు. ఆంధ్రచరిత్రను తీర్చిదిద్దిన ప్రభువుల చరిత్రలలోని కమనీయ ఘట్టాల రమణీయ వర్ణనం ఆంధ్రపురాణధ్యేయం అందువలన లోతుగా పరిశీ లించి చూస్తే బసవపురాణ నిర్మాణంకంటె ఆంధ్రపురాణ నిర్మాణం విలక్షణ మని భావించవలసి ఉంటుంది.

'విశ్వనాథ చారిత్రక కావ్యాలు' అనే అంశంమీద పరిశోధన వ్యాసం వ్రాసిన శ్రీ పి. శివరామశర్మ ఆంధ్రపురాణ నామసార్థక్యాన్ని గురించి వివేచిస్తూ ఇలా అన్నాడు- "ఆంధ్రులు అనార్యులు కారనీ, పురాణకాలంనుండి సుప్రసిద్ధులయిన ఆర్యులేననీ, ఆంధ్రభాష సంస్కృతమూలమని, ఆంధ్ర రాజులు వైదిక ధర్మమార్గనిష్ఠారతులని, వారి పవిత్ర ధన్యజీవన ప్రతిపాదకమై ఆంధ్రుల

మహోజ్జ్వల ఇతిహాసాన్ని వర్ణించే కావ్యం కాబట్టి ఆంధ్రపురాణ మని, పురాణ శబ్దంతో వ్యపదేశించటంలోని పరమార్థం."[8] శర్మగారి వివేచనంలో ఆంధ్రపురాణం ఆంధ్రజాతి పురాదశనుండి, ఆంధ్రరాజుల జీవితంలో భాసించే ధర్మమార్గ నిష్ఠా రతిని కాలక్రమాన్ని అనుసరిస్తూ చిత్రించటంవల్ల పురాణ నిర్మాణంలోని ఏక వాక్యతాసూత్రం ఈ కావ్యంలో పాటింపబడటంచేత ఆంధ్రపురాణం పురాణశబ్ద వాచ్య మౌతున్నది.

విశ్వనాథ సత్యనారాయణగారు ఆంధ్రపురాణ నామసార్థక్యమును మరొక విధంగా సంభావించినారు-"ఈ రచన కవియొక్క పాత్రపోషణాదిక వాంఛానిరూ పణము చేయదు. పౌరాణిక కథామూర్తులను ఒక దివ్యమైన వెలుగులో చూపించు టకే ప్రత్నించుచున్నది. ఆంధ్రపురాణశబ్దమే కవియొక్క ఈ దృష్టికి సాక్ష్య ముగా నున్నది." పౌరాణిక కథామూర్తు లనగా విశ్వనాథవారి అభిప్రాయంలో ప్రాచీన చరిత్రలో ప్రసిద్ధులైన వ్యక్తులని గ్రహిస్తే, వారిలో దీపింప బడిన దివ్య త్వమే ఈ కృతికి పురాణనామ ముంచటానికి హేతువైనట్లు భావించటానికి వీలు పడుతున్నది.

ఆంధ్రపురాణకర్త అభిప్రాయాలనూ, విమర్శకుల వివేచననూ సమన్వ యించుకొని ఈ గ్రంథ స్వభావాన్ని నిరూపింపవలసి ఉన్నది. ఇది పురాణీకరింప బడిన ఆంధ్రేతిహాసం. మార్గసంప్రదాయానికి చెందిన మహాపురాణ లక్షణాలు ఈ కృతికి వర్తించవు. పంచలక్షణ సూత్రం దశలక్షణ సూత్రం ఈ కృతిని సమన్వ యించటానికి పనికిరావు. ఉప పురాణ నిర్మాణవైఖరి కూడ దీని కంత అనువైనది కాదు. అయితే ఉపపురాణాలను, పురాణఖండాలను కావ్యాలుగా తీర్చిదిద్దిన ప్రాచీన కవుల నిర్మాణశిల్పం ఈ పురాణ రచనకు పరోక్షంగా స్ఫూర్తిని కలి గించి ఉండవచ్చును. అయినా అట్టి కావ్యస్పృహ ఇందులో సర్వత్ర వర్తించిందని చెప్పలేము అయితే పురాణలక్షణాల్లో ఒకటైన వంశానుచరితాన్ని ఇతిహాసంగా నిర్మించే ప్రక్రియ సంస్కృతంలో ప్రాచుర్యాన్ని వహించింది. రఘువంశాదులా మార్గంలో నడిచినా కావ్య లక్షణాలను తమలో పండించుకొన్నాయి. పురాణంలో ఏకదేశమైన ఇతిహాసంకూడా పురాణశబ్దవాచ్యం కావచ్చునని మధునాపంతులవారు భావించటం గమనింపదగింది. ఆంధ్ర పురాణ నిర్మాణంలోని అంతస్సూత్రం ఈ లక్షణంలో ఉన్నదని భావించటం ఉచితం. సూర్యచంద్రవంశ రాజుల చరిత్రలో వైదికధర్మ మార్గాచరణాన్ని పాటించిన ప్రభువుల చరిత్రను ఒక సమన్వయ

సూత్రంతో కాల్క్రమంగా నిబంధించటం అటువంటి రచనకు ఆయుస్సూత్రం. దానిని ఆంధ్రజాతిని రూపు దిద్దిన ఆంధ్రప్రభువుల పరంపరకు అన్వయించి చిత్రించిన వైఖరి ఆంధ్ర పురాణంలో కనపడటంచేత పురాణశబ్దం దానికి అన్వర్థమౌతుంది. ఆంధ్రపురాణావతారికలోని కవిగారి మాటలు ఇందుకు సాక్ష్యాలు.

"ఒకనాటి బ్రహ్మముహూర్తమునం దొలినాటి తెలుగువారి చరిత్రసారంబు నవపర్వపరిమితంబుగా వింగడించుకొని 'యాంధ్రపురాణ' కావ్యరచనకుం గడంగినాడ; సర్గప్రతిసర్గాది పంచలక్షణ లక్షితము కాక, త్రిలింగ రాజవంశ్యానుచరిత్ర ప్రధానమై యుదయ, సాతవాహన, చాళుక్య, కాకతీయ, పునఃప్రతిష్ఠా, విద్యానగర శ్రీకృష్ణదేవరాయ, విజయ, నాయకరాజ సమాహ్వయంబులగు నవపర్వంబులతో సంభృతమైన యేతత్కృతి" -అని మధునాపంతుల వారన్నప్పుడు ఇది వంశ్యాను చరిత వర్ణనరూపమైన పురాణమని, స్వభావంచేత కావ్యమని, కావున పురాణకావ్య విశ్వరూపమని భావించటానికి వీలుపడుతున్నది.

ఇది ఇలా ఉండగా విమర్శకులు ఆంధ్రపురాణాన్ని చారిత్రక కావ్యాలలో నొక శాఖకు చెందిన దానిగా వివేచిస్తూ వచ్చారు. శ్రీ పి. శివరామశర్మ ఆధునిక చారిత్రక కావ్యాలను మూడు విధాలుగా వింగడించి వివేచించాడు. అవి (1)చారిత్రక వస్తుకావ్యం (2) చారిత్రక రసకావ్యం (3) చారిత్రక తత్త్వ కావ్యం. చారిత్రక వస్తుకావ్యం జీవిత చారిత్రాత్మకమనీ, ఆంధ్రదేశ చరిత్రాత్మకమనీ మరల రెండు విధాలుగా వింగడించాడు. వాటిలో రెండవరకానికి ఆంధ్రపురాణం చెందుతుందని పేర్కొన్నాడు. శర్మగారి మాటల్లో "ఆంధ్రదేశ చరిత్రాత్మక కావ్యాల్లో ప్రసిద్ధమైనవి ఆంధ్రపురాణము, ఆంధ్రసామ్రాజ్యము. ఆంధ్రులచరిత్రను పద్యాల్లో వ్రాశారు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఇక ఆంధ్రులచరిత్రకు సంబంధించిన ఇతిహాస కావ్యమని చెప్పదగింది 'ఆంధ్రపురాణము'. ఇందుదయపర్వం మొదలు నాయకరాజపర్వం వరకు గలతొమ్మిది పర్వాల్లో ఆంధ్రుల చరిత్ర వర్ణించబడింది. సంప్రదాయానుయాయియగు ఈ కవి విశ్వనాథ ఆంధ్రప్రశస్తి వస్త్వాశ్రయఖండకావ్య ప్రయోగాన్ననుసరించి మనోహర వస్తుకావ్యంగా తీర్చాడు. పోనుపోను చారిత్రకత్వం ఎక్కువైనా, మొదటిపర్వాలు కల్పనాకమనీయత్వంతో కూడినట్టివే. అందుకే భావ ప్రధానంగా సన్నివేశోజ్జ్వలంగా, ఉక్తివైచిత్రి ప్రధానంగా కావ్యాన్ని నిర్వహించినా, వస్త్వైక్యము, ప్రధాన రసపోషణము లేనందున, విపులమైన కథా వివరాలను కలిగియున్నందున దీనిని వస్తు కావ్యాలలో సర్వశ్రేష్ఠమైనదిగానే భావించాలి తప్ప రసకావ్యంగా చెప్పడానికి వీలులేదు."[9]

ఈ వివేచనాన్నిబట్టి పరిశీలిస్తే ఆంధ్రపురాణం వస్తుప్రధానమైన చారిత్రక కావ్యంగానో, ఇతిహాస కావ్యంగానో పరిగణింపబడాలి. చరిత్రలోని సత్యనిష్ఠ, కావ్యంలోని రమణీయవర్ణనం రెండూ ఇందులో మిశ్రరూపం తాల్చాయని చెప్పాలి. అయినా, పురాణంలోని ఏకదేశమైన వంశ్యానుచరితంలోని ఏకవాక్యత కూడా ఇందులో సంవదింపబడిందని సంభావించాలి. విశేషమేమంటే, సాతవాహనుల నుండి ఆంధ్రదేశాన్ని పాలించిన రాజులు ఏదో ఒక రాజవంశానికి చెందినవారు కారు. అయినా, త్రిలింగదేశాన్ని పాలించినవారు ఈ దేశ భవితవ్యాన్ని దిద్దితీర్చినవారు. వీరిలో ఆంధ్రజాతికి మౌలికమైన ఒక గుణం అనుస్యూతంగా, అంతస్సూత్రంగా పూసల్లో దారంలాగా సాగివస్తున్నట్లు చిత్రింపబడాలి. ఇది ఈ చారిత్రక కావ్యంలోని పురాణసూత్రం; కావ్యవస్తు సమైక్యతా లక్షణం. వస్తుకావ్యంగా జాలువారిన పురాణంలో ఇట్టి అంతస్సూత్ర సంవిధానమే నిర్మాణ శిల్పం. దానిని ప్రతి పర్వరసోదయంగా చిత్రించటం ఆంధ్రపురాణకర్త సాధించిన కావ్యత్వం. ఇలా సమన్వయించుకొంటే పురాణ శబ్దానికీ, కావ్యవాచియైన పురాణ శబ్దానికీ సార్థక్యం సిద్ధిస్తుంది.

ఆంధ్ర పురాణాన్ని తొమ్మిది పర్వాలలోనే రచించటానికి కారణాన్ని గూర్చి మధునాపంతులవారు నాగిరెడ్డిగారితో ఇలా అన్నారు—"ఆంధ్రుల అభిమాన గ్రంథమైన భారతమున పదునెనిమిది పర్వము లున్నవి. దానిలో సగమీ సంఖ్య. మా ఇలవేల్పు కామేశ్వరి. ఆమె కిష్టమైన సంఖ్య కావున తొమ్మిది పర్వములుగా విభజింపనైనది."[10] ఇందులోని మొదటి నాలుగు పర్వాలూ పూర్వార్ధ మనబడుతుంది. అది 1954 లో ప్రచురితమైంది. మిగిలిన అయిదు పర్వాలు ఉత్తరార్ధంగా 1964 లో వెలువడింది. పూర్వార్ధంలో మధునాపంతుల వారు మొదట చాళుక్యపర్వాన్నీ, ఆ తరువాత క్రమంగా కాకతీయ, సాతవాహన, ఉదయపర్వాలనూ రచించారు. చారిత్రకంగా ఏ పర్వం ముందు రచింపబడినా ఆంధ్రపురాణంలో చరిత్రక్రమంలోనే అవి అమర్చబడి ఉన్నాయి.

ఆంధ్ర పురాణము 20 వ శతాబ్ది నడిమికాలంలో వెలువడింది. దానికి ముందు తెలుగు కవితలో జాతీయాభిమానాన్ని, ఆంధ్రాభిమానాన్నీ రాష్ట్రాభిమానాన్నీ ప్రకటించే ఖండకావ్యాలు కోకొల్లలుగా వెలువడినాయి భారత జాతీయ భావనను ప్రబోధించే రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతంలాంటి చారిత్రక రసకావ్యాలు వెలువడినాయి. అవన్నీ మధునాపంతులవారిని ఆంధ్ర పురాణ రచనకు ప్రేరేపించాయి. శాస్త్రిగారి మాటల్లోనే- "చిన్ననాటినుండి నాకు

సంస్కృత కావ్యములపై అధికమైన యాదర మున్నది. ఈ రచనమునకు నాకు ఆదర్శకావ్యము 'రఘువంశము'. జాతీయోద్యమ కాలమున వెలువడిన ఆంధ్ర పౌరుషము, ఆంధ్ర ప్రశస్తివంటి కావ్యములు చారిత్రకవస్తు వరణమునకు ప్రేరేచినవి. లఘుకావ్యములు, ఖండకృతులే అధికముగా వెలువడుచున్న రోజు లవి. అప్పుడే విశ్వనాథవారు కల్పవృక్ష రచనకు గడంగి బాలకాండమును రచించిరి. రాణాప్రతాపసింహ చరిత్ర, శివభారతముల నప్పుడు చూచుటతో చారిత్రక వృత్తమును గొని మహాకావ్యమును నిర్మింపవచ్చు నను అభిప్రాయము స్థిరపడుటతో రఘువంశము నాదర్శముగా గొని బహునాయకమైన ఆంధ్ర ప్రభువుల వృత్తమును గొని, 'ఆంధ్ర పురాణ' మను పేరుతో"[11] (రచించితిని). ఈ కావ్యాలను బట్టి ఆంధ్రోద్యమ కవిత్వం ఆంధ్ర పురాణావిర్భావానికి ఎలా పూర్వరంగాన్ని సంతరించిందో స్పష్టమౌతుంది. నాటి ఆంధ్ర జాతిలో ఆంధ్ర చరిత్రపై అధికమౌతున్న అభిమానాన్ని డా॥ సి. నారాయణరెడ్డిగా రిలా ప్రస్తావించారు. "విజ్ఞాన చంద్రికా మండలి స్థాపనముతో, మరుగుపడిన ఆంధ్ర చరిత్ర 'త్రవ్వకము' ప్రారంభమైనది. గవ్వలున్నవని అందరనుకొనుచున్న ఆంధ్రుల చరిత్రలో రవ్వలు లభించినవి. దీనితో ఆనాటి చారిత్రకులతోపాటు యువకవులకు కూడ ఆంధ్ర చరిత్ర శేషము లింకను కనుగొనవలె నను ఉత్సుకత కల్గినది. ఆంధ్రుడు, ఆంధ్రజాతి క్రమ పరిణామము, ఆంధ్ర సంస్కృతి నాగరకతల క్రమవికాసము, ఆంధ్రుల సామ్రాజ్య నిర్మాణాదులు, లలితకళలకు ఆంధ్రు లెత్తిన నివాళులు, ఆంధ్రుల వాణిజ్యము, నౌకావ్యాపారము, ఆంధ్రుల కరవాలాంచల ధాళధళ్యములు మున్నగు అనేక విషయములపై ఆనాటి చారిత్రకులు, కవులు తమ దృష్టిని కేంద్రీకరించిరి. చారిత్రకు లాంధ్ర చరిత్రను త్రవ్వి తండముల కెత్తిరి. వానిలోని ఉజ్జ్వల వస్తువులను, స్వర్ణఘట్టములను సంగ్రహించి ఆంధ్ర కవులు మహోద్వేగముతో గీతిక లాలపించిరి. ఆంధ్రకవికి (భావకవికి) శ్రీహర్షునికంటె శ్రీకృష్ణదేవరాయలే ఆప్తుడైనాడు. ఆలకోజ్జయినులకంటె అమరావతీరాణ్మహేంద్రవరములు, నారదభక్తి సూత్రములకంటె త్యాగరాజు కీర్తనలు రక్తబంధువులై పోయినవి."[12] ఇలా పొంగులు వారుతున్న ఆంధ్రాభిమాన చైతన్యమంతా ఆంధ్ర పురాణంలో నాగార్జున సాగరంలా సంపుటీకరింపబడింది. లఘుకావ్యాలూ, ఖండకావ్యాలూ నదుల్లా, సెలయేళ్లలా పారి ఈ మహాకావ్య చైతన్యంలో లీనమైపోయినట్లయింది. యుగ చైతన్యానికి సమగ్ర వ్యక్తిత్వంగా నిలిచిన మహాకావ్య రచన ఆంధ్ర పురాణం.

చారిత్రక కావ్య రచయితకు ముఖ్యంగా ఉండవలసింది చారిత్రకనిష్ఠ. ప్రవాదాలను, కట్టుకథలను, పుక్కిడిపురాణాలను, ప్రమాణరహితమైన వృత్తాంతాలనూ చారిత్రక కావ్యంలో సంఘటించటం ఉచితం కాదు. మధునాపంతులవారు ఆంధ్రుల చరిత్రలోని ఘట్టాలను ఎన్నుకొనేటప్పుడు తగుజాగ్రత్త తీసికొన్నారు- వారిమాటల్లో "నేను కావ్య రచనమున చారిత్రకు లామోదించు అంశములనే చెప్పినాను. కీ.శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఈవిషయమున నాకు తోడ్పడినారు. దానికి తార్కాణముగ రాజరాజుకు - సారంగధరునకు సంబంధించిన వృత్తమును చారిత్రకు లామోదింపరని వదలినాను. రాయలు అప్పాజీగుడ్లు పెరికించిన కథను గూడ వదలినాను. బంధితుడై డిల్లీకి కొనిపోబడిన ప్రతాపరుద్రుని యుగంధరుడు తిరిగి తీసికొని వచ్చెనన్న కథయు నిట్టిదే."[13] మల్లంపల్లివారి సారథ్యంలో మధునాపంతులవారి చారిత్రక వస్తు వ్యవస్థీకరణం జరపటం ప్రామాణికతకు ప్రబలోదాహరణం.

అయితే చారిత్రక కావ్యంలో చరిత్ర ఘట్టాలను యథాతథంగానే గ్రహించాలన్న నియమమేమీ లేదు. వస్తువులో ఔచిత్య పోషణకోసం పాత్ర చిత్రణకోసం కొన్ని మార్పులు కావ్యకర్త చేయవచ్చును. "Minor deviations from **historical truth are not uncommon features of historical verse**"[14] అన్న కె.డి. ఘోష్‌గారి మాట ఇక్కడ మనం స్మరించాలి. మధునాపంతులవారు ఆంధ్ర పురాణంలో ఇలాంటి కొన్ని మార్పులు చేశారు. ఆ మార్పులు ఆంధ్ర ప్రశస్తి కెంత మణిదీపాలైనాయో వారి మాటలు గమనిస్తే మనకు తేటపడుతుంది: "శునశ్శేపుని కథలో ఆంధ్రజాతి శప్తజాతి. ఈ యంశమును పౌరాణికు లామోదింపరు. ఆంధ్రు డేలిన దేశ మాంధ్రదేశ మని చారిత్రకు లామోదింతురు. అందుల కని యించుక మార్చి శాపవృత్తాంతమును తొలగించి నిపుణముగ సంవదించితిని. విశ్వామిత్రుడు క్షత్రియుడు. కావున విశ్వామిత్రుని పుత్రుడే ఆంధ్రరాజ్య స్థాపకుడు కావలెనను అంతరార్థమును ఇందున్నది. అట్లే హాలుడు, భార్య అపహసించుటవలన సంస్కృతభాష నభ్యసించె ననుటకు బదులుగా, విజ్ఞానమంతయు సంస్కృతమునం దుండుటనే జ్ఞానపరివృద్ధికై సంస్కృత భాషపై నాసక్తి పెరిగెనని నిపుణముగ మార్చితిని. హాలపాత్ర కుదాత్తత చేకూర్చుట దీని లక్ష్యము"[15] ఇట్టివి ఆంధ్ర పురాణమున మరికొన్ని కలవు. వాని కన్నింటికి మధునాపంతులవారి ఔచిత్యదృష్టియే పరమ ప్రమాణము. మంచికైన మార్పు మన్నింపదగినదే.

ఇవియన్నియు ఒకయెత్తు, ఒక్కొక్క పర్వమునందు ఆంధ్ర జాత్యభిమానము నొక్కొకవన్నెగా వెలిగించి శిల్పీకరించిన విధమంతయు మరియొక యెత్తు. ఆంధ్రజాతికి అభిమానము మూలకందమని మధునాపంతులవారి నిష్కర్ష. దానిని ఆంధ్రునియందు మొదట స్థాపించుట ఆంధ్రపురాణ వస్తుబీజము.

ఉదయపర్వంలో విశ్వామిత్రుడు దేవరాతుణ్ణి సంరక్షించి తన పుత్రులను ఇలా ఆదేశించాడు—

"తీపుల నించి వేల్పుల మదిం గరగించి మహాధ్వరంబునన్
యూపము కట్టుఁ బాసి పునరుద్గతి నాయొడిఁ బడ్డ యీఘన
శ్రేష్ఠుఁడు- దేవరాతుఁడు-ప్రసిద్ధుఁడు- వీనిని గన్న కాన్పుగా
నే పరికించుచుం బరిచయించితి సంచితబంధవాసనన్".

"అగుటన్-మీ కితఁడన్న; మీ రితని నెయ్యం బెంచి సౌభ్రాత్ర మే
పుగ వర్తింపుఁడు నేఁటినుండి; తలవంపుల్ రాని, సంసారపున్
నొగలున్ సోఁకని యెకమత్యపుఁ బసందుల్ మీయెడన్ దిద్దు పె
ద్దగఁ బూజింపుఁడు వీని స్వీయసకలార్థత్యాగదీక్షాఖనిన్."

తండ్రి మాటల నాదరించి విశ్వామిత్రపుత్రులు దేవరాతుని గౌరవించి సేవించటానికి అంగీకరించారు కాని, వారిలో ఆత్మాభిమాన సమున్నతుడైన 'ఆంధ్రుడు' మాత్రం తండ్రి మాటకు ఎదురు తిరిగాడు.

"బన్నము లెన్ని పైఁబడుచు వచ్చిన నొచ్చిన నాత్మగౌరవ
స్కన్నత సైఁపలేని గుణశాలి- యుదాత్తము క్షత్రధర్మ మా
పన్నత నొంద నోరువని పౌరుషవంతుఁడు శాంతుఁ 'డాంధ్రుఁ' డం
త న్నెరవాదియై పలికెఁ దండ్రి కనుంగవ జేవురింపఁగన్."

'శరణీయుండవు తండ్రి! విప్రునిమనశ్శల్యంబుఁ ద్రోపాడ నె
వ్వరు కాదందురు? కాని యౌరసతఁ జూపన్ క్షాత్రసంపన్నతా
గురుతల్ నిల్చునె! పూవుఁబానుపుపయిం గూర్చుండఁగాఁ జేసి యె
ల్లర మర్చింతుముగాక! లోనితలఁ పేలా దాఁచి మాటాడుటల్!'

'తన యౌదార్యము పొంగులై చవులు చిందన్ స్వార్థమున్ వీడి జీ
వనదానంబున సార్వభౌము బ్రతికింపన్ మున్ను బాసాడి, యా

డినమాటన్ దిగనాడి, కట్టకడ నోడెం బ్రాణపుందీపి ము
న్నాఁకనగా; గట్టి భయస్థు పెత్తనము నాంధ్రుం డెట్లు లగ్గించెడిన్ ?'

'క్షత్త్రజాతి ధర్మసంత్రాణమును గోరి
యగ్గినులుకు మన్న నళుకు సెంద;
బరమతపముఁ గొన్న బహ్మర్షులుగ మిమ్ము
గొలుచుకొందు - నెడఁద నిలుపుకొందు.'

"జనకునాదేశమునకుఁ గా దనెడునంత
గుండె కలవాఁడఁ గాను; లోఁకువన నడంగి
క్షత్త్రధర్మమ్మునకు విషక్షతులు తెచ్చి
యుండఁ గలవాఁడఁ గాను; బో నుంటి నిపుడ."

"అని మారాడి, స్వతంత్రతారతి స్వధర్మాపేతదాస్యమ్ము పా
ల్గొనఁ గాలాడక తండ్రి వీడి యనురక్తుల్ సోదరుల్ కొంద ఱ
ల్లన వెన్నాడఁగ 'నాంధ్ర'నేత యిటు నేలన్ మిట్టి తొల్లింటఁ బా
లనముం జేయుట నాంధ్రదేశ మని పిల్వంజెల్లె నీతీరునన్." (107-112)

భీరువునకు తలయొగ్గి జీవించే నిరభిమానపు బ్రతుకును బ్రతకలేక, కన్నతండ్రి మాటను ధిక్కరించి ఆత్మాభిమానంతో ఆంధ్రుడు సోదరులను, తండ్రిని వీడి స్వతంత్రప్రవృత్తితో, పౌరుషతేజంతో ఆంధ్రదేశాన్ని స్థాపించాడు. ఆంధ్రజాతి ఆదిపురుషుని చిత్రించే యీ ఘట్టంలో ఆత్మాభిమానం, క్షత్త్రియాభిమానం బీజాలుగా నాటబడ్డాయి. ఆంధ్రుని సంతతికి అభిమానమే జీవ లక్షణమై నిలిచింది. ఆంధ్రపౌరుషమే చరిత్రగతిని తీర్చిదిద్దింది. ఒకజాతి లక్షణంలో మూలగ్రంథిగా భాసించే గుణాన్ని అధికరించి కథను ఆరంభించటం ఆంధ్రపురాణంలోని కార్య బీజం కావ్యశిల్పం.

ఉదయపర్వం ఆంధ్రపురాణంలో సర్గంలాంటిదైతే సాతవాహనపర్వం ప్రతిసర్గంలాంటిది. ఇందులో వర్ణింపబడిన దీపకర్ణి వృత్తాంతం, హాలసాతవాహనుని వృత్తాంతం ఆంధ్రుల హృదయాలను రసోన్నిద్రంచేసిన ఘట్టాలు. మధునాపంతులవారి కవితామాధుర్యంలో అవి స్వాదుతాన్ని సంతరించుకొన్నాయి. ఈ పర్వంలో మొదటి అంశం హాలశాతవాహనునిలో దైవాంశ ఉన్నదని సూచించటం.

ఇది చారిత్రక సత్యమా అనే అనుమానం మధునాపంతులవారికే ఉన్నట్లున్నది. అయినా వినవస్తున్న ఇతిహాస మది. అందువలన.

'దీపకర్ణి యేల్బడియు, శక్తిమతి మృతియు,
యక్షసాక్షాత్కృతియు, శాపమోక్షణంబు
గాథలో - కాక కట్టినకథలో కాని
తనరె దైవాంశ సాతవాహనునిలోన.' (సా.ప. 52)

అని పేర్కొని చారిత్రక కావ్య రచయితగా తమ బాధ్యతను నిర్వహించినారు శాస్త్రిగారు.

హాలసాతవాహన చక్రవర్తి చరిత్రం ఆంధ్రజాతికి వెలుగొందే సాహిత్యాభిమానానికి సజీవ ప్రతీకగా వినిర్మించటం ఆంధ్రపురాణ విశేషం. హాలుడు ప్రాకృతసాహిత్యవేత్త. అతని పట్టమహిషి లీలావతి గీర్వాణ విద్యాసరస్వతి. గుణాఢ్య శర్వవర్మలు ఆస్థాన పండితులు. విద్వద్గోష్ఠులు, కవితాచర్చలు హాలునిసభలో నిత్యవినోదాలు. గాథాసప్తశతి హాలుని ప్రాకృత కవితాభిమానానికి నిలిచిన అక్షరమణిదీపం. అతని సాహిత్యరసికత్వాన్ని ఆంధ్రపురాణకర్త విశిష్టంగా వర్ణించారు.

"మానవుని జీవితమ్ము మేలైన కబ్బ;
మందు సత్కవి యేఱిన బిందు వొకటి
యొక మహాకావ్యమౌ; నది సుకవి జాలు;
కావ్యతాసిద్ధి కొక్క శ్లోకమ్మె చాలు."

"అను సిద్ధాంతముఁ బెంచి గాథలను డాయంజేరి విద్వన్మణుల్
వినిపింపన్ క్షణశః ప్రతీక్షమెయి నాలించున్ మహారాజు; హా
లుని వీనుంగవ శంఖమై కవుల సుశ్లోకాళి తీర్థంబునై
తనరెం గావున నిల్చెఁ బ్రాకృతపు గాథల్ మాధురీసాధువుల్."
(సా.ప. 62-63)

ప్రాకృత కవితాభిమానియైన హాలుని సభలో శర్వవర్మ గుణాఢ్యుల నడుమ గీర్వాణభాషలో చర్చలు సాగుతుండేవి. వారి మధ్య తీర్పు చెప్పటానికి రాణి న్యాయనిర్ణేతగా వ్యవహరిస్తుండేది. హాలునికి గుణాఢ్యుడంటే ప్రీతి, లీలావతికి శర్వవర్మ అంటే అభిమానం. ఒకవిధంగా వీరిరువురూ దేశిమార్గ కవితాఫణితు

లకు ప్రతీకలుగా ఉండేవారు. ఒకనాడు జరిగిన సారస్వత గోష్ఠిలో శర్వవర్మ సంస్కృత భాషాకావ్యచర్చ సాగించాడు. అప్పుడు రాణి "ఇంతకును భాషాభిజ్ఞతనుబట్టి కదా రసజ్ఞత" అని రాజును ఎత్తిపొడుస్తుంది. ఆ మాట హాలుని మనసులో ములుకులా గుచ్చుకుంటుంది. సంస్కృతభాష నభ్యసించాలనే సంకల్పం జనిస్తుంది. శర్వవర్మ సంస్కృత వ్యాకరణాన్ని ఆరునెల్లో రాజుకు బోధిస్తానని శపథం చేస్తాడు. అది అసాధ్యమని గుణాఢ్యుడు పేర్కొంటాడు. ఆరునెలలలో రాజును గీర్వాణపండితుణ్ణి చేస్తే—

"వదనపదమైన దేశీయ భాష విడిచి
మద్గళగ్రంథి సురవాణి మహిమ మఱచి
కేవలము ప్రాణమైన ప్రాకృతముఁ దుడిచి
మౌనినై యుందుఁ గాంతారమధ్యమందు." (సా. ప. 109)

అని ఘోర శపథం చేస్తాడు. శర్వవర్మ కుమారస్వామి వరప్రసాదంతో నూతన వ్యాకరణ సృష్టి చేసి హాలుణ్ణి ఆరు నెల్లో సంస్కృతభాషా కోవిదుణ్ణి చేస్తాడు. గుణాఢ్యుడు వనవాసానికి బయలుదేరుతాడు. హాలుడు సంస్కృతభారతీ సమారాధనం చేస్తాడు. దేశమంతా దేవవాణికి, వేదప్రశస్తికి రంగభూమిగా మారుతుంది.

"ప్రాకృతగోష్ఠులం బ్రతిరవమ్ముల నిండిన రాజధానిలో
నేకడఁ జూడ హాలపృథివీంద్రుడు మెచ్చెడి దేవభారతీ
శ్రీకవితా ప్రశంసలె రుచింప వచింతురు నేఁడు-రాజుతో
లోకము-వాఙ్మయమ్ము-కళలున్-మతమున్-సకలప్రవృత్తియున్."
(సా. ప. 145)

గుణాఢ్యుడు మహారణ్యమధ్యంలో నివసిస్తూ పైశాచీప్రాకృతంలో బృహత్కథను రచిస్తాడు. దానిని శిష్యుల కిచ్చి హాలచక్రవర్తివద్దకు పంపుతాడు. భూర్జరపత్రాలపై రక్తాక్షరాలతో లిఖింపబడిన ఆ కావ్యం గుణాఢ్యుని జీవిత సారంలా గోచరిస్తోంది. హాలు డా గ్రంథాన్ని చూచి నిరాదరిస్తాడు.

"తోఁచినతీరు మెచ్చవలదో! వెలసేయక పెంచుకొన్న యీ
వాచవికైతకున్ మొగము వాచితిమే! కృతిలోని బాస-పై
శాచిగ, వ్రాత-రక్తముగ సాగిన భూర్జరపత్త్రిసంతతుల్
మా చవిగావు, మీ యటుకలం జెదపుర్వుల కిందు తిండిగన్" (174)

అని ఈసడిస్తాడు. రాజతిరస్కారానికి పాత్రమైన తన కావ్యాన్ని అగ్నికి ఆహుతి చేయటానికి పూనుకొంటాడు గుణాఢ్యుడు. సత్కవితను మెచ్చని అరసిక ప్రభువును నిందిస్తాడు. గుణాఢ్యుని వేదనను మధునాపంతులవారు మనోహరంగా చిత్రించారు. తెలుగువా రీఘట్టాన్ని తెలుగు సాహిత్యంలో వెలసిన అపూర్వ కావ్య ఘట్టంగా భావించి పారవశ్యంతో చదువుకొంటారు. మచ్చు కొకటి రెండు పద్యాలు—

"దాఁచితి, నేండ్లుగా బహువిధంబుల నోఁచితి, రక్తమాంసముల్
వేఁచితి; గమ్మనై రుచులు పెల్లగు నీ యుపహారభుక్తి నీ
వాచవితిండి కంచుఁ గొనివచ్చితిఁ బావక! వాఁడినాలుకల్
చాఁచుము! తప్తవీక్షణములం దనియింపుము పేదపండితున్"

"సౌజన్యం బను మేఁకతోలు మెయి నాచ్ఛాదించు కొన్నట్టి యీ
రాజుల్ రాజులు కారు; బెబ్బులులు; వీరా, మా శ్రమస్వేద పా
థోజాలంబు హరించువారు, కృతి యిత్తు న్మెచ్చి కై కోఁగదే
నీ జిహ్వాగ్రములన్ ధనంజయుఁడ! రాణింపం జిరస్థాయిగన్."

"మీసలు తేనియల్, విసపు మెచ్చులు, నచ్చముగాని కౌఁగిళుల్
మోసపుఁగానుకల్, మొగముముందరి నవ్వులు నొల్కబోసి వి
శ్వాస కృతజ్ఞతా హృదయ భావుకతల్ దిగఁద్రోసి జీవితో
ల్లాసముఁ దీర్చుకొన్న నృపులా! కవితాకళ నుద్ధరించుటల్."

(సా. ప. 190-192)

నృపాల నిరసనంలో ధూర్జటి కవితను మరిపించారు మధునాపంతులవారు. కావ్య హోమఘట్టం కరుణారసోన్నిద్రం.

"చిమచిమారావ పావక శిఖలలోనఁ
గబ్బ మొక్కొక్క యాకుగాఁ గాలుచుండఁ
గవికి వేయిదళాల తమ్మివిరిఁబోని
హృదయ మొక్కొక్క రేకుగాఁ బ్రిదులుచుండె."

"ఏడులక్షలయెత్తు కావ్యేందిర యిది
యనవశేషముగా దగ్ధమగుచె యిటులు

కటకటా! యని ప్రకృతి భగ్నహృదయమున
మొరలువెట్టె మహీధరదరులు మ్రోఁగ."

"పులుఁగులకూనడెందములు సొక్కెఁ; జెమర్చెను జంతుపాళి క
న్నులు; శిలలుం గరంగినవి; నూల్కొని మ్రోడులు నేడ్చె నద్భుతో
జ్జ్వల నవకల్పనా మహిత చారు కథాకృతి యిట్లు గాలిచె
చ్చెలి వెడయుచ్చులంబడి కృశించి నశించుచునున్న నయ్యెడన్."
(సా. ప. 201 - 203)

కావ్యహోమానికి ప్రకృతి ద్రవించింది; అన్యాయానికి ఎలుగెత్తి ఘోషించింది. చారులవలన ఈ ఘోరాన్ని విన్నాడు హాలుడు: హుటాహుటి గుణాఢ్యుని మ్రోలకు పరుగెత్తి వచ్చాడు. ఆర్ద్రిదై కవితో ఇలా అన్నాడు-

"ఏమి మహానుభావ! యిది యేమి కవిత్వవధూటి నీగతిన్
హోమ మొనర్తువే? యొకరుఁ డొప్పని మాత్రన కబ్బముల్ బుధ
స్తోమము నాదృతుల్ గొని రుచుల్ వెల్గిగక్కవె? చాలుఁజాలు న
య్యా! మము నీకలంక విలయంబున నంకిలివెట్టి గుంజెదే?" (213)

అని బృహత్కథను దోయిలించి గ్రహిస్తాడు హాల మహారాజు. గుణాఢ్యుడు యోగ సమాధిలో ప్రవేశించి పరమపదాన్ని అందుకొన్నాడు. బృహత్కథగాథ హాలచక్రవర్తి చరిత్రలో మచ్చగాని మచ్చగా మిగిలిపోయింది.

ఈ గాథ నింత పెంచి వ్రాయటంలో ఆంధ్రపురాణకర్త పాటించిన సమన్వయ శిల్పం అనన్య సామాన్యం. ఇవి చరిత్రలలో ఆంధ్రవాఙ్మయం రాజుల ప్రాపకంలో పెరిగిన వైఖరి కిది భావికథార్థవ్యంజకమైన పతాకస్థానం. ఆంధ్ర ప్రభువులలో దేశభాషాభిమానం సహజంగా ఉన్నా సంస్కృత సాహిత్యాభిమానం రెండింతలుగా కనబడుతుంది పదునేనవశతాబ్ద్యంతం వరకూ. అయినా, ఆంధ్ర కవుల ఆంధ్రాభిమానంతో తెలుగుకవిత వెలుగురేకలను విరజిమ్ముతుంది. రాజులు దాని కవితాగౌరవాన్ని మన్నించి పోషించే ప్రవృత్తి కనపడుతుంది. శ్రీనాథుడు ముత్యాలశాలలో స్వర్ణాభిషేకం చేయించుకొన్న నాటిదాకా తెలుగుకు రాజాస్థానాలలో సంస్కృతానికి వలె సమానగౌరవం లభించలేదు. అయినా, తెలుగు రేడులు దేశీయకవితా పోషణను చేస్తూనే ఉన్నారు. గుణాఢ్యుడు దేశికవితాధ్వజానికి ప్రతీక. హాలుడు సంస్కృతాభిమాన మున్నా తెలుగు కవితకు అండదండగా

నిలిచిన తెలుగు రేకుల సారస్వతప్రీతికి ప్రతీక. తెలుగు కవితకు వచ్చిన గౌరవం ఆంధ్రకవుల సంతత సారస్వత సమాజానికి ఫలంగా అందిన అక్షరపాయసం. భావి చరిత్రలోని ఇట్టి ప్రవృత్తిని వ్యంగ్యంగా ధ్వనింపచేసే ఆంధ్ర సాహిత్యాభిమానానికి ప్రతీకగా సాతవాహన పర్వాన్ని విసిర్మించటం మధునాపంతులవారి పురాణ కావ్యరచనలో రాణించే అంతస్సూత్ర శిల్పం.

హాలచక్రవర్తి గుణాఢ్యునితో 'ఏమి మహానుభావ!' అన్న పద్యంలో వెలువరించిన భావాలు. తెలుగు కవుల ప్రవృత్తులలో భాసించే స్వతంత్రతాబుద్ధిని సూచించేవిగా ఉన్నాయి. రాజులు మెచ్చనంత మాత్రాన, నరాంకితం కానంత మాత్రాన ఉత్తమకవిత్వం నశించిపోదు. ప్రజలు, పండితులు మెచ్చి తమ నాల్కలపై నిలుపుకొన్నదే నిజమై కవిత అని హాలచక్రవర్తి ప్రబోధం. ఇట్టి ఆలోచన ధారలోనుండే తరువాత పోతన, ధూర్జటివంటి కవులు తెలుగులో తలయెత్తారు. అందువలన, నరాంకితం చేయక తమ కవిత్వాన్ని దైవాంకితంచేసే కవుల చిత్త వృత్తులలోని ఆత్మాభిమానాన్నీ, అర్చనా విధానాన్నీ కూడా సాతవాహన పర్వం ధ్వనిస్తోంది. బిందుతుల్యమైన ఈ పర్వం భావికథా విస్తృతికి వికాస కేంద్రం.

ఆంధ్ర పురాణంలోని చాళుక్య పర్వం ఆంధ్రప్రభువుల భాషాభిమానాన్ని వ్యక్తంచేసే వాఙ్మయ మణిదీపం. రాజరాజ నరేంద్రుడు డా ప్రవృత్తికి సజీవ ప్రతీక. ఆ చాళుక్య ప్రభువునకు పూర్వం ఆంధ్రభారతికి అంధకారయుగం. దానిని కవి చెప్పిన తీరు కమనీయం.

'నిలువ న్నీడ యొకింత లేమి నెడ నెంతే వాడి తారాడు నీ
తెలుఁగు న్నిల్పి చళుక్యవంశసుయశోదీపంబు నిత్యప్రభో
జ్జ్వలముం జల్పిన రాజరాజునకుఁ బూర్వం బాంధ్రి కన్నీటిచా
అలు చాలై కదలింపలే దకట! యే రాజన్యు చిత్తాబ్జమున్?'

'పరిణతమైన సంస్కృతముపైఁ గల ప్రేముడి యెంత చేసినం
దిరపడ దాంధ్రవాణియెడఁ దిన్నని తెల్గునఁ దల్లిచాటు దై
పెరిగిన కారణమ్మొ, నడిపింప వలంతుల నున్నవార లె
వ్వరు కనరామినో, తెలుగుబాసకుఁ జీకటు లాశతాబ్దముల్.'

(చా. ప 36, 38)

ఆ చీకటి రాత్రి రాజరాజు ప్రభాకరోదయంతో అంతమైపోయింది. ఆంధ్రభారతి

నుద్దేశించి ఆ రాజు చేసిన ప్రార్థన మధునాపంతులవారి కమనీయ కల్పనకు కర్పూర నీరాజనం. తెలుగుజాతికి ప్రతినిధిగా అతనిమాట లివి-

'నతు లర్పింతుము బిడ్డలందు నభిమానం బుంచుమమ్మా! కృత
జ్ఞతఁజూపింతు మభిజ్ఞశేఖరుల కాశాస్యంబు లిమ్మా। నిరా
కృతిఁ జూపించితి మిన్నినాళు లిఁక సైరింపంగదమ్మా! సర
స్వతి! దేశస్థులకుం గృపామతిని బ్రజ్ఞాభైక్షముం బంచుమా।'

'నవకవితార్థగానము విననన్ సకుతూహలులై కళాపిపా
సువు లిట వేచియుండిరి; విశుద్ధతరస్వరరీతిగీతికా
రవము వింపంచికం జొనిపి రాగరసప్రసరంబుగాగఁ బా
డవె విధిరాజ్ఞి! మా యెదలు డక్కఁగొనం గరుణార్ద్రచిత్తవై.'

(చా. ప. 43, 46)

రాజరాజు పాత్రలో ప్రతితెలుగువాడు ప్రతిబింబించేటట్లు రచించిన ఈపద్యహారం భారతీస్తుతికి భవ్యోదాహరణం.

నన్నయ భారతరచన రెండున్నర పర్వాలతో ఆగిపోవటానికి విమర్శకులు చారిత్రకులు ఎన్నో కారణాలు చెప్పారు. నన్నయ పొందింది సహజమరణమన్న అంశాన్ని మధునాపంతులవారు ప్రతిపాదించారు; 'శ్రీవాణీ' శ్లోకంలోనే భారతం ముగ్గురు పూర్తిచేసేటట్లు ఋషివంటి నన్నయ పల్కిన పల్కులోనే ధ్వనిస్తున్న దనే విశ్వనాథ వారి విమర్శ మధునాపంతులవారికి తెలుసు. ఇతరులు చేసిన కల్పనను స్వీకరించకుండా, స్వోపజ్ఞను ప్రకటించటం ప్రతిభావంతుల లక్షణం. వస్తువ్యంగ్యాన్ని ఆశ్రయించి మధునాపంతులవా రీసందర్భంలో ఒక చక్కని కల్పన చేశారు. వ్యాసభారత పర్వాల తాటియాకు ప్రతులుకొన్ని కట్టలుగా కట్టబడి ఉన్నాయి. వాటిలో మొదటి కట్ట మొదటి మూడు పర్వాలలో కొంత తక్కువగా ఉన్న భారతభాగం ఉన్నది. నన్నయ అనువదించటానికి ఆ కట్టను మొదట ఎత్తుకొన్నాడు. రనన కూడా ఆ గ్రంథభాగానువాదంలో ఆగిన దని ఈ కల్పనలోని చమత్కారం.

'లలితములైన యక్షరముల న్వెలసిల్లెడి ప్రాంతతాటియా
కుల ప్రతి-మూలభారతము కొంత దిగంబడి మూడుపర్వముల్
కలిగిన దానిఁ-గట్ట యెడగా విడగొట్టుచుఁ వ్యాసపీఠిపై
నిలుపుటయందె యొక్క రమణీయత కన్పడఁ బట్టె గంటమున్.

'గంటము పట్టులో నొకయఖండ భవిష్యము తోఁచిపల్కు-వా
ల్గంటికి నాటపట్టు దొరకం గవితాదయితుండు భావనా
ఘంటలు 'ఠంగుఠంగు' మనగా జయముం దెసిగింపఁబూనె వె
న్నంటి పురాజనుస్సుకృతమైన సరస్వతి తొందరింపఁగన్.'

'వ్రాసిన దానినిం జెఱిపి వైవని బాసఁ 'జకారకుక్షి'యా
వ్యాసకవీశుఁ బోలక మహాగిరి నిర్గత గాంగ నిర్ఝరీ
భాసురశయ్యలో వెనుక వంపులు సొంపులు దిద్దుకాళికా
దాసునిబోలి గంటమును దాలిచె నన్నయ మేలి తెన్నులన్'.

(చా. ప. 96-98)

భారతావరణ ఘట్టం ఆంధ్రపురాణంలో ప్రసన్న గంభీరంగా సాగింది. చాళుక్య పర్వంలో రాజకీయ చరిత్రకంటె ఆదికావ్యావతార చరిత్రయే అధిక స్థానాన్ని ఆక్రమించింది. రాజరాజు భారతీ స్తవం, నన్నయ గతించిన తరువాత ప్రకటించిన విషాదం, నన్నయ నారాయణ భట్టుల మైత్రి చరిత్రపుటలలో మనకు కనబడవు. అంధ్రపురాణంలో కావ్యస్పృహతో కాంతుల నీనుతూ ప్రత్యక్ష మౌతాయి. ఈ పర్వం చదివిన తెలుగువాడు స్వీయభాషా సాహిత్యాభిమానాలను మనసులో స్థాయిభావంగా చర్వణం చేయగలడు. రసజ్ఞులైన మధునాపంతుల వారు పురాణ రచనలో వెలయించిన కావ్యరచనాశిల్ప మిది; రససూత్ర మిది.

కాకతీయ పర్వాన్ని ఆంధ్ర దేశాభిమాన ద్యోతకంగా చిత్రించటం ఆంధ్రపురాణ సంవిధాన శిల్పం. తెలుగునాడును ఒక్కగొడుగు క్రిందకు తేవాలన్న యత్నం జరిగింది కాకతీయ ప్రభువుల కాలంలోనే. గణపతి దేవు డాయత్నంలో బ్రహ్మశక్తి; రుద్రమదేవి విష్ణుశక్తి; ప్రతాపరుద్రుడు రుద్రశక్తి; ఆ మూడు శక్తులను వ్యక్తీకరించటానికి మధునాపంతులవారు కాకతీయ పర్వాన్ని విరివిగా వాడుకొన్నారు.

'గణపతి దేవుని పరిపా
లనమున వాణిజ్యమును జలధియానంబున్
బెనుపొందె మెల్లమెల్లఁగఁ
దనుపొందె స్వదేశజాతి ధర్మ ప్రకృతుల్."

(కా. ప. 17)

గణపతిదేవ వర్ణనంలో వస్తుధ్వని నాశ్రయించి యుగప్రవృత్తిలో ప్రజ్వలించిన దేశాభిమానాన్నీ, జాత్యభిమానాన్నీ, ధర్మాభిమానాన్నీ మధునాపంతులవారు

సూచించారు. కాకతీయులలో దేశాభిమానం; కాపయనాయకాదులలో జాత్యభిమానం, విద్యానగరపర్వంలో ధర్మాభిమానం క్రమంగా వికాసదశలను పొందేటట్లు చిత్రించే తమ కావ్యరచనా ప్రణాళికకు శాస్త్రిగారు రేఖాచిత్రాన్ని ఈ పర్వంలోనే గణపతిదేవుని పాలనంలో ప్రదర్శింపబడినట్లు వర్ణించారు. అంతశ్శిల్పాన్ని పతాక స్థానంగా నిలిపి రచించటం ప్రౌఢకవికి మాత్రమే సాధ్యమైన కథాకథన శిల్పం.

రుద్రమదేవిని తెనుఁగురాణిగా కవి వర్ణించాడు. సింహాసనాధిష్ఠితురాలైన ఆ మహారాజ్ఞి 'మగలకు మగంటిమి నేర్పు మగువవాసి' (25)గా కీర్తించాడు. 'కోటి మన్మథమూర్తుల కూటమందుఁ, గనికరము తోఁచి మూడవకన్ను దాఁచి' యెదుటఁ గనవచ్చు నర్ధనారీశునివలె రుద్రమదేవి రూపాన్ని అభివర్ణించాడు. మహాదేవరాజుపై యుద్ధం ప్రకటించి రణోత్సాహాన్ని ప్రకటించిన రుద్రమదేవి యందు సత్యభామాస్ఫూర్తిని ధ్వనింపచేశాడు.

"కానీ, యా 'నరకాసురుండు' తన సంగ్రామక్రియాక్రీడ మా
పై నెంతెంత వెలార్చునో కనెద; నిల్వన్ దిక్కు ప్రొమొక్కెదిమొ
ఱ్ఱో! నా దోసము సైఁపు తల్లి! యని యట్టుం జూఁచి వేడంగ నా
దీనుం గాచెదఁ; జూచెదం గరుణ నర్తింపన్ క్షమామూర్తినై."

(కా. ప. 88)

క్షాత్రతేజం, క్షమావీరం ఒక కొమ్మపై విరిసిన రెండు పూవుల్లా విష్ణుశక్తియైన రుద్రాంబలో చిత్రించటం సార్థకం; తత్త్వగంభీరం!

ప్రతాపరుద్రుడు డాంధ్రుల అభిమాన వీరుడు. అతని వ్యక్తిత్వంలో దేశాభిమానం, సాహిత్యాభిమానం సంఘటించినట్లు చిత్రించటం ఔచిత్యం.

'తెలుఁగు- త్రిలింగ- మాంధ్ర మను తీయనిశబ్దము విన్నయంతనే
పులకలుఁదేఱి తొల్లిటికవుల్ విహరించిన భవ్యకావ్య వీ
థుల నడయాడి తన్మయతతో నిరతంబును విస్మరించు న
వ్వలతి ప్రతాపరుద్రుఁడు సెబా సని పండితు లండఁ జేరగన్.' (144)

ప్రతాపరుద్ర పరాక్రమమూర్తిని తేటపరిచే ఒక్క తేటగీతి-

'భరతఖండంబు జల్లించి పట్టి తేర్చి
పొల్లు తొలగింప మిగిలిన పోటరులను
వాటముగఁ బెంచు కాకతీశ్వరుని పెంపు
ఢిల్లి రాజుల ప్రక్కలో బల్లె మయ్యె.' (303)

ప్రతాపుని విజయవర్ణనలు తెలుగుపౌరుషానికి వెలుగుదివిటీలు. కాలం కలిసిరాక ప్రతాపుడు బందీయై ఢిల్లీకి గొంపోవబడుతున్నప్పుడు ఆ వీరుని హృదయంలో మెదలిన భావాలను చిత్రించిన వైఖరి దేశభక్తి ప్రబోధంగా ఉన్నది.

'కుతుకము లేని దాస్యమునఁ గుందెడి దేశసవిత్రి యిక్కటుల్
జతనమునం దొలంపుఁడి ప్రజల్! విజయధ్వజమున్ బునఃప్రతి
ష్ఠిత మొనరింపుడీ! తెలుఁగుసీమ స్వతంత్రపుజోతిఁ బెంపుఁడీ!
తతభుజశౌర్యుఁడైన వినతాసుతు వీరకృతుల్ తలంపుఁడీ!' (405)

ప్రతాపుని ప్రబోధం తెలుగు పౌరుషాన్ని ప్రజ్వలింప చేసేది. నర్మదలో మునిగిన ప్రతాపుడు యోగసమాధిలో ప్రవేశించిన రాజర్షి. విషాదాంత రూపక నాయకుని లాగా ప్రతాపుడు పఠితల ప్రశంసల నందుకొనేటట్లు చిత్రించటం శాస్త్రిగారి శిల్ప చాతురి.

పునః ప్రతిష్ఠాపర్వంలో ఆంధ్రులు యవనులవలన కలిగిన పరాజయానికి ప్రతిగా పరాక్రమాన్ని వెలయించి ఓరుగల్లును సాధించి జాత్యభిమానాన్ని కాపాడు కొంటూ ధర్మాభిరతిని ప్రపంచించిన వీరగాథను వర్ణించే ఉజ్జ్వలాధ్యాయం. తెనుగుబావుటాను పునఃప్రతిష్ఠించాలని యత్నించిన ప్రోలయ నాయకుడు రూపు కట్టిన వీరరసం.

'తెలుఁగుధాత్రికి వీరకళ దిద్దిన ప్రతాప
రుద్రవల్లభుని తీర్పుల నెఱిఁగి
పయి నేడుగడలేమిఁ బల్లటించెడి దుర్గ
పతులకు ధీరభావమ్ముఁ గఱపి
ప్రాపుండి నడప దర్పమున బెబ్బులిగొంతు
గుప్పిటం గొను యువకులను జేర్చి
తన పినతండ్రి సంతానరత్నములైన
కాపయ ప్రముఖులదాపు చూపి
యవనసేనాంబుధి మునింగి యంగలార్చు
నవని నెత్తు పురాణదంష్ట్రాంకురముగ
ధర్మ సామ్రాజ్యహిత సముద్ధరణచణుఁడు
నాయకత మించెఁ బ్రోలయనాయకుండు' (పు. ప. 19)

ప్రోలయ కాపయ నాయకుల ప్రతాపాగ్నిని చూచి భయపడి యవనవాహినులు దక్షిణానికి చొచ్చుకొని పోలేకపోయినాయి. కృష్ణానదీ తీరంలో తెలుగురాజ్యాలు వెలిసాయి. అందులో కొండవీటి రెడ్డిరాజ్యం, రాచకొండ వెలమరాజ్యం పేరెన్నిక గన్నాయి. ఆ రాజ్యాల నేలిన ప్రసిద్ధ ప్రభువుల కీర్తనం సంగ్రహంగా జరిగిందీ పర్వంలో. ప్రతాపరుద్రుని పతనంతో తలవాల్చిన జాతి ఈ పర్వంలో తలయెత్తి తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొన్నది. అందుకే ఈ పర్వం జాత్యభిమానానికి జీవగర్ర.

విద్యానగరపర్వం ఆంధ్రుల ధర్మవిద్యాభిమానాలను వ్యక్తీకరించే తేజఃఖండం విద్యారణ్య కృపాకటాక్షంతో విద్యానగరం తుంగభద్రాతీరంలో వెలిసింది. హరి హరుడు హైందవ ధర్మరక్షాదీక్షను బూని ఆంధ్రతేజాన్ని స్థాపించాడు. బుక్కరాయలు పుణ్యమూర్తియై వితరణవీరాన్ని ప్రకటించాడు. బుక్కరాయలను వర్ణించబూనే సరికి మధునాపంతులవారి వాక్కు పోతన భాగవతంలోని బలిచక్రవర్తి వాక్యసరణిలో పరవళ్లు త్రొక్కింది.

"వీరోత్సేకత ముద్దచేసికొని యుర్విన్ మ్రింగుఁగా కేమగున్
గారే రాజులు! రాజ్యముల్ కలుగవే! గర్వోన్నతిం బొందరే!
వా రేరీ! మరి బుక్కరాయవసుధాపాలాగ్రణింబోలె వి
ద్యారణ్య శ్రుతిభాష్యగణ్య మగు ధన్యత్వమ్ముఁ జూటాడిరే." (వి.ప. 100)

ప్రౌఢదేవరాయల ముత్యాలశాలలో శ్రీనాథమహాకవికి జరిగిన కనకాభిషేక ఘట్టాన్ని మధునాపంతులవారు విశేషించి వర్ణించారు.

'ఆంధ్రకవి సార్వభౌమ హేమాభిషేక
పరమసమ్మాన మంగళాచరణ గాన
వాద్యనిస్వాన మది యొక్క స్వాతివాన
తనుపుగా మొగ్గవిచ్చె ముత్యాలశాల'

'కస్తూరికా పుండ్రకమ్ము దిద్దిన మేలి
    పస చిందులాడు నెన్నొసలివాఁడు;
తారహారముల ముత్యాలపేరుల మోలఁ
    గొమరారు తెలిజన్నిదము లవాఁడు;
రత్నాంగుళీయక ప్రభకు శోభలు తీర్చి
    విలసిల్లు కెంజేతి వ్రేలివాఁడు;

చెలువారు పైఁడిపువ్వులు కుట్టినంచుల
 పట్టుసాలువ వలెవాటువాఁడు;
తీవి గలవాడు-శంభుసేనా వివేక
సాధుశీలమ్ము వాఁడు శ్రీనాథవిబుధుఁ
డచ్ఛమగు తెల్గునొడువు ముందడుగు లిడఁగ
వెడలెఁ గనకాభిషేకపుం బెండ్లికొడుకు.' (వి. ప. 124, 155)

మధునాపంతులవారు శ్రీనాధునివలె కొద్దిమంది ప్రభువులనే వర్ణించారు. రాజుల వరుసలో కవిరాజును నిలిపి పురాణకావ్యానికి సాహితీగౌరవాన్ని ఆపాదించారు. ఈ ఘట్టం చదువగానే శ్రీ బి. నాగిరెడ్డిగా రడిగినట్లు-'ఈ కావ్యమున ననేక కవుల ప్రశంస యున్నను నన్నయ శ్రీనాధు లెక్కువగా చోటుచేసికొనుటపై మీ అభిప్రాయ' మేమిటని కవిగారిని ప్రశ్నించాలని పఠితల కనిపించటంలో ఆశ్చర్యం లేదు. దానికి శాస్త్రిగారు చెప్పిన సమాధాన మిది; "ఈ కావ్యమున కవులు, గురువులు, రాజులు స్థితికారులు. ప్రతి పర్వమున ఈ విషయము స్పష్టము. కవులందరిలో నాకు నన్నయ శ్రీనాధులు ప్రియమైన కవులు. సందర్భము కుదురుటతో వారి ప్రశంస విస్తృతమైనది." కవికి అభిమానులైన కవులు కావున ఆంధ్రపురాణంలో వీరి ప్రశస్తి అధికంగా జరిగిందని చెప్పటం పైకి కనబడే కారణమైనా లోన ఆంధ్రచరిత్రలో వారి పాత్రలు కూడ విశిష్టంగానే ఉండటం గమనింప దగిన అంశం. అయితే తిక్కనాదుల మాట యేమిటనే ప్రశ్న వస్తుంది. "ఒకే కాలమునకు చెందిన మండలాధిపతుల చరితము లిందు లేవు. ముఖ్యముగా చక్రవర్తుల చరిత్రలకే ప్రాధాన్యమిచ్చి వ్రాసినాను" అని శాస్త్రిగారు చెప్పారు. తిక్కన ఓరుగల్లును దర్శించి గణపతిదేవుని మెప్పించిన ఘట్టం కాకతీయపర్వంలో ప్రసక్తానుప్రసక్తంగా వచ్చిందే కాని అతని మహామంత్రిత్వం, మహాకవిత్వదీక్షావ్రతం వర్ణింప బడలేదు. దానికి కారణం ఆయన మండలాధిపతి వంటి మనుమసిద్ధి ఆస్థానంలో ఉండటమే. అది అలా ఉండగా విజయపర్వంలో భువనవిజయ సభావర్ణనం జరిగినా అష్టదిగ్గజ కవుల ప్రసక్తి ఆంధ్రపురాణంలో కనపడదు; నాయకపర్వంలో వాగ్గేయకారుల ప్రసక్తి అసలే రాదు. దీనికి కారణం వారికి, ప్రభువుల రాజకీయ చరిత్రలకూ అంత సంబంధంలేక పోవటమే అని చెప్పాలి. ఆంధ్ర పురాణం ప్రస్తుతః ఆంధ్ర సాహిత్య చరిత్ర కాదు. ఆంధ్రరాజుల చరిత్ర. నన్నయ

శ్రీనాధుల ప్రశస్తి అప్రస్తుతం కాదు; అట్లని ఆంధ్రకవుల నందరినీ ప్రశంసించటం పురాణాన్ని మరీ పెంచటమే అవుతుంది. కాబట్టి నన్నయ శ్రీనాధుల ప్రశస్తిఔచిత్యవంతమే అవుతుంది. కాని అన్యథా కాదు.

విజయనగర రాజ్య చరిత్రను మధునాపంతులవారు రెండు పర్వాలలో విస్తరించి రచించించారు. మొదటిది శ్రీకృష్ణదేవరాయపర్వం, రెండవది విజయ పర్వం. ఇందులో మొదటి దానిలో తిమ్మరుసు నీతివిక్రమం విశ్వరూపంగా ప్రకటితమౌతుంది. ఆంధ్రరాజనీతికి ఆ మనీషి అనర్ఘమణిదర్పణం. ఒక్క మాటలో చెప్పాలంటే-

"చేరి రాంధ్రావనికి సర్వభారతీయు;
లాంధ్రు లెల్లరుఁ గర్ణాటమందుఁ జేరి;
రఖిల కర్ణాటజనులు తిమ్మరుసుఁ జేరి;
రతఁడు శ్రీకృష్ణదేవరాయలను జేరె. (శ్రీకృ. ప. 125)

శ్రీకృష్ణదేవరాయలు మొదట సచివాలయత్తసిద్ధి; ఆ తరువాత ఉభయాయత్త సిద్ధి. ఆ రెండు లక్షణాలూ పై రెండు పర్వాలలో చిత్రించబడినాయి. ఈ రెండు పర్వాలలో ఆంధ్రజాతిలో పొంగారిన శౌర్యాభిమానం కవితా తరంగిణిగా జాలువారింది. సాహిత్య సమరాంగణ సార్వభౌముని శౌర్యపరాక్రమాలు విజయపర్వంలో విజయోత్సవం చేసికొన్నాయి. రాయల విజయయాత్రలు ఆంధ్ర పౌరుషానికి దక్షిణాపథాన్నంతా విహార రంగంగా మార్చివేశాయి. గజపతుల నోడించి, అశ్వపతుల దర్పోద్ధతి నణచి, నరపతిగా తన కున్న బిరుదంతోపాటు మిగిలిన బిరుదాలను సైతం తాల్చిన దక్షిణాపథ చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు. ఆ తెలుగువీరుని పరాక్రమంలో ప్రతిబింబించిన ఆంధ్రుల శౌర్యాభిమానం ఈ పర్వాలలో ధ్వనిమంతంగా తురంగలించింది.

'తొలుత గజపతి రాజ్యము గెలిచినట్టి
నశ్వపతుల దర్పోద్ధతి నణఁచె నేఁడు
తిరుగులేని ప్రతిజ్ఞ సాధించు యోధు
రాయలకు నుపమానము రాయ లొకడె'

'అకలంకిమ్ము ప్రియంకరమ్ము నగు కర్ణాటాంధ్ర సామ్రాజ్య చం
ద్రిక సాంద్రంబుగ సర్వభారత ధరిత్రిన్ శుద్ధ పక్షైక కౌ

తుక హేలామృత సంపదభ్యుదయ హేతుస్ఫీత మైనట్లు తొం
టికవి వ్రాతము వ్రాతలన్ నిలఁబడెన్ విస్పష్ట సాక్ష్యంబులై'.

'రాజభ క్తికి మేలి తార్కాణ మైన
తిమ్మరసువంటి మంత్రి, మంత్రియెడ నట్టి
యడఁకువ గలట్టి ఱేఁడు రాయలును గానఁ
బడుదురే నేఁడు గస్నులు పొడుచుకొన్న.' (వి. ప. 323-325)

విజయ పర్వానికి వీరనీరాజనం లాంటి వీ పద్యాలు.

చివరిదైన నాయకరాజ పర్వంలో మధునాపంతులవారు ఆంధ్రజాతిలో వెలుగొందిన కళాభినూనాన్ని వ్యంగ్య సుందరంగా వ్యక్తీకరించారు. రఘునాథ రాయ లెంత సాహసియో అంత సరసుడు. కదనంలో ఎంతటి కర్కశుడో మాటలలో అంతటి మెత్తని పులి. మధుర వీరప్ప నాయకుణ్ణి పరిహసిస్తూ ప్రాణ దానం చేస్తున్నప్పుడు భారతంలోని ద్రోణుడు జ్ఞాపకానికి వస్తాడు. ఈ మాటలు చూడండి—

"వీ రెవరయ్య! మధుర మ
హారాజులె! యిట్లు కృపణు లయి పట్టువడన్
వీరికి వలసెనే' యని సు
స్మేరముఖుఁడు వానిలోన జీవము నిలిపెన్." (నా. ప. 84)

విజయ రాఘవుడు కావ్యకళా పోషకుడు. అతని మూర్తి కి క్రింద పద్యం అక్షర నీరాజనం.

'వాగ్గేయ సుకవితా స్వర్ణంబుఁ బండించు
క్షేత్రయ్యగాన మాక్షికముఁ గ్రోలి,
బిరుదైన గండపెండెరముతో శారదా
ధ్వజముతో రామసౌధమున మెఱసి
యక్షగాన ప్రబంధాదుల రచనలో
సహృదయ హృదయరంజన మొనర్చి
కనకాభిషేకమ్ముఁ గొనిన రంగాజమ్మ
శృంగారకవిత నాశీర్వదించి,

రాజగోపాలచరణ సరోజరజము
నిలువున నలందుకొని భక్తి కలితమైన
రక్తిమై 'నిందిరామందిరమ్ము' నేలె
రాఘవుఁడు కళావతీరమణి సుతుఁడు. (నా. ప. 89)

ఆంధ్రపురాణం విజయరాఘవ నాయకుడు శ్రీ రంగనాథేశ్వరీ చరణ సన్నిధానంలో నిలిచి ఆశక్తిస్వరూపిణిని సంస్తుతించటంతో ముగియటం మంగళాంత సూచకం. మధునాపంతులవారు స్వయంగా శ్రీ కామేశ్వరీదేవ్యుపాసకులు. విజయరాఘవునిలో కవికి ఆత్మీయతాగుణం సంవదించుకోవటం సహజం. అద్వైత మనః ప్రవృత్తితో సాగిన ఈ స్తుతి ఈ సుకృతికి మంగళపీఠి.

"కృతబుద్ధిన్ సకలాంధ్రభూతల విభుం డేయైనఁ గానిమ్ము; త
చ్ఛతురంభోనిధి మధ్య సర్వవసుధా సమ్రాట్టె కానిమ్ము; దీ
పిత కల్యాణ మహో మనోజ్ఞము భవద్వీక్షాశశిజ్యోత్స్న సం
ప్లుతమై కాసినఁగాదె! ఆతని వెలుఁగుల్ లోకైక దీపాంకురా!"

"ప్రతిభావ ద్విబుధుల్ మహాకవు లనల్ప ప్రీతిమైఁ బల్కు స
త్కృతులన్ వస్తువలంకృతుల్ రసముఁ దాదృక్ప్రాభవశ్రీ సము
ద్ధతమౌ నొండు ప్రతీయమాన రుచిరార్థంబున్ భవత్సుందర
స్మితబిందూద్భవ వైభవం బగుఁగదే! శ్రీమత్సరోజాలయా."
(నా. ప. 141-146)

ఆంధ్ర చరిత్రను ఆమూలాగ్రం కావ్యబద్ధం చేయటం అసాధ్యమైన పని. అందువల్లనే ప్రభువుల గాథలను పదునేడవ శతాబ్దివరకు గల చరిత్రలోనుండి యెన్నుకొని మధునాపంతులవారు చిత్రించుట. వారి కాధారమైన చరిత్ర, వారు దానిని పురాణంగా తీర్చిన తీరు ఈ క్రింది పద్యాల్లో స్పష్టమౌతున్నది.

"తెలుగున వేలయేండ్లుగ గతించిన గాథల పెంపు కొండగు
ర్తుల పెనుగుంపుగాని 'యిది రూఢిగ నిట్టిది' నాగఁ దెల్ప నె
వ్వలన నసాధ్య; మైన నొకపాటి చరిత్రము నేడు నేర్పు దీ
ర్పుల బరిశీలకుల్ తడవి పోవులు వెట్టిరి పూజ్యబుద్ధులై!"

'పొలపముఁ దప్పి పుర్వులకు భుక్తులు వెట్టెడి తాటియాకుఁ గ
ట్టలు- నెపుడెప్పుడో పుడమి డాఁగిన శాసనరాజి - వగ్గవా

రలబడి నివ్వటిల్లిన పురాణ కథల్ - ససిమాయు శిల్పముల్
తెలుఁగు చరిత్ర తొల్లిటిగతిన్ వచియించును గొంచియమ్ముగన్'

'అఱమఱుగు మేలిముసుఁగులో నందగించు
నాంధ్ర చారిత్ర సుమనోహరాంగి భంగి
మనసు పండువుగా నెంచుకొనెడి సిరికి
నోఁచువాఁడు, రసజ్ఞత మోచువాఁడు' (అవతారిక).

ఇసుక నుండి తైలం పిండినట్లు ఈ చరిత్రోదంతాన్ని కావ్యవస్తువుగా సంతరించు కొన్నట్లు పై మాటలు స్పష్టమౌతున్నాయి. నిజానికి ఇటువంటి కావ్యం వ్రాసిన కవి తప్పక రసజ్ఞు డనటంలో అనుమానం ఉండనే ఉండదు. అయితే ఈ కావ్యపఠితకూడ అంతటి రసజ్ఞుడై ఉండాలి. లేకపోతే- ఈ చారిత్రక కావ్య సుందరి మేలిముసుగులోని మేలిమిని గ్రహించి, మెచ్చుకొనే సహృదయత్వం అలవడదు.

ఆంధ్రపురాణం వట్టి చరిత్రక కావ్య మంటే చాలదు. ఆది నుండి ఆంధ్ర జాతిలో క్రమంగా వికాసాన్ని చెందుతున్న అభిమాన దశావస్థలను ఆయా యుగ ప్రవృత్తుల నాశ్రయించుకొని ఆవిష్కరించే అంతస్సూత్రాన్ని సమన్వయ సుందరంగా, వ్యంగ్యమధురంగా, ఏకవాక్యతా లక్షణంగా సంవదించుకొన్న వస్తుకావ్యం. ఈ లక్షణాన్ని విలక్షణంగా వ్యక్తీకరించటమే మధునాపంతులవారు పురాణీకరించట మన్నదానికి తాత్పర్యం. అందువలన ఆంధ్ర పురాణనామం అక్ష రాలా సార్థకం అటువంటికావ్య ప్రక్రియకు ఇది ఆదర్శకావ్యం ! తెలుగులో అటు వంటిది న భూతో - న భవిష్యతి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువా రీ సంవత్సరం మధునాపంతులవారి కిచ్చిన 'కళాప్రపూర్ణ' బిరుదం ఆంధ్రపురాణ కావ్య కళా ప్రపూర్ణత్వానికి ఆంధ్రు లర్పించిన అక్షరార్చన.

సూచికలు :—

1. సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల ఆంధ్ర పురాణము, ఉదయ ఖండము - ప. 1
2. చూ. నాగిరెడ్డి, బి., ఆంధ్ర పురాణము - సమగ్ర పరిశీలనము (అముద్రితము) - పు. 26
3. Becker, Carl L, - Detachment and writing of History (Essays and letters), (Ed.) Phil L. Snyder పుట. 41.

4. చూ. నాగిరెడ్డి. బి., ఆంధ్రపురాణము - సమగ్ర పరిశీలనము (అముద్రితము), పు. 27.
5. చూ. A study of History. పు. 16 (శివరామశర్మ, పి, విశ్వనాథ చారిత్రక కావ్యాలు (అముద్రితము) నుండి; పు. 11, 12) (పర్యవేక్షకుడు : డా. జి. వి. సుబ్రహ్మణ్యం)
6. ఆంధ్ర పురాణము (చివరి పద్యము) - పు. 438.
7. ఆంధ్ర పురాణము - సమగ్ర పరిశీలనము-M. Phil సిద్ధాంత వ్యాసము (ఉ. వి.) (1982) అనుబంధము I. పు. VIII వ్రాతప్రతి) (పర్యవేక్షకుడు : డా. ఇరివెంటి కృష్ణమూర్తి.)
8. విశ్వనాథ చారిత్రక కావ్యాలు - M. Phil. సిద్ధాంత వ్యాసం (ఉ. వి.) 1881 (వ్రా. ప్ర) పు. 25
9. Ibid. : పు. 24
10. ఆంధ్ర పురాణము-సమగ్ర పరిశీలనము-అనుబంధము I-పు. (ix)
11. Ibid. అనుబంధము I-పు. (viii)
12. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు - పు. 372-373
13. ఆంధ్ర పురాణము-సమగ్రపరిశీలన-అనుబంధము-I. పు. (x)
14. Creative Teachings of History., పు. 37
15. ఆంధ్ర పురాణము - సమగ్ర పరిశీలనము - అనుబంధము I. పు. (x) (1-2-1982 నాడు శ్రీ బి. నాగిరెడ్డిగారు శాస్త్రిగారితో జరిపిన సంభాషణ నుండి కొన్ని వాక్యాలు ఈ వ్యాసంలో ఉపయోగించుకొన్నాను. కృతజ్ఞతలు).

---

[ఈ వ్యాసం యువభారతి వారి ఇతిహాసలహరి లో (1982) ప్రచురితం]

# కవిత్వాధ్యయనం

కవిత్వాన్ని వ్రాయటం వేరు, చదవటం వేరు, అధ్యయనం చేయటం వేరు. అధ్యయనమంటే గ్రుడ్డిగా ఆరాధించటం కాదు అసలైన తత్వాన్ని అన్వేషించటం. అన్వేషించటం మరలా రెండు విధాలు, ఒకటి- తాను కోరుకున్నది కవిత్వంలో ఉందా లేదా అని తరిచిచూడటం. రెండు- కవితలో ఉన్న పరమార్థాన్ని సమతతో చూడటం. మొదటిదాన్ని సాపేక్షాధ్యయన మనీ, రెండవదాన్ని నిరపేక్షాధ్యయన మనీ పిలవ్వచ్చు. సాపేక్షాధ్యయనం ప్రధానంగా సహృదయుని ప్రవృత్తిమీద ఆధారపడి ఉంటుంది. నిరపేక్షాధ్యయనం మౌలికంగా సహృదయుని సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది. ప్రవృత్తి అంటే పరిత ఇష్టానిష్టాలవలన ఏర్పడిన అభిరుచి విశేషం. సంస్కారమంటే జన్మతః సహృదయునిలో ఉండే రసికత్వం.

అధ్యయనానికి ముందు మెట్టు ఆస్వాదనం. ఆస్వాదనాన్ని ఆధునికులు అనుభూతి అంటున్నారు. కవిత్వాన్ని మొదట సహృదయు డాస్వాదించాలి. తరువాత అధ్యయనం చేయాలి ఆస్వాదనకు కావలసింది కూడా సంస్కారమే. సంస్కారం వాసనారూపంగా ఉంటుందనీ, ఆ వాసనాబలంవల్ల సహృదయుడు కవిత్వంలోని రసభావాల నాస్వాదింపగలు గుతాడనీ, వాసనలేని వాడు పాషాణ తుల్యుడనీ అభినవగుప్తుడు చెప్పాడు. పాశ్చాత్యులు వాసనాసిద్ధాంతాన్ని భావించక పోయినా సహృదయునికి సాహిత్యరసికత్వం- లేక- సహృదయత్వం ఉండాలని అంగీకరించారు. దీన్ని సాహిత్యాభిరుచి అనకూడదా అని ఒక ప్రశ్న రావచ్చు. ఆ సమాసంలో అభిరుచి అనే పదానికి సహృదయత్వ మనే అర్థం. అయితే మనం ఇంతకుపూర్వం అనుకున్న అభిరుచివిశేషమైన ప్రవృత్తి ఇంతకంటే భిన్న మైందని గ్రహించాలి ఒకరికి ఒక వస్తువంటే మక్కువ ఉండవచ్చు. ఒక సిద్ధాంత మంటే అభిమాన ముండవచ్చు. అటువంటప్పుడు అతడు తనకు నచ్చినదాన్నే ఆస్వాదింప గలుగుతాడు. అంటే అతడు కొన్ని ఆవరణాలకు లోబడినా డన్నమాట. కొన్ని ఇష్టానిష్టాలకు బద్ధుడైనా డన్నమాట. మరి అటు వంటివాళ్లు కవిత్వాన్ని ఆస్వాదించలేరా? అని మరొక ప్రశ్న పుడుతుంది నిజానికి కొందరికి కవిత్వమే కిట్ట దనుకోండి. వారికి కవిత్వం వినిపించి ప్రయోజన మేంటి? వారికి రక్తికి బదులు విరక్తే కలుగుతుంది. మరికొందరికి కవిత్వమంటే

ఇష్టమే. కాని, కవిత్వంలో తా ననుకున్న దృక్పథమే ఉండాలని భావించా రను కోండి. వారికి వారి భావాని కనుగుణంగా వ్రాసిన కవిత్వమే ఆస్వాదనీయం కావచ్చు. మరొకమాటలో చెప్పాలంటే లోకంలో కొందరు కవిత్వానికీ తమకూ మధ్య తామే అడ్డం నిలబడుతున్నా రన్నమాట. అటువంటివారిని నూటికి నూరు పాళ్లు సహృదయు లంటానికి వీల్లేదు.

కవిత్వాన్ని ఆస్వాదించటానికి పఠిత తనంతట తాను అడ్డం నిలిచే ప్రవృత్తిని తొలగించుకోవాలి. అంటే తన్మయత్వాన్ని పొందే చిత్తవృత్తిని అల వరచుకోవాలి. దీన్నే లాక్షణికభాషలో విశ్వజనీనత్వం అంటారు. పరగత సుఖ దుఃఖాలను తనవిగా భావించి తన్మయు డయ్యే అవస్థ అది. అప్పుడు పఠితలో ఆత్మప్రత్యయం ఉండదు. విశ్వజనీనుడైన ఆత్మగా భాసిస్తాడు. ఇతరుల అవస్థల్లో లీనమౌతాడు. అంటే తన్ను తాను మరిచిపోతాడు. అనుభూతిలో తన్మయు డౌతాడు. ఆనందాన్ని అనుభవిస్తాడు. దీన్నే లాక్షణికభాషలో చెపితే రసానంద మంటారు. కవిత్వం ప్రధానంగా రసానందంకోసమే పుట్టుతుంది. అనుభూతిలో నుంచి ఆకృతి జనించి అనుభూతిలో లయమై పోతుంది. అసలీ అనుభూతిని అంగీకరించకపోతే కవితాత్మను కాదన్నట్లే. కవితను చదివేవాడు మొదట అనుభూతికోసమే చదువుతాడు. నిరపేక్షాధ్యయనానికి ఈ అనుభవ మార్గం ప్రాతిపదిక

ఇక సాపేక్షమార్గాన్ని గురించి ఆలోచిద్దాం. ఆధునికుల్లో అభ్యుదయ వాదులు-విప్లవవాదులు ఉన్నారు. వీరు కవితను మార్క్సు దృక్పథంతో చూస్తారు. ఆ దృక్పథంతో వ్రాసిన కవిత కవిత్వమంటారు. తదితరమైంది కవిత అయినా దాన్ని గణనకు తీసుకోరు. ఇందులో మరో విశేష ముంది. కవిత్వంలో వస్తువు ఉంటుంది, ప్రక్రియ ఉంటుంది, అనుభవం ఉంటుంది. వస్తువు ఏదైనా, ప్రక్రియ ఏదైనా, ఆ రెండూ అనుభవానికి సాధకాలే. సాధ్యమైన అనుభూతిని అందుకోవ టానికి అభ్యుదయకవిత ఒక సాధనం. అయితే ఆ సాధనస్వరూప స్వభావా లెలా గుండాలి అన్న అభిప్రాయంలో అభ్యుదయవాదులకు కొన్ని ఖచ్చితమైన అభి ప్రాయా లున్నాయి. సమాజంలోని కుళ్లును వెలికితీసి విమర్శించటం, సామ్యవాద దృక్పథంతో వస్తువు నెన్నుకొని చిత్రించటం, వీలైనంతవరకు సంప్రదాయంగా తాము భావించే ఛందస్సును నియమాలను పరిత్యజించటం మొదలైనవి వారి అభిప్రాయాలు. పద్యంలో కవిత వ్రాస్తే చేదని కాదు, సీతారాములశోకం విష

మని కాదు కాని, అవి తమ సిద్ధాంతాలకు పతాకలుగా నిలవ్వు. అందువల్ల ఆ వస్తువులో, ప్రక్రియలో వారిచిత్తం రమించదు. అది వారి ప్రవృత్తి. అభ్యుదయ కవిత్వంలోనూ, ప్రాచీనసాహిత్యంలోనూ పక్షపాతం లేని సహృదయభావంతో రసాస్వాదనం చేసే రసికు డున్నా డనుకుందాం. వా డేజాతికి చెందుతాడో? - ఎవ రెలా అనుకున్నా - సహృదయజాతి వాడిది. అలా సహృదయుడు కాలేకపోతే కవిత్వాన్ని రెండుకన్నులతో చూడలేడు. సమచిత్తంతో ఆస్వాదించలేడు.

ఆధునికులు ఆస్వాదనను రెండు విధాలుగా వింతడిస్తున్నారు. ఒకటి: హృదయంతో ఆస్వాదించటం. రెండు; మేధతో ఆస్వాదించటం. ఆస్వాదన లోని అనుభూతి - తన్మయత్వం కాదు. తత్ప్రిభావం కవిత చదివితే పఠిత కన్నీరు కార్చటం కాదు ప్రధానం. కవితలోని భావంతో సానుభూతి ప్రకటించటం -లేదా-కవిత ప్రతిపాదించే భావంతో ప్రభావితుడు కావటం. సామాజికుల్లో సానుభూతి కలగాలని కవితలో అభివ్యక్తి శిల్పాన్ని బలంగా వాడుకుంటు న్నాడు ఆధునిక కవి. పఠితను ప్రభావితుణ్ణి చేయాలని సిద్ధాంతాలను శంఖంలా పూరిస్తున్నాడు. అభివ్యక్తి శిల్పంలో రచనాచమత్కారం రాణిస్తోంది; సిద్ధాంత కవిత్వంలో సూత్రాలూ భాష్యాలూ వినిపిస్తున్నాయి. కవిత్వాన్ని కళగా కంటె ప్రచార సాధనంగా ఉపయోగించుకొనే రాజకీయ చైతన్యం ప్రపంచంలో ప్రబలిన తర్వాత వచ్చిన పరిణామాల్లో పరిగణింపదగింది ఇది. దీని యాంత్రిక యుగ వాతావరణం తోడయింది. ఎలెక్ట్రానిక్ బ్రెయిన్ ఆలోచిస్తుంది తప్ప అనుభ వించదు. యాంత్రిక నాగరికత మెదడుమీద పనిచేసినంతగా గుండెమీద పని చేయదు. దీనికి రాజకీయ ఆర్థిక దృక్పథాలు తోడైతే ఇక చెప్పాలా? ఎండకు వడగాలి తోడైనట్లు. రాజకీయ ప్రయోజనాలకు వెలువడే సిద్ధాంతాలకు రాజ్యాలు లక్ష్యాలు : కవితలు మంత్రాంగాలు. ఇక ఆర్థిక సమానత్వాన్ని బోధించటానికీ కవిత ప్రబోధసాధనం, ప్రచార ఆయుధం. ప్రబోధంలో బీదలబాధల కరుణా మయ చిత్రాలు కన్నీరు కార్పించి దాని కన్న సానుభూతిని కలిగిస్తాయి. ప్రచార కవిత్వంలో ప్రణాళికలే పదివేల అవతారా లెత్తుతాయి. ఏమైనా ఆధునికుడు కవిత్వాన్ని ఆర్ద్రంగా సృష్టించటం లేదు; ఆర్ద్రంగా అనుభవించటం లేదు. ఆవే శంతో రచిస్తున్నాడు, ఆవేగాన్ని అభివ్యక్తం చేస్తున్నాడు. ఈ రెండూ పఠితలో ఆలోచన రేకెత్తించా లంటున్నాడు. ఆధునికయుగం కవితను ఆరాధించటం లేదు; అనుభవించటం లేదు; ఆయుధంగా ఉపయోగించుకొంటోంది. ఆ ఆయుధం చాల

వరకు తుపాకీ. ఆ తుపాకీ గుండెలమీద పేలదు; మెదళ్ల మీద పేలుతుంది. అందులోని మందు - ప్రేలుడు మందు సిద్ధాంతం. మరోపేరు దానికి - ఇజం. ఇజం మెదడును పలుపుకట్టి ముందుకు లాక్కెళ్లుతుంది. హృదయం లేగలా దాని వెంట పరుగెడుతుంది.

అనుభూతి లేనిది అధ్యయనం లేదనుకున్నామే. మరి అనుభూతి అంటే సహానుభూతి కాదు, సానుభూతి అనుకున్నా తాదాత్మ్యభావం గాదు- తత్ప్రభావ మనుకున్నా ఆర్ద్రిత కాదు; ఆవేశమనుకున్నా ఆనందం కాదు ఆలోచన అను కున్నా, అది లేంది అధ్యయనం లేదు. అయితే, మనసుతో పొందే అనుభూతి లోచూపు ప్రసరింప చేస్తుంది; మెదడుతో పొందే అనుభూతి పైచూపు నిస్తుంది. తనలో విశ్వాన్ని చూచుకొనేది లోచూపు. విశ్వాత్మలో తనను చూచుకొనేది పైచూపు. ఏ చూపుతోనైనా అన్వేషణ ప్రారంభించవచ్చు. అధ్యయనం సాగించవచ్చు.

అయితే కవితకు అధ్యయనం అవసరమా? అని కొందరు సూటిగా ప్రశ్నించవచ్చు. వనితను కోరేవాడికి వయసుంటే చాలు వలపెందు కన్నట్లుంటుంది ఈ ప్రశ్న. అధ్యయనం కవితలు వ్రాయటానికి తోడ్పడుతుంది. తిరుపతి వేంకట కవు లన్నట్లు.

'చదువగావలె శబ్దశాస్త్రాదికమ్మును
వీక్షింపగా వలె విద్య లెల్లఁ
జూడగావలె రాజ చూడామణుల సభల్
పొందగా వలె మహా భోగములును
దిరుగగావలె దేశదేశాల వెంబడిఁ
బడవలెఁ బడరాని పాటు లెల్ల
వినగా వలెను పూర్వ విద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందఃప్రశంస
కవులు కవులన్న మాత్రన కవులు గారు
ఎంత భారమ్ము గలదో కవీశ్వరులకు
తెలుఁగకుందురె మీ వంటి నృపతిమణులు
శ్రీ మదానంద గణపతి క్షితితలేంద్ర!

ఇంత వ్యుత్పత్తిని సంపాదించి దానిసారాన్ని ప్రతిభామయం చేసి కవిత్వంగా తీర్చిదిద్దాలి. వ్రాయటానికి కింత అధ్యయనం కావలిసివస్తే ఇక ఆ కవిత్వాన్ని అవగాహనం చేసుకోవటానికి అధ్యయనం అవసరం లేదా।

'మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూగు
రాయంచ సనునే తరంగిణులకు
లలిత రసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు
అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు?
వినుతగుణశీల మాటలు వేయునేల?

పోతనగారి పద్యం చదివితే పాముపాట విన్నట్టుగా తల లూపే తెలుగువా రున్నారు-కోట్లకు పైబడి. కాని. ఆ కోట్లలో ఏ లక్షకో దాన్ని తెలిసి తలలూపే శక్తి ఉండవచ్చు. సామగానంలా వినవచ్చే శబ్దమాధుర్యం వేరు-సోమపానంలా కనవచ్చే దానిభక్తిభావం వేరు. పద్యభావం తెలిస్తే కాని భక్తిభావం అర్థం కాదు. అందువల్లనే ప్రాచీను లన్నారు.

'సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం
ఏకమాపాతమధుర మన్యదాలోచనామృతం'.

సాహిత్యంలో అనుభూతి ఆలోచనలవల్ల వస్తుంది. ఆలోచనం అర్హతవల్ల వస్తుంది. అర్హత అంటే విద్యార్హత కాదు; అధ్యయనశక్తి. అధ్యయనమంటే విద్యార్థులు ప్రతిపదార్థ తాత్పర్యం, ప్రకృతి వికృతులూ, సంధి సూత్రాలూ అని భయపడి పోతారు. ప్రాచీన లక్షణ గ్రంథాలూ, సాహిత్య మర్మాలూ, సమాసాలూ, శబ్ద కోశాలూ, శాస్త్రవ్యుత్పత్తులూ- ఇవ్వేమో ననుకుని ఈసడించుకుంటారు అభ్యుదయ కవులు. కాని, ఆధునిక కవిత్వం అర్థం కావాలన్నా-అంతో ఇంతో అధ్యయనం

కావాలనీ వారే అంటారు "ఆధునికాంధ్ర కవుల రచనలను సరిగా అర్థం చేసుకోవడానికి వాటి వెనుక బాసటగా నిలిచిన ఇతరదేశాల సాహిత్య వ్యవసాయాలను గమనించక తప్పదు. నేటి రచనలను విశ్వపర్యాప్తమైన విశాల జీవితంతో సమన్వయించి నిజమైన కవిత్వ మేదో, కేవలం నిర్జీవ శుష్కానుకరణ మేదో గుర్తించాలి." అని శ్రీ శ్రీ అన్నాడు.

'ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం'.

ఈ చరణాలకు ప్రతిపదార్థ తాత్పర్యం అవసరంలేదు. ప్రతిపాదితార్థ తత్వం తెలియాలి. గతి భౌతిక తార్కికవాద దృక్పథం తెలిస్తే గేయంలోని భావం తేటపడుతుంది. కవితను ఆస్వాదించాలంటే అర్థం అవసరం. అర్థం పదార్థమే కాదు. అంతకంటె కవితలో చెప్పే పరమార్థం. అధ్యయనం శబ్దార్థాలకు సంబంధించింది కాదు. శాస్త్రానికి సంబంధించింది. తాత్పర్య జ్ఞానమే కాదు; తత్త్వచింతనం!

అధ్యయనం అనుభూతికైన అన్వేషణం కావచ్చు; అనుభూతి విశ్లేషణం కావచ్చు. కవిత్వంలో రమణీయమైన భావం ఉంటుంది. కాని, అది చదవగానే వెంటనే సామాన్య పఠితకు స్ఫురింపకపోవచ్చు. కొంచెం విడమరిచి చెప్పితే ఇతడు దాన్ని ఆస్వాదింప గలుగుతాడు.

'స్వైర విహారధీర లగు సారసలోచన లున్న చోటికిన్
భోరున లాతివారు చొరఁబూనినచో రసభంగ మంచు నేఁ
జేరక పువ్వుఁ దీవియల చెంతనె నిల్చి లతాంగి రూపుక
న్నారఁగఁ జూచివచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పెదన్'.

ఇందులో 'సారసలోచన' లనే సమాసంలో 'రస' భంగమైతే 'సాలోచనలు' అనే పదం ఏర్పడుతుందన్న చమత్కారం తెలిస్తే సహృదయుడు సంతోషపడతాడు. దానికి కొంత పరిశ్రమ తప్పదు. అందువల్ల అనుభూతికై అన్వేషణ చేయటంలో పఠితకు గురువూ, మిత్రుడూ, వ్యాఖ్యానం, విమర్శా తోడుపడుతుంటాయి.

ఇక అనుభూతి విశ్లేషణం గూర్చి విచారిద్దాం. ఒక కవిత చదివితే ఒక అనుభూతి కలుగుతుంది. ఆ అనుభూతి ఎలా కలుగుతుంది? దానికి తోడు పడుతున్న కవితాద్రవ్యా లేమిటి? అవి ఎలా ఆ అనుభూతిని కలిగిస్తాయి? మొదలైన ప్రశ్నలు వివేకవంతునికి కలుగుతాయి. వాటికి సమాధానం తనంతట

తాను చెప్పుకొనే స్థితిలో ఉంటే సహృదయుడు ధన్యుడే. అది అంత తేలికైన పని కాదు. రుచి చూడటం తేలికేగాని, ఆ రుచి ఎలా ఏర్పడుతుందో వివేచించటం అంత తేలిగ్గాదు. ఇలా వివేచించే పద్ధతినే ప్రపంచంలో కావ్య సౌందర్య దర్శన శాస్త్రమంటారు. అలంకారశాస్త్ర మంటే అధునికులకు ఆగ్రహం గాని పేరు మార్చుకున్నా ప్రయోజనం మాత్రం ఒకటే, సౌందర్య స్వరూపస్వభావాలు కవి కెంత తెలియాలో పఠితకూ అంతే తెలిసి ఉండాలి.

'యెనకజల్మంలోన యేవరమో నంటి
సి గ్గొచ్చి నవ్వింది సిలక నా యెంకి
ముందు మన కేజల్మ ముందోలె యంటి
తెల్లతెల బోయింది పిల్ల నాయెంకి
ఎన్నాళ్లు మనకోలె యీ సుకము లంటి
కంట నీ రెట్టింది జంట నా యెంకి !'

ఈ పాట వింటే కమ్మగా ఉంటుంది. దానిలో కమ్మదనాన్ని కలిగించే అంశాల నన్వేషిస్తే అనంతంగా ఉంది. పునర్జన్మ సిద్ధాంతం నుంచి పల్లెవారి మన స్తత్వం వరకూ ఎన్నో విషయాలు తెలియాలి. తెలియకపోతే ఏమౌతుం దంటే మన మనస్సును మనమే దివాలా చేసుకుంటాము. అంతదూరం వద్దు. జీవితాన్ని ప్రకృతినీ ఒకచోట ముచ్చటగా ముడివేసి మనముందు కవితను ఒక కవి ఉంచా డనుకోండి. ఉదా॥ విశ్వనాథవారి 'చిన్ని మబ్బులు'.

'కన్నె కాటుక కళ్లు- చిన్ని నాథుని చూచి
కదలు లాడిన వేళ- కందళించిన వేళ
ఆకాశమధ్యాన- అట నొక్క తెలిమబ్బు
మెరపులా మెరిసిందిలే- వెలుగులో వొరిసిందిలే.'
'తొలిచిన్ని చూలాలు- కొలసిగ్గు ప్రేమతో
విభుని చూచిన వేళ- విన్నబోయిన వేళ
బలుపు మిన్నులలోన- ఒక నీలి తెరమబ్బు
సంజతో తారిందిలే- జాలుగా మారిందిలే'.
'తొలికాన్పు పసిపాప-సాక నేరని చాల
తెలవోయి పతి జూచి- కళవళించిన వేళ

తూరుపూకోనలో - తొంగలించినమబ్బు
తెగ పరువు లెత్తించిలే సొగసుల్లు పోయించిలే'

ఈ కన్నె జీవితానికిన్నీ - ఆ కన్నె మబ్బులకున్నూ ఉన్న సంబంధం సౌందర్య దృష్టి సంస్కార శక్తి ఉంటేనే గాని అవగతం కాదు. సౌందర్యం ప్రతి వాడినీ సంతోషపెడుతుంది. మరి ఎవడికో గాని దాని తత్వం బోధపడదు.

'చావు పుట్టుకల మధ్య సందేహం లాంటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచిగంధంలాగా పరిమళించే మానవత్వం
మా కున్న ఒకే ఒక అలంకారం!'

అన్న తిలక్ కవిత భావనారమణీయంగా ఉంటుంది. కాని 'చావు పుట్టుకల మధ్య సందేహంలాంటి' అన్న ఉపమానాన్ని అందుకోవటానికి ఉపజ్ఞతోపాటు ఊహా బలం కూడా ఉండాలి. శ్రీశ్రీ గారి అవతారాన్ని చదివితే కలిగే అనుభూతిని విశ్లేషించుకోవటానికి ఎంత పిండి ఉండాలి ?

'యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బుచాటున- ఖణేల్ మన్నాయి
నరకలోకపు జాగిలమ్ములు
గొలుసు త్రెంచుకు ఉరికిపడ్డాయి.........
పుడమితల్లికి పురుటి నొప్పులు
కొత్త సృష్టిని స్ఫురింపించాయి.'

అనుభూతికై అన్వేషణ మనిషిలోని రసికత్వానికి చిహ్నం! అనుభూతి విశ్లేషణ మనిషిలోని జిజ్ఞాసకు ప్రతిబింబం! ఈ రెండూ అధ్యయనానికి రెండు రెక్కలు, బొమ్మా బొరుసూ. ఏ యుగంలోని కవిత అయినా అధ్యయనం లేకపోతే అంతరించి పోతుంది.

ప్రాచీన కవితను అధ్యయనం చేయాలంటే పాండిత్య ముండాలి. ఆధునిక కవితను అధ్యయనం చేయాలంటే సామాజిక స్పృహ ఉండాలి. ప్రాచీన గ్రంథాల్లో కొన్ని రసప్రధానాలూ, జీవితంలోని చైతన్యాన్ని గాఢంగా చిత్రించిన కావ్యాలూ ఉన్నాయి. మరికొన్ని ప్రతి పద్య శిల్పమని పేరుపెట్టి ప్రతిభా వ్యుత్పత్తులను పండించి పాండిత్య శౌండీర్యాన్ని ప్రబంధ రచనలో ప్రదర్శించి

నవీ ఉన్నాయి. ప్రాచీన సాహిత్యం జీవిత పరమార్థాన్ని చిత్రించినంతగా జీవిత గాథను చిత్రించలేదు. సమకాలీనవృత్తం సర్వథా పరిత్యాజ్యంగా ఉండేది. అందువల్ల కవి పురాణకథలో ప్రచ్ఛన్నంగా తననాటి వాతావరణాన్ని ప్రదర్శిం స్తుండేవాడు. అయినా అతని దృష్టి కథమీదా, సమాజ వ్యథమీదా కాదు ఉంది. బోధనమీదా పద్యంలోని శిల్పశోధన మీదా ప్రధానంగా ప్రసారమయ్యేది. వారికి భిన్నంగా ఆనిధుకులు చెప్పుకోతగ్గ నవ్యతను సంపాదించారు సాహిత్యం సమాజానికి ప్రతిబింబంగా ఉండాలనీ, సామాజిక చైతన్యానికి సాధకంగా ఉండాలనీ వారు భావిస్తారు. సమాజ వ్యవస్థను సామ్యవాద దృక్పథంతో సమీ క్షించి వర్గ సంఘర్షణను విప్లవం ద్వారా వారించి సమసమాజాన్ని నిర్మించాలన్న స్పృహను కవితలో వస్తువులో కళాత్మకంగా సాధిస్తున్నారు. ఈ నాటి సాహిత్యం ఘనం బ్రతుకుతున్న సమాజానికి సమీక్ష. అయితే, ఆధునికుల్లో కొందరు జీవితంలోని ఆర్థిక రాజకీయ సమస్యలకే ప్రాధాన్యమిచ్చి అదే జీవిత మంటు న్నారు. ఆర్థికంగా అభివృద్ధి చెందినా జాతి ఆధ్యాత్మికంగా అభివృద్ధి కాకపోతే వికాసం సంపూర్ణం కాదు. తిండీబట్టా అందరికీ దొరికినా జీవిత గమ్యం తెలియక పోతే జాతి పురోగతి లక్ష్యం లేకుండా పోతుంది. బ్రతుక్కు వైశాల్యం ఏర్పడ వచ్చును గాని లోతు ఏర్పడదు. సామాజిక స్పృహ సామాజికావహనవల్లనే ఏర్పడుతుంది. ఆధ్యాత్మిక స్పృహ జీవిత తత్వాన్ని దర్శించటంవల్ల యేర్పడు తుంది. ఆ అవగాహనకు గూడా అధ్యయనం కావాలి. చైతన్యం చింతనం వలన వస్తుంది. అధ్యయనం అవగాహన వలన ఏర్పడుతుంది.

వచనకవులు కొందరు కవితను ప్రజావాణిగా పలికిస్తున్నారు. సామాన్యుని కందుబాటులో ఉండేటట్లు సారళ్యంతో వచనకవిత వెలయించటం వీరి ఆశయం. కవితకు సారళ్యం రావాలంటే ప్రౌఢ మైన ప్రాచీనకవిత్వం చదవ్వద్దని యువ తరానికి బోధిస్తున్నారు వీరు. పాండిత్యం పరిశ్రమకు సంబంధించినది. ప్రౌఢి వేరు పాండిత్యం వేరు. తేటతెలుగులో కవిత చెప్పినా ప్రౌఢంగా చెప్పటం నేర్పు. వచనకవులు సమాసాలను చూచి భయపడతారు. సంప్రదాయ మంటే సానుభూతి చూపరు. వస్తువులో సమాజం, గుణంలో సారళ్యం, ప్రక్రియలో వచనం వారి త్రిశరణాలు. సమాజంకోసం కవిత వ్రాస్తున్నప్పుడు దానికి సారళ్యం ప్రధాన ధర్మంగా ఉండాలి. అసలు ఆంధ్రసాహిత్య చరిత్ర నొక్కసారి సమీక్షిస్తే సార వంతమైన రచనకూ, సరళమైన రచనకూ పోటాపోటీలు సాగివస్తూనే ఉన్నాయి.

ఒకదాని తరువాత మరొకటి చక్రకారపంక్తిలా తిరుగుతూనే ఉన్నాయి. నన్నయ మార్గకవిత్వం తరువాత శివకవుల జానుతెనుగు కవిత్వం, తిక్కన తెలుగు కవిత్వం తరువాత శ్రీనాథుని ప్రౌఢసాహిత్యం, పోతన భక్తికవిత్వం తరువాత ప్రబంధాల ఆలంకారిక కవిత్వం, పదకవుల భక్తిగీతాల వెనుక శ్లేషబంధ నిర్జీవ కవిత్వం, తిరుపతి వేంకటకవుల ఆశుకవిత్వం తరువాత భావకవుల శిల్పకవిత్వం, భావకవుల పద్య కవిత్వం తరువాత శ్రీ శ్రీ గేయకవిత్వం, ఆ తరువాత వచన కవుల సరళకవిత్వం- ఇలా ఈ వర్గ సంఘర్షణ సాగివస్తూనే ఉంది. చమత్కార మేమంటే పద్యగేయాలు వ్రాసేవారు వచనకవులకు పాలకవర్గం వంటివారు. వారు స్వయంగా పీడితవర్గంలా బాధపడతారు. సాహిత్యరంగంలో కూడా వర్గ భేధాన్ని పాటిస్తారు అభ్యుదయవాదులు అదే వారికి ఆయుస్సూత్రం. విప్లవం వస్తుందో రాదో విస్సన్న కెరుక గాని, సాహిత్యసహృదయభావంలో మాత్రం సమైక్యత లేకుండా పోతోంది.

వచన కవిత అయితేనేం, ప్రాచీనకవిత అయితేనేం, అరస కవిత్వ మైతేనేం, విరస కవిత్వ మైతేనేం - కవిత్వాన్ని అధ్యయనం చేయకపోతే అది కటాక్షించటం కల్ల ! వచన కవిత్వానికి కూడా కొంత నియతి ఉండాలి. అది రచయిత, సామాజికుడు తెలిసి సృజించాలి, సమర్థించాలి అని శ్రీ కుందుర్తిగారు భావిస్తూండడం అధ్యయనాన్ని ఆహ్వానించటమే ! అధ్యయనమే అభ్యుదయానికి చిహ్నం. అభ్యుదయ మనే మాటకు అర్థాన్ని తెలుసుకోవాలన్నా, అభ్యుదయ వాదంలోని అంతరార్థాన్ని తెలుసుకోవాలన్నా అధ్యయనం చేయాలి. అధ్యయనం చేయాలి. అధ్యయనానికి అరలు లేవు పొరలు లేవు- సీమలు లేవు కామాలు లేవు - నిషేధాలు లేవు నిందలు లేవు - పద్య మనీ లేదు గద్య మనీ లేదు. కళ్ళకు గంతలు కడితే సాగదు అధ్యయనం. నిగ్గు తేల్చడమే నిజమైన అధ్యయనం. నిజం చెప్పటమే నిలిచే అధ్యయనం ! కవితలోని లోతును, ఎత్తును దర్శించేది అధ్యయనం ! మనిషిలోని మమతను, మనీషిని చూపించేది అధ్యయనం !

కవితకు అధ్యయనం సమతకు సందర్శనం !
కవితకు అధ్యయనం నవతకు అభ్యుదయం !

---

[ఈ వ్యాసం యువభారతి వారి 'సాహిత్యాధ్యయనం' (1977) లో ప్రచురితం]

# ABHINAVA LOCHANAM

by Dr. G. V. SUBRAHMANYAM
M. A., Ph. D.,

నవోదయ లహరిలో మీ వ్యాసము ('రాయప్రోలు సుబ్బారావు')ను నా చూపు అనుకూలించినంత చదివాను. బాగున్నది. మీరు కవి హృదయమును, కవితా హృదయమును తాకగల రనిపించింది. భావమును విశదీకరించేటందుకు చాల యోగ్యంగా వున్నది మీ శైలి. ఇది gift.

—ఆచార్య రాయప్రోలు సుబ్బారావు.
(23-6-1978)

శరీర తత్త్వాన్ని తెలుసుకోవాలంటే నాడి పట్టిచూడాలి, గుండె చప్పుళ్ళను కొలిచి చూడాలి. సాహిత్య విమర్శకూడా అలాంటిదే. తీసుకున్న విషయాన్ని విమర్శించేటప్పుడు ముందు దాని అంతస్సును పట్టుకోవాలి. ఆ అంతస్సూత్రం ఆధారంగా అంగాంగ పరిశీలనం చేయాలి. ఇది ఉత్తమ విమర్శన పద్ధతి.

సుబ్రహ్మణ్యంగారు ఈ పద్ధతికి చెందినవారు. ప్రాచీన ఆధునిక దృక్పథాలనూ, ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాలనూ లోతుగా పరిశీలించి, తర్కసహంగా సమన్వయించడంలో ఆయన సమర్థుడు. ఆత్మతత్త్వాన్ని ఆవిష్కరించడం వల్లనే ఆయన విమర్శలకు అంతటి ప్రామాణికత.

—ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి.
(14-1-1983)